


# చతుర

జూన్ 1983

సంపుటి : 6
సంచిక : 5


## ఈ నెల సమగ్రనవల

ఆడపిల్లల్నే ఆకట్టుకునే అందం ఆమెది. చదువులో సరస్వతి, వినయ విధేయతలకు మరోపేరు. ఎందరో యువకులు ఆమె ప్రేమభిక్షకోసం ప్రాధేయపడ్డారు. ఉన్నత కుటుంబీకులు ఆమెను కోడల్ని చేసుకోవాలను కున్నారు....అయినా సుకుమారంగా పెరుగుతున్న ఆమె హృదయకమలా న్నెవరూ స్పందింపజేయలేకపోయారు. ప్రేమ.... పెళ్ళి అనేవి ఆమె మనసులో స్థానం పొందలేకపోయాయి. ఆమె నిర్లిప్తధోరణి భగ్నప్రేమికుల ఆత్మహత్యకు సైతం దారితీసింది.

అలాంటి స్థితిలో అనుకోనివిధంగా ఆమెను ఆకర్షించి, ఆకట్టుకుని, ఆమె....

# 'హృదయకమలం'

అందుకుని అపురూపంగా ఆరాధించి ఆమెచేత కూడా ఆరాధింపజేయ బూనుకున్న ఆ సాహసి ఎవరు? సాంప్రదాయాన్ని సహా మన్నించి గౌరవించే కుటుంబంలోని యువతి అయిఉండి కూడా తన కులం, మతం, జాతి, చివరికి దేశం వాడు కూడా కాని అతన్ని ఆమె ఎలా అంగీకరించి తన హృదయ కమలాన్నర్పించగలిగింది....?

'స్రవంతి'

ప్రేమ, కులం, జాతి, అవధుల్ని గురించి నూతనకోణం నుండి పరిశీలించి ప్రతిభావంతంగా రూపొందించిన సరికొత్త నవల 'హృదయ కమలం' ఈ నెల చతుర సమగ్ర నవల.

కవరు పేజీ : దిలీప్ బెనర్జీ
రెండవ కవరు, మూడవ కవరు : సుధీర్ బాబ్జీ

# రచయితలకు ఆహ్వానం

**ఇతివృత్తంలో, రచనా సంవిధానంలో నూతనత్వం చూపగల రచయితలకు 'చతుర'లో నెల నెలా నవలల పోటీయే! ప్రచురించే ప్రతి నవలకూ రు. 1500, అత్యుత్తమ నవలకు రు. 2000 పారితోషికంగా అందజేసే నవనవలా వేదిక 'చతుర'.**

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు 'చతుర'లో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షం లోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రా గానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్ళు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ వళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

GKHL.882.86 TL

# షష్ఠర ప్రపంచం

## డ్రైవర్ మంత్రి

రిపోర్టర్లందరూ వేడివేడి కాఫీ తాగుతూ కుతూహలంగా ఆ కొత్తరకం బస్సువైపు చూశారు. తమిళనాడు బస్సుల మంత్రి ముత్తుస్వామిగారు ఆ బస్సు గురించి వివరిస్తున్నారు. కాఫీలవగానే రిపోర్టర్లందరినీ బస్సుదగ్గిరకి తీసికెళ్ళారు మంత్రిగారు స్వయంగా.

"బస్సు గురించి కాస్త వివరంగా చెపుతారా?" అనడిగారు పాత్రికేయులు. జవాబుగా ఆయన అందరికీ కవర్లు అందించారు. కవరు తెరిచి చూస్తే ఒక గ్రీటింగ్ కార్డ్ కన్పించింది అందరికీ.

ఓ క్షణం ఆశ్చర్యపోయి- "గ్రీటింగ్ కార్డ్ బాగానే వుందనుకోండి. మరి ప్రెస్ నోట్ వంటిదేమీ ఇవ్వరా?" అనడిగారు కొందరు.

"మీరు ప్రశ్నలడుగుతూ పోతే జవాబులు అవే పరిగెత్తుకొస్తాయ్" నవ్వుతూ అన్నారు మంత్రిగారు. రిపోర్టర్లు అడిగిన ప్రశ్నలన్నింటికీ ఓపిగ్గా జవాబులు చెప్పారు మంత్రిగారు.

"దేశంలో ఆధునిక సౌకర్యాలతో ప్రప్రథమంగా ప్రారంభించబడిన ప్రత్యేక బస్సు అది. విదేశాల్లోని టూరిస్టుబస్సులకి ఏమాత్రం తీసిపోదు. అందులో హాయిగా రైళ్ళల్లో లాగానే పడుకొని ప్రయాణం చేయవచ్చు. రైల్లోలాగే పైన, కింద బెర్తులుంటాయి. బస్సు ఎయిర్‌కండిషన్ చేయబడింది. ఈ బస్సును రైలు సౌక



ర్యాలుగల రూట్లలో గాక ఇతర రూట్లల్లో ప్రవేశ పెడతారు. గంటకి 50 కిలోమీటర్ల వేగంతో నడిచే ఈ బస్సులో హంస తూలికా తల్పంమీద శయనించినంత హాయిగా అందరూ నిద్రపోవచ్చు..." అని చెప్పుకుపోతున్నారు మంత్రిగారు.

"అవును. ఒక్క-డ్రైవర్ తప్ప...." అని ఓ రిపోర్టర్ చమత్కరించాడు. రిపోర్టర్లందరూ బస్సెక్కి లోపల సదుపాయాలు పరిశీలించడం ప్రారంభించారు. ప్రతి బెర్త్‌కి ఓ దిండు వుంది. బెడ్‌లైటు, మినీ ఫాను వగైరా సౌకర్యాలున్నాయి. అవసరాన్నిబట్టి చిన్న మీట నొక్కితే చాలు బెర్త్ సీటులా మారిపోతుంది. ఆ బస్సుని రాష్ట్రప్రభుత్వ ఆధ్వర్యంలోని త్రివేండ్రమ్ రవాణా సంస్థ ఫాక్టరీలో రూపొందించారు. ఖరీదు ఐదు లక్షల రూపాయలు.

వివరాలన్నీ అందాక రిపోర్టర్లందరూ ఇక బయల్దేరదామా అన్నారు. మంత్రిగారు తలూపారు. రిపోర్టర్లు డ్రైవర్‌కోసం దిక్కులు చూస్తోంటే మంత్రిగారు చిరునవ్వులొలకబోస్తూ డ్రైవర్ సీట్లో కూర్చుని బస్సు స్టార్ట్ చేశారు. రిపోర్టర్లు నోళ్లు తెరిచేశారు.

## గులాబిముళ్లు

తెరమీద మనం పంచరంగుల్లో చూసే తారలు మెరుపుల్ని పూవుల దండగా ధరించి, గగనాన్ని వెచ్చని శయ్యగా చేసుకొని, మబ్బుల్ని మెత్తని దిండుగా వేసుకొని దివ్యమైన కలలు కంటూ స్వర్గసౌఖ్యాలు అనుభవించేస్తుంటారని చాలా మంది అనుకుంటారు. ఎంత పేరు ప్రతిష్ఠలూ, డబ్బూ, హోదా వున్నా వాటి వెనక కొన్ని సమస్యలూ ఎదురవుతాయి వారికి. గులాబీకి కూడా ముళ్లుంటాయన్నది పాత సంగతేకదా!

తారనుబట్టి ఆందోళనపడే తీరు మారుతుంటుందనుకోండి. సినిమా చిత్రీకరణ వరకూ వీరు పడే శ్రమ ఒకఎత్తయితే అది



పూర్తయి విడుదల అయేవరకూ పడే ఆందోళన మరో ఎత్తు. సినిమాని ప్రేక్షకులు ఆదరిస్తారా, తమ స్థానం ఎన్నాళ్లు పదిలంగా వుంటుంది లాంటి సమస్యలు పట్టి పీడిస్తుంటే మనశ్శాంతి ఎలా వుంటుంది పాపం?

దేవానంద్ తన చిత్రాలు వర్సనే ఫ్లాపయి పోయినప్పుడు కూడా దేవదాసు అవతారం ఎత్తలేదు. అలాంటి నిరాశకు చోటిస్తే మనిషివ్యక్తిత్వమే దెబ్బతింటుంది. జీవితంలో ఆనందం కరువవుతుందని అతని దృఢాభిప్రాయం. ఒకసారి మాత్రమే అతను భవిష్యత్ గురించి బాధపడ్డాడు.

రతీ అగ్నిహోత్రి ఇందుకు పూర్తి వ్యతిరేకం. ఆమె మోడలింగ్ వృత్తిలో చేరి ప్రముఖ మోడల్‌గా పేరొందినా ఆ స్థానం ఎన్నాళ్ళుంటుందోనని భయపడేది. సినిమాల్లో చేరాక సినిమా విజయవంత మవుతుందో లేదో, ఒకవేళ విజయవంత మయితే పరిశ్రమలో తన స్థానం ఎంత కాలం నిలబెట్టుకోగలదో అని ఒకటే ఆందోళన ఆమెకి. ఆమె సంపన్న కుటుంబంలోంచి వచ్చినదే అయినా ఈ ఆదాయం తగ్గిపోతుందేమో, ప్రిస్టేజ్ పోతుండేమోననే కంగారులోనే ఉండేది.

"అభద్రతా బావం మనిషిని మానసిక వికలాంగుడిని చేసి బలహీనుడ్ని చేస్తుంది" అన్నది రాజేష్‌ఖన్నా అభిప్రాయం. అతను ఓ నాలుగేళ్ల పాటు అలా బాధపడ్డాడుగానీ ఇప్పుడు ఇది వరకటి ఆందోళన లేదు.

"జీవితానికి భద్రతలేదన్న భావన మనం విచారించేకొద్దీ ఎక్కువవుతుంది. అందం చూసేవారి కళ్లల్లో వుంటుంది అన్నది జీవితానికి కూడా వర్తిస్తుంది" అని దీపక్ పరాశర్ అంటుంటాడు. కిశోర్ కుమార్‌కి ఎప్పుడు ఏమవుతుందోనన్న భయం వెంటాడుతూనే వుంటుందట.

గ్లామర్ తార జీనత్ అమన్ – చిన్నతనంలో అభద్రతాభావంతో బాధపడితే అది జీవితాంతం వెన్నాడుతుంటుందనీ; ఈ భావం బలహీనులు, బలవంతులు, వివాహితులు, అవివాహితులు అందర్లోనూ వుంటుందనీ అంటుంది. డబ్బు పెరిగేకొద్దీ కోరికలు, వాటితోపాటే బాధలూ పెరుగుతాయని జీనత్ అభిప్రాయం.

అమ్జాద్‌ఖాన్ డబ్బు లేనంతకాలం అలాగే బాధపడ్డాడు కానీ అనుకున్న పన్ని సాధించాక ఏ బాధా లేదతనికి. రాజ్‌బబ్బర్‌కి నాటకాలు వేసేటపుడు ఏ బాధా వుండేదికాదు. సినిమాల్లో ప్రవేశించాక సినిమా విడుదలై ఫలితం కోసం ఆత్రుతగా వేచిచూడటం బాధాకరంగా తయారయింది. కాబట్టి సినీతారలు మహా సుఖపడిపోతున్నారని మనం అనుకోనవసరంలేదు. పీత కష్టాలు పీతవి.

## వింతజాతి

వాళ్ళు పాముల్ని పూజిస్తారు. పాములతో కలిసి నివసిస్తారు. పాములతో సహపంక్తి భోజనాలు చేస్తారు. ఆఖరికి పాముల సరసనే శయనిస్తారు కూడా. ఒక్క మాటలో చెప్పాలంటే మహారాష్ట్రకి చెందిన జనెరా తెగవారి జీవనంలో పాములు అంతర్భాగం.

ఈ తెగవారి సంఖ్య రెండు—మూడు వందలకు మించపోయినా, ఒక్కో కుటుంబం వద్ద కనీసం 50 నుంచి 60 పాముల వరకూ వుంటాయి. పాము కాటు పడినవారి కోసం మందు తయారు చేయటం వీరి ప్రధాన వృత్తి. 'నాగబీల్'

# Artists...



We are on the look out for creative young men who have tried their hand at designs, lay - outs and illustrations.

They should also be good at Telugu and English lettering and free hand drawing. Reasonable exposure to such artistic works in a publication office is essential.

Those who do not have the experience but flair for creative expressions will also be considered as Trainees.

Salary commensurate with your creative talents. Applications supported by a few specimens of your work must reach :

The Personnel Department
VASUNDHARA PUBLICATIONS
Eenadu Compound
Hyderabad-500 004.

సితార

అన్నదాత చతుర విపుల

అనబడే ఈ పాముల మందుకి చాలా గిరాకి వుంది.

వేటలో మంచి ప్రావీణ్యం వున్న ఈ జాతివారు ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూనే వుంటారు. వేటలో శిక్షణ ఇవ్వడానికనీ, అనుభవం రావడానికనీ పిల్లల్ని కొంతవయసురాగానే వేటకి తీసుకెళతారు.

ఈ తెగలో వారు మగపిల్లలకి 'నాగపుత్ర' అనీ, ఆడపిల్లలకి 'నాగకన్య' అనీ ఇలా పాములకి సంబంధించిన పేర్లే పెడతారు. మార్చి, ఏప్రిల్ నెలల్లో సామూహిక నామకరణోత్సవం జరిపిస్తారు. ఈ సందర్భంగా వారం రోజులపాటు నృత్యగానాలు, విందు వినోదాలతో ఉత్సవం జరుగుతుంది.

వీరి నామకరణోత్సవం కూడా ఒళ్లు జలదరించేలా వుంటుంది. ముందు మట్టితో ఒక వేదిక నిర్మిస్తారు. ఈ తెగ నాయకుడు ఒక్కో పిల్లాడినో, పిల్లనో వేదిక మీద కూర్చోబెట్టి పాముని వారి మెడ చుట్టూ వేసి దాని తలను తన నోట్లో పెట్టుకొని వీరావేశంతో నృత్యం చేస్తాడు.

ఈ తంతు జరిగేటపుడు భయపడిన పిల్లలను తెగలో వుండటానికి అనర్హులుగా పరిగణించి బయటివారికి ఇచ్చేస్తారు. ఎందుకంటే పాములతో కలిసి జీవించడం ఈ తెగవారి విధుల్లో ఒకటి. అందుకని పాముల్ని చూసి భయపడేవారిని సాంఘికంగా వెలివేస్తారన్నమాట.

నామకరణోత్సవంనాడు మగపిల్లలకి కొత్తదుస్తులు ఇచ్చి వారిని పెద్దవారిగా ప్రకటిస్తారు. ఈ ఉత్సవం అనంతరం మగపిల్లలు ఆకు బీడీలు కాలుస్తూ కబుర్లు చెప్పుకోవచ్చు. పెద్దవాళ్ళతో కలిసి వేటలో పాల్గొనవచ్చు.

ఈ తెగలో పిల్లలు పుట్టగానే పెళ్ళిళ్ళు నిశ్చయిస్తారు. పెళ్ళిమాత్రం అమ్మాయికి 13 ఏళ్లు, అబ్బాయికి 15 ఏళ్లు పూర్తయినాకే జరుగుతుంది.

రెండువందల ఏళ్ళక్రితంనాటిదయిన బనెరా తెగ పూర్వపు ఆచారాల ప్రకారమే జీవిస్తున్నారు ఇప్పటికీ. నాగరిక సమాజంతో వీరికున్న సంబంధాలు అతిస్వల్పం. ఇప్పుడిప్పుడు వీళ్ళల్లో ఒకళ్ళూ ఇద్దరూ పట్నంలో కుందేళ్ళూ, పావురాలూ కొంటూ కన్పిస్తారు. అక్కడకూడా వీలయినంత



తక్కువగా మాట్లాడతారు. పని అయిపో గానే వారి ప్రాంతానికి వెళ్ళిపోతారు. నిలువెల్లా విషముండే మనుషులకన్న కోరల్లో మాత్రమే విషముండే పాముల ప్రపంచమే వీరికి హాయిగా అన్పిస్తుం దేమో!

# కృత్రిమ చర్మం

ఇదివరకయితే హఠాత్తుగా ఏ కొత్త పరి శోధన వార్తో వచ్చి ప్రజల్ని సంభ్ర మాశ్చర్య భరితులను చేసి ముక్కుమీద వేలేయించేవి. కాని ఈరోజుల్లో ఏ కొత్త విషయం కనుగొబడినా ప్రజలు ఆశ్చర్య పడనంతగా సైన్స్ అభివృద్ధి చెందింది... చెందుతోంది.

సాధారణంగా అగ్ని ప్రమాదాలలో ఒళ్లుకాలినవారికి శరీరంలోని ఫ్లూయిడ్స్ పోకుండావుండటానికి గాయాలమీద వేరే చర్మాన్ని అతికిస్తారు. దీన్నే 'స్కిన్ గ్రాఫ్ట్' అంటారు. ఈమధ్యవరకూ కాలిన గాయాలమీద వారి శరీరంలోని ఇతర భాగాల చర్మంగాని, ఇతరుల చర్మంగాని అతికి నయంచేయ వీలుంటుంది అను కొనేవారు. కాని రష్యాకి చెందిన ఒక సర్జన్స్ బృందంవారు కృత్రిమ చర్మం అనదగిన ఒక పదార్థాన్ని రూపొందిం చారు. పాలిమర్ పదార్థంతో తయారు చేసిన దూదిలాంటి ఈ కృత్రిమ చర్మాన్ని 'కంపుటెక్' అని పిలుస్తు న్నారు.

ఈ కృత్రిమ చర్మాన్ని గాయంమీద పరిస్తే గాయంలోకి సూక్ష్మక్రిములు వగైరా ప్రవేశించకుండా సహజచర్మం లాగే రక్షణనిస్తుంది. చర్మం పెరగటానికి అవకాశం కల్పిస్తుంది. కుట్లు వేయాల్సిన అవసరం లేకుండానే గాయానికి అతు క్కొని వుంటుంది. కాలిన గాయాలమీద దీన్ని పరచటంలో నొప్పి తక్కువగా వుందని చాలామంది రోగులు అన్నారట.

దీనివలన మరో ముఖ్యమైన ఉప యోగం వుంది. ఇతర బేండేజేస్‌లలాగా ఇది గాయానికి అతుక్కోదు. సహజ చర్మం పెరగ్గానే ఈ కృత్రిమ చర్మం దానంతటదే ఊడిపోతుంది. ఒక వేళ సహజ చర్మం పెరక్కపోతే ఇది శరీ రంలో చర్మంలా కలిసిపోతుంది.

ఒకసారి ఉపయోగించిన కంపుటెక్ 20 రోజులకి పైగా పనిచేస్తుంది. దీన్ని రెండేళ్ళపాటు దాచివుంచవచ్చు. ఎక్కడి కైనా సులభంగా పంపవచ్చు. అగ్ని ప్రమాద బాధితులకు ఇది నిజంగా వర ప్రసాదినే.



"రేణూ! పూజకు వేళయింది. పువ్వులు కోశావా తల్లీ?" స్నానం చేసి వస్తూ అడిగారు ముకుందరావుగారు.

"ఆ పనిమీదే వెళ్తున్నాను డాడీ!" భుజాలదాకా ఉన్న బాబ్డ్‌హెయిర్‌ని ఎర్రటి రిబ్బనుతో కట్టేస్తూ అంది రేణుక.

పదిహేను నిమిషాల తర్వాత భక్తిగా చేతులుజోడించి భగవద్ధ్యానం చేసి బయటికి వచ్చేసింది. డైనింగ్ టేబిల్ మీద భోజనం సిద్ధంగా ఉంది.

తల్లి వడ్డిస్తుంటే గబగబా భోంచేసింది.

ఏదో హిందీ పాట హమ్ చేస్తూ తన గదికి వెళ్ళి హౌస్‌కోటు విప్పేసి ఆలివ్ గ్రీన్‌కలర్ ఫారెన్ నైలెక్స్ చీర కట్టుకుంది. అదే రంగు జాకెట్టు. మొహానికి తేలిగ్గా సాండల్ పవుడర్ అద్దుకుని నుదుట కుంకుమ దిద్దుకుంది. తల దువ్వుకుని చీరమీద కొద్దిగా 'ఈవెనింగ్ ఇన్ పారిస్' స్ప్రే చేసుకుంది. చేతికి వాచి పెట్టుకుంటూ ఉండగా....

"రేణూ!" తల్లి పిలిచింది.

"వస్తున్నానమ్మా."

"టిఫిన్ బాక్స్ మరచిపోయావు" అంటూ వచ్చింది తల్లి విమలమ్మ.

"థాంక్యూ మమ్మీ!" అని టిఫిన్‌బాక్స్ బాగులో పెట్టింది రేణుక.

"ఉండు. పళ్ళరసం తెస్తాను" అని వెళ్ళింది విమలమ్మ.

తల్లి ఇచ్చిన పళ్ళరసం తాగేసి ఆమెకు 'బై' చెప్పి ఇంటికి వెనుకవయిపున్న బస్‌స్టాప్ చేరుకుంది రేణుక.

మద్రాసు మెడికల్ కాలేజిలో థర్డ్ ఇయర్ చదువుతుంది రేణుక.

"హాయ్, రేణూ!" అపుడే వచ్చిన శాంతి పలకరించింది.

శాంతి క్వీన్‌మేరీస్ కాలేజిలో బి.కాం. ఫైనలియర్ చదువుతోంది.

ఇద్దరూ మాట్లాడుకుంటూ బస్సుకోసం నిరీక్షిస్తున్నారు.

రేణుకవయిపు ముగ్ధదృష్టితోచూస్తూ మాట్లాడుతున్నది శాంతి.

అయిదడుగుల నాలుగంగుళాల ఎత్తు, పసిమి ఛాయ. ఎంతటివారినైనా పాదాక్రాంతులను చేసుకోగల వదనసౌందర్యం, అంతకుమించిన ఒంపుసొంపులు. తల వెంట్రుకలు మొదలు కాలి వేళ్ళదాకా శరీరంలో ప్రత్యణువు అపురూప సౌందర్యంతో మెరిసిపోతుంటుంది.

ఆ అందానికి మెరుగులు దిద్దే అలవాటు లేదు రేణుకకు. నుదుట ఎర్రగా మెరిసే కుంకుమ, చెవులకు బెంగాలీ రింగులుతో నిరాడంబరంగా నిండుగా, హుందాగా ఉంటుంది. చీర తప్ప మరో డ్రెస్సు ధరించదు. మగవాళ్ళను ఆకర్షించే ప్రయత్నం అసలు చేయదు. అయినప్పటికీ ఆ మహానగరంలో ఆమె కటాక్ష వీక్షణాలకోసం తపస్సు చేసేవారెందరో, ఆమె చిరునవ్వుకోసం పడిగాపులుగాచే వారెందరో లెక్కలేదు. ప్రేమలేఖల సంగతి సరేసరి. అయితే రేణుక హృదయాన్నింతవరకు ఎవరూ స్పృశించలేదు. తనేమో తన చదువేమో అంతే. మరో వ్యాపకం పెట్టుకోదు. ముభావంగా, గంభీరంగా ఉండే ఆమె అంటే కాలేజిలో అందరికీ జంకు, సంకోచం. అయినా తమ ఆరాధన ఆమె గుర్తించాలన్న తాపత్రయంతో ప్రేమలేఖలు రాస్తారు. రేణుక తను అందుకునే ఆ ప్రేమలేఖల్ని అసలు చదవదన్న సంగతి ఆ ఆరాధకులకు తెలీదు. కనీసం కవరు చింపే ప్రయత్నమయినా చేయక నిర్లక్ష్యంగా చెత్తబుట్టలో పడేస్తుందన్న సంగతి అసలే

తెలీదు.

"ఏయ్, శాంతీ! ఏమిటాలోచిస్తున్నావ్?" రేణుక అంది.

శాంతి ఉలిక్కిపడి చూసింది.

"ఏంలేదు. దేవుడు కొందరి విషయంలో మరీ పక్షపాతంగా ఉంటాడేమిటా అని ఆలోచిస్తున్నాను"

"ఇప్పుడు ఎవరి విషయంలో పక్షపాతంగా ఉన్నాడంటావ్?"

"నీ విషయంలోనే. లేకుంటే నిన్ను మాత్రమే ఎందుకింత అందంగా పుట్టించాడు?"

"నీ మొహం!" అని నవ్వి ఊరుకుంది రేణుక.

నవ్వినప్పుడు ఆమె బుగ్గల్లో పడే సొట్టల్ని ముగ్ధదృష్టితో చూసింది శాంతి.

బస్సుదిగి కాలేజి వయిపు వెళ్తుండగా డాక్టర్ జార్జ్ ఎదురయ్యాడు.

"మిస్ రేణుకా! నీతో మాట్లాడాలి. సాయంత్రం నా కోసం కొంత సమయం వెచ్చించగలవా?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు ఇంగ్లీషులో.

అతడేం మాట్లాడాలనుకుంటున్నాడో ఊహించలేనంత అమాయకురాలేంకాదు రేణుక. అయినా కాదనలేక, "అలాగే!" అంది ముభావంగా.

"థాంక్యూ!" అని వెళ్లిపోయాడు డాక్టర్ జార్జ్.

రేణుకకు విసుగ్గా, చికాగ్గా ఉంది.

తను మగాళ్ళకెంత దూరంగా ఉందా అని ప్రయత్నిస్తుందో తనకంత సమీపానికి రావాలని వాళ్ళు ప్రయత్నిస్తారు. తను ఎన్నుకున్న చదువు మగాళ్ళతో కలిసి మెలిసి ఉండక తప్పడంలేదు. ఆ చదువుతో తననాకర్షించాలని చూసే ప్రబుద్ధులు లేకపోలేదు. ఒక్కోసారి మగాళ్లను చూస్తేనే భయంవేస్తుంది. ఏ క్షణం ఎవరొచ్చి, 'డార్లింగ్, ఐ లవ్ యూ!' అంటారోనని బెదురుగా ఉంటుంది. తన నాకర్షించిన పురుషుడు తనముందు మోకరిల్లి ఆ మాటలంటే మనస్సు పరవశిస్తుందేమో, అణువణువు పులకరిస్తుందేమోగానీ తన దేహసౌందర్యంమాత్రమే చూసి తనతో కాస్తో కూస్తో పరిచయం ఉన్న ప్రతిఒక్కరూ ఏదో ఒక సమయం చూసి ఆ మాట చెప్పేందుకు ప్రయత్నించడం చూసి తనింత అందంగా ఎందుకు పుట్టిందా అని మథన పడుతుంటుంది రేణుక.

సాయంత్రం కాలేజీ అయాక విద్యతో కలిసి హోటల్‌కేసి వెళ్తుండగా వెనక నుండి,

"మిస్ రేణుకా!" అన్న పిలుపు వినిపించింది.

వెనుదిరిగి చూసింది రేణుక.

డాక్టర్ జార్జ్!

"విద్యా...నువ్వెళ్ళు. నాక్కాస్త పనుంది" అని ఆగిపోయింది రేణుక.

ఆమెవయిపు అనుమానంగా చూస్తూ వెళ్ళిపోయింది విద్య.

"ఎక్కడికి వెళ్దాం?" జార్జ్ అడిగాడు.

"ఇక్కడే లాన్స్‌లో కూర్చుందాం" ఎటోచూస్తూ అంది రేణుక.

ఇద్దరూ వెళ్ళి కాలేజి లాన్స్‌లో కూర్చున్నారు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

"ఏదో మాట్లాడాలన్నారు?" నిశ్శబ్దభంగం చేస్తూ అంది రేణుక.

ఆమె మొహంలోకి ఏదో వెదుక్కుంటున్నవాడిలా చూస్తూ "రేణుకా! నేను స్టేట్స్ వెళ్తున్నాను" అన్నాడు జార్జ్.



మారాం చేసేవారిని కూడా
మైమరిపించే ప్రియ
'ప్రియ' ఆకర్షణలో పడనివారు లేరు. మూత తీసీ తియ్యడంతోనే ఎన్నెన్నో రుచులూరిస్తుంది 'ప్రియ'. ఆకలి లేదని మారాంచేసే పిల్లలు కూడా 'ప్రియ' పచ్చళ్లు ఉండే ఆప్యాయంగా తింటారు.
వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో • అల్లం • గోంగూర • ఉసిరికాయ • చింతకాయ • పండు మిరపకాయ • వంకాయ
తీపిరకాలు : • మామిడికాయ • అల్లం.
ఎంతో రుచి... ప్రియ
priya
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

"విన్నాను" నిరాసక్తిగా అంది రేణుక.

"పెళ్ళిలోగా వీలయితే పెళ్ళి చేసుకుని సతీసమేతంగా వెళ్ళాలని నా అభిమతం"

"మంచిదే!" తలవంచుకుని గడ్డి పీకి పోగులువేస్తూ అంది రేణుక.

"రేణూ! నీకభ్యంతరంలేకుంటే నాతో జీవితం పంచుకోగలవా?" ఉద్వేగంగా అన్నాడు జార్జ్.

అతడివయిపు చూసింది రేణుక.

ఎర్రగా, పొడుగ్గా, దృఢంగా, నొక్కుల జుట్టుతో, ఆడపిల్లల గుండెల్లో గిలిగింతలుపెట్టే రూపం జార్జ్‌ది. అయినా రేణుకని ఆకర్షించలేకపోయిందతడి ఆకర్షణీయమయిన రూపం.

"సారీ" చిన్నగా అంది రేణుక.

"రేణూ!" దెబ్బతిన్నవాడిలా గిలగిల్లాడిపోతూ అన్నాడు జార్జ్.

ఎందరినో తిరస్కరించిన రేణుక తననూ నిర్దాక్షిణ్యంగా తిరస్కరించవచ్చునన్న అనుమానం అతడికి లేకపోలేదు. అయినా ఆ అనుమానం నిజమయేటప్పటికి భరించలేకపోయాడు.

"సారీ! మీకు ఆశాభంగం కలిగించానేమో! మీరంటే ఏనాడూ నాకటువంటి అభిప్రాయం కలగలేదు. అదీగాక మా డాడీ కులాంతర వివాహానికే సమ్మతించని మనిషి. మరి మతాంతర వివాహానికి అంగీకరిస్తారా?"

"మీ డాడీని కన్విన్స్ చేయలేరా?" ప్రాధేయపూర్వకంగా అన్నాడు జార్జ్.

"నాకా అవసరంలేదు" ముభావంగా అంది రేణుక.

"ఇంత నిర్దయగా కాదంటావనుకోలేదు. నీతో భవిష్యత్తుని ఎంతందంగా ఊహించుకున్నానో! నా కలలు కల్లలుగా మిగిలిపోవలసిందేనా? నీవు, నీ అనురాగం, నీ సహచర్యం లేక నేనెలా బతకను?" ఆక్రోశిస్తున్నట్లు అన్నాడు జార్జ్.

కాంతిహీనమయి పాలిపోయిన అతడి మొహం చూస్తుంటే రేణుకకు జాలివేసింది. ఇలా రోజుకొకరిని తిరస్కరించడం తనకూ దుర్భరంగానే ఉంది. కాని తనేం చేయగలదు? భగవంతుడు తనకిచ్చింది ఒక్కటే హృదయం. ఆ హృదయంలో ఒకరికే చోటుంటుంది. అతను... తన మనస్సు దోచుకునే ఆ ఘనుడెవరో?

జార్జ్ చప్పున లేచాడు. "థాంక్యూ. నా కోసం అమూల్యమయిన మీ సమయం వెచ్చించారు. థాంక్స్ ఒన్స్ ఎగెయిన్.... మిమ్మల్ని మళ్ళీ కలుస్తానోలేదో. విష్ యూ ఆల్ ది బెస్ట్!"

"సేమ్ టు యూ!"

గుడ్‌బై చెప్పి చరచర వెళ్ళిపోయాడు జార్జ్.

అతడు వెళ్ళినవైపు చూసి నిట్టూర్చి బస్‌స్టాప్‌కేసి నడిచింది రేణుక. ఆమె ఇంటికి వెళ్ళేటప్పటికి అన్నలు, వదినలు, అక్క, బావ అందరూ వచ్చి ఉన్నారు. సదా నిశ్శబ్దంగా ఉండే ఇల్లు పెద్దవాళ్ళ మాటలతో, పిల్లల ఆటలతో కేరింతలతో ఒకటే సందడిగా ఉంది.

రేణుక అందరినీ ఉత్సాహంగా పలకరించింది. ఆమెకు ముగ్గురన్నలు, ఒక అక్క. పెద్దన్న నిరంజన్ బ్యాంక్ ఆఫీసరు. రెండో అన్న శ్యామసుందర్ ఇంజనీరు. ఇద్దరూ హైదరాబాదే. మూడో అన్న మధుకర్ ఢిల్లీలో ఒక విదేశీ కంపెనీలో ఎగ్జిక్యూటివ్. అక్క నీరజ భర్త విజయవాడలో రైల్వే ఇంజనీరు. నీరజ కూడా అక్కడే లెక్చరర్‌గా వర్క్

చేస్తోంది. ప్రతి సంవత్సరం ఉగాదికి అందరూ మద్రాసులో తల్లిదండ్రుల వద్ద చేరిపోతారు. వారం పదిరోజులు సరదాగా గడిచిపోతుంది. అందుకే రేణుక ఉగాది కోసం వెయ్యి కళ్లతో ఎదురు చూస్తుంటుంది.

భోజనానంతరం పెద్దన్నలిద్దరూ బావతో పేకాటకూర్చున్నారు. మధుకి పేకాట సరదా లేదు. అందుకే అతను తండ్రి, చెల్లెళ్లతో మాట్లాడుతూ కూర్చున్నాడు. తోడికోడళ్లు ముగ్గురూ మరోచోట చేరారు.

"ఒంటిగంటయింది. ఇహ పడుకోండర్రా. పొద్దున్నే లేవాలి" అని హెచ్చరించింది విమలమ్మ.

తన గదికి వెళ్లి పడుకున్న రేణుకకు డాక్టర్ జార్జ్ గుర్తొచ్చాడు.

ఆమె హృదయం చీల్చుకుని వేడి నిట్టూర్పొకటి బయలువెడలింది.

డాక్టర్ జార్జ్ అందగాడు. జీవితంలో ఉన్నత శిఖరాలందుకోవాలన్న తాపత్రయం ఉన్నవాడు. అందుక్కావలసిన తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు, ఉత్సాహం ఉన్న అతడితో జీవితం పంచుకోవాలని ఎందరోఅమ్మాయిలు ఉవ్విళ్లూరుతున్నారే! అయినా తను ... తన హృదయపు టంచులనయినా స్పృశించలేని అతడిని జీవితభాగస్వామిగా ఎలా అంగీకరించ గలదు?

తల విదిలించి నిద్రకుపక్రమించింది.

• • •

తెల్లవారితే ఉగాది.

అందరూ తలంటిస్నానంచేసి నూతన వస్త్రాలు ధరించారు. ఉగాది పచ్చడి రుచి చూసి జీవితం అంటే కారం, పులుపు, చేదు, తీపి అనుభవాల మేలు కలయిక అని మరోసారి గుర్తు చేసుకున్నారు. మధ్యాహ్నం పిండివంటలతో భోజనం చేసి సరదాగా ఒక తెలుగు సినిమా చూసి వచ్చారు.

మర్నాడు పొద్దున్న అయిష్టంగానే కాలేజికి వెళ్లింది. సాయంత్రం గేటు వద్ద కాచుకుని ఉన్న మధు అన్నయ్యని చూసి ఉత్సాహంగా అతడిని సమీపించింది. ఆమె ననుసరించింది విద్య.

విద్యను చూసి, "ఏమ్మా కులాసా?" వాత్సల్యంగా అడిగాడు మధు.

చిరునవ్వుతో తల ఊపింది విద్య.

"వదిన, బాబిగాడు ఎలాగున్నారు?"

"నిక్షేపంగా ఉన్నారు. రేపాదివారం ఇంటికి రారాదూ? సాయంత్రందాకా ఉండి పద్దువుగాని!"

"తప్పక వస్తానన్నయ్యా!" చిరునవ్వుతో అంది విద్య.

మరి కాస్సేపు మాట్లాడి వెళ్లిపోయింది విద్య.

హోటల్లో కాఫీ తాగి బీచికెళ్లి కూర్చున్నారు అన్నాచెల్లెలు.

"రేణూ, ఒక మాటడగనా?" మధు అన్నాడు.

"అడుగు!"

"నీ మనస్సులో ఎవరయినా ఉన్నారా?" తటపటాయిస్తూనే అడిగాడు మధు.

ఆశ్చర్యంగా చూసింది రేణుక. "ఊహు, ప్రస్తుతం ఖాళీగానే ఉందిలే మనస్సు. ఏం ఎందుకు?"

"పెళ్ళి గురించి నీ అభిప్రాయం?"

మరింత ఆశ్చర్యంగాచూసింది రేణుక. "ఏమిటో ఈ రోజు నీ మాటలు వింతగా ఉన్నాయే? చదువుతో నాకు పెళ్ళి గురించి ఆలోచించే తీరికే లేదు. అయినా ఇప్పుడు నా అభిప్రాయం ఎందుకు?"

"ప్రేమించికాని పెళ్ళి చేసుకోకూడ దన్న పట్టింపు నీకుందేమోనని..." అర్థోక్తిలో ఆపేసి చెల్లెలి వయిపు చూశాడు మధు.

"అన్నయ్యా! ఈ డొంకతిరుగుడు మాటలెందుకుకాని చెప్పదలచిన విష యాన్ని సూటిగా చెప్పు" నిర్మొహ మాటంగా అంది రేణుక.

"నా ఫ్రెండ్ ఆనంద్ తెలుసుకదా.."

"ఎవరు? సినీ హీరో ఆనందేనా?"

"అవును. అతనే..."

"అతడికేమయింది?"

"ఏమీ కాలేదు. నువ్వు ఒప్పుకుంటే పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడదామను కుంటున్నాడు."

"మంచిదేగా! మధ్య నా అంగీకార మెందుకు?"

"ఎందుకంటే... అతను నిన్ను చేసుకోవాలని ఆకాంక్షిస్తున్నాడు. రేణూ! నువ్వంటే అతను చాలా ఇష్టపడు తున్నాడు. అదృష్టవశాత్తూ అతనిది మన కులమే కనుక డాడీ కూడా సుముఖంగానే ఉన్నారు. నువ్వు ఒప్పు కుంటే..."

"అన్నయ్యా! పెళ్ళికి కులం ఒక్కటే ముఖ్యమా?" తీక్షణంగా అంది రేణుక.

మధు మాటల కోసం వెదుక్కుం టున్నట్లు చూశాడు.

"నా కాబోయే భర్త నాలాంటివాడే అయి ఉండాలని నేనాశించడం తప్పం టావా?"

రేణుకే మళ్ళీ అంది. "జీవితంలో అన్నిటికన్న ముఖ్యంగా ఉండవలసింది సౌశీల్యమని నమ్మే చాందసురాలిని నేను. మీ ఆనంద్ శీలానికెంత ప్రాధాన్యత నిస్తాడో అందరికీ తెలుసు. రోజుకో స్త్రీని మార్చుతాడంటారే! వద్దన్నయ్యా...అటు వంటి వ్యక్తి నీడను కూడా భరించలేను నేను. నా భర్త నాలాగే సామాన్యుడయి ఉంటే నాకంతేచాలు. నా జీవితంలో అతనొక్కడే ఉంటాడు. అలాగే అతడి జీవితంలో నేనొక్కదాన్నే ఉండాలి.

ఏ ఆనంద్ లాంటి వ్యక్తికి అలా భార్యే సర్వస్వంగా బత కడం అంత సులభం కాదనుకుంటాను. అతడి ప్రపంచం చాలా పెద్దది. ఎన్నో పరిచయాలు, మరెన్నో అనుబంధాలు. కొన్ని కొన్ని సందర్భాలలో భార్యతో గడిపే తీరికే ఉండకపోవచ్చు. అటువంటి పరిస్థితులతో రాజీపడే విశాల హృదయం నాకు లేదు బాబూ. అయినా ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకునే ఉద్దేశం నాకు లేదు..."

"పాపం ఆనంద్ డిస్సపాయింట్ అవుతాడేమో!"

రేణుక మాట్లాడలేదు.

మధు చెల్లెలికేసి నిర్నిమేషంగా చూస్తుంటే...

"ఏమిటన్నయ్యా, అలా కొత్తగా చూస్తున్నావ్?" అంది రేణుక నవ్వుతూ.

"నీ అందానికితగ్గ వరుడు లభిస్తాడా? అని"

"అందుకేనా మీ ఆనంద్‌గారిని రికమండ్ చేసావ్?"

ఆలోచించు రేణూ! ఆనంద్ నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. పెళ్ళయినా నీ చదువుకి భంగం వాటిల్లదు. పైగా నువ్వుకోరితే పైచదువులకు విదేశాలు పంపడానికి సైతం సిద్ధంగా ఉన్నాడు. అత్యంతాధునికమయిన నర్సింగ్‌హోం నిర్మించి పెడతానంటున్నాడు..."

"అన్నయ్యా!" మధ్యలోనే అందుకుని అంది రేణుక – "నగలు, కార్లు, బంగళాలు ... వీటిమీద మోజులేదు

నాకు. పైచదువుల నిమిత్తం విదేశాలు వెళ్ళాలన్న కోరికాలేదు. ఇక్కడి చదువు చాలు నాకు. మారుమూల కుగ్రామంలో వర్క్ చేసేందుకు కూడా సిద్ధమే. నేను కోరుకునేదల్లా నాకోసమే జీవించే వ్యక్తితో



ప్రశాంత జీవనం..."

"నువ్వేదో రహస్యం మనస్సులో ఉంచుకునే ఈ మాటలంటున్నావు. నిజం చెప్పు..నువ్వు ఎవరినో ప్రేమిస్తున్నావు కదూ?"

"లేదన్నయ్యా! శ్యామలక్క చావు కళ్ళార చూసి కూడా ప్రేమ మైకంలో పడేందుకు ఎన్ని గుండెలుండాలి? అసలు ప్రేమ, ప్రణయం .... ఈ మాటలు వింటేనే వెన్నులోంచి చలిపుట్టుకు వస్తుంది నాకు. అందుకే పెళ్ళయ్యాక భర్తను ప్రేమించవలసిందే తప్ప పెళ్ళికి ముందు ప్రేమ, గీమ జాన్తానై" నవ్వింది రేణుక.

మర్నాడుదయం విద్య వచ్చింది.

ఆమె మొహం పాలిపోయి ఎలాగో ఉంది.

"అలాగున్నావేం. ఏం జరిగింది?" అంది రేణుక ఆందోళనగా.

"పొద్దున్నే ఒక షాకింగ్ న్యూస్ విన్నాను."

"ఏమిటి?"

"డాక్టర్ జార్జ్ చనిపోయాడు. తెలుసా?"

నిశ్చేష్టురాలయింది రేణుక.

"ఎవరు చెప్పారు?" హీనకంఠంతో అంది.

"రోజూ పొద్దున్న అయిదుగంటలకల్లా లేచేవ్యక్తి ఎనిమిదిగంటలయినా గదిలోంచి బయటికి రాకపోవడంతో ఇంట్లోవాళ్ళు అనుమానంతో తలుపులు విరగ్గొట్టిచూస్తే లోపల సీలింగ్ ఫానుకి వేలాడుతూ కనిపించాట్ట..."

కాళ్ళు నిలబడే శక్తి కోల్పోయినట్లు నుంచున్న చోటనే కూలబడిపోయింది రేణుక.

"మైగాడ్! ఎంతపని జరిగింది."

ఆమె మనస్సు తల్లడిల్లిపోయింది.

జార్జ్ ఆత్మహత్యకు కారణం తను అతడిని కాదనడమేనేమోననే అనుమానం పట్టి పీడించసాగిందామెను. ఇలా చేస్తాడని కల్లోనయినా అనుకోలేదు. ఛ, ఛ....ఇంత దుర్బల మనస్కుడేమిటి? తను కాదంటే మాత్రం డాక్టరుగా మనిషి ప్రాణాల విలువ బాగా తెలిసిన వ్యక్తి అయిఉండీ ఈ మార్గం ఎన్నుకోవాలా? కోరిక నెరవేరకపోయినంత మాత్రాన నిండు జీవితాన్నంతం చేసుకోవాలా? ప్రేమే జీవితంకాదు. జీవితంలో ఒక భాగం మాత్రమే ప్రేమ. ప్రేయసే జీవిత సర్వస్వంకాదు. తను నవ్వినప్పుడు నవ్వి, ఏడిచినప్పుడు ఓదార్చే ఆత్మీయులు



ఎందరో ఉన్నారు. ప్రేమ విఫలమయి నంత మాత్రాన బలవంతంగా ప్రాణాలు తీసుకుని చన్నవాళ్ళు, తోబుట్టువులు,

స్నేహితులు, ఆత్మబంధువులు, శ్రేయోభిలాషులు అందరి గుండెల్లో చిచ్చురగిలించాలా? తన కారణంగా ఒక మంచి వ్యక్తి చనిపోయాడంటే ఈ జన్మలో తనకు మనశ్శాంతి ఉంటుందా?

రేణుక విపరీతంగా చలించిపోయింది. ప్రేమ ఇంత బలవత్తరమయిందా? ప్రేమించినవ్యక్తి కాదన్నంత మాత్రాన బతుకుమీదే విరక్తి పుట్టించేంత శక్తివంతమయిందా?

"రేణూ! ఏమిటలాగయిపోయావు?" రేణుక భుజాలుపట్టి కుదుపుతూ ఆదుర్దాగా అంది విద్య.

"ఏమీలేదు. సమాజానికి ప్రయోజనకారి అయిన ఒక మంచి డాక్టరు తొందరపడి ఆత్మహత్యచేసుకున్నాడంటే వ్యధగా ఉంది..."

"మనకే అలా ఉంటే అతడిమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లిదండ్రులకు ఎలా ఉండాలి? డాక్టర్ జార్జ్‌లాంటి వ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడంటే అతడి మనస్సు ఎందుకో తీవ్రంగా గాయపడి ఉండాలి.

రేణుక తల వంచుకుంది.

"ఆఖరి చూపులు చూసి వద్దామా?'' విద్య అంది.

"తప్పకుండా" అని ఇంట్లోచెప్పి విద్యతోబాటు డాక్టర్ జార్జ్ ఇంటికి వెళ్ళింది రేణుక.

నిన్నటిదాకా చురుగ్గా చైతన్యస్రవంతిలా చుట్టివస్తున్న మనిషి ఈనాడు ప్రాణాలులేని కట్టె. ఇంకాసేపట్లో భూస్థాపితం అవుతాడు. ఒక విధంగా అతడి జీవితం అలా పరిసమాప్తి కావడానికి కారణం తనే అనుకుంటే ఆమెకు ఆపుకోలేనంత దుఃఖం కలిగింది. అతడి కాళ్ళదిక్కున కూర్చుని వెక్కివెక్కి ఏడవసాగింది.

విద్య అనునయంగా ఆమె భుజం నొక్కింది.

జార్జ్ తల్లిదండ్రులగోడు చెప్పనలవి కాకుండా ఉంది. అతని ఒక్కగానొక్క చెల్లెలు ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది.

ఇంతమంది దుఃఖానికి కారణం తనే అనుకుంటే రేణుక హృదయం మరింతగా కృంగిపోయింది.

సాయంత్రం ఏడ్చిఏడ్చి ఉబ్బిపోయిన కళ్ళు, మొహంతో ఇల్లుచేరింది. ఎవరెంత చెప్పినా ఆరాత్రి పచ్చిగంగ ముట్టలేదామె.

* * *

రోజులు గడిచిపోతున్నాయి.

రేణుక అన్నలు, వదినలు, అక్క, బావ అందరూ వెళ్ళిపోయాక తల్లిదండ్రులతో ఒంటరిగా మిగిలిపోయింది రేణుక. డాక్టర్ జార్జ్ మరణం ఆమెలో అనూహ్యమయిన మార్పు తెచ్చింది. ఎప్పుడూ పరధ్యానంగా స్తబ్దుగా ఉంటోంది.

ఆమెలో మార్పు కనిపెట్టి ఓ రోజు విద్య అడిగింది.

"నీలో ఏదో మార్పు స్పష్టంగా కనిపిస్తున్నది. ఏం జరిగిందో చెప్పవూ?"

రేణుక చెప్పేసింది.

విని నిట్టూర్చింది విద్య.

"నేను మగాళ్ళను రెచ్చగొట్టేలా అలంకరించుకోను. నేనేమో నా చదువేమోగా ఉంటాను. ఒక్క నీతో తప్ప మనక్లాసులో తక్కిన లేడీ స్టూడెంట్స్‌తో కూడా అవసరానికి మించి ఒక్కమాట మాట్లాడను. అయినా నా వెనుక ఇలా పడతారెందుకూ ? అందంగా పుట్టడమే నేను చేసిన నేరమా ? జార్జికి నా పట్ల

అటువంటి అభిప్రాయం ఉండచ్చునని నేను ఊహామాత్రంగానయినా అనుకోలేదు. వ్యక్తిగతంగా నీతిమంతుడు. వృత్తి రీత్యా ప్రజ్ఞావంతుడు. అందుకే అతనంటే నాకెంతో గౌరవం. అతడు సర్జరీలో స్పెషలైజేషన్‌కి స్టేట్స్ వెళ్తున్నాడని తెలిసి అందరికన్నా ఎక్కువ ఆనందించాను. నా మనసులో అతడంటే గౌరవమే తప్ప మరే భావాలు లేవు. అందుకే అతడి కోరిక కాదన్నాను. అంతమాత్రాన ఎంతో జీవితం చూసినవాడు, సమాజంలో బాధ్యతాయుతమయిన హోదాలోనున్నవాడు. అలా బలవంతంగా ప్రాణాలు తీసేసుకోవాలా ? ఒక ప్రజ్ఞావంతుడైన డాక్టరు నా కారణంగా చనిపోయాడంటే నాకెంత చిత్తక్షోభగా ఉందో చెప్పలేను" ఆవేదనగా అంది రేణుక.

"నువ్వంత కఠినంగా అతడిని తిరస్కరించి ఉండకూడదేమో!" నెమ్మదిగా అంది విద్య.

"నిన్ను పెళ్ళాడ్డం నాకిష్టం లేదని మృదువుగా చెప్పినా, కఠినంగా చెప్పినా ఒకటేగదా"

"పోనీ ఒప్పుకుని ఉంటే?"

"జీవితాంతం కలిసి మెలిసి బతకవలసిన స్త్రీ పురుషుల మధ్య ఉండవలసింది గౌరవభావం కాదు విద్యా... రెండు మనసులను ఏకంచేసే అనురాగం. నా కతని ఎడల అటువంటి అభిప్రాయం ఏనాడూ లేదు. పైగా నీకు తెలుసుగా డాడీకి కులమతాల పట్టింపు మరీఎక్కువ. డాడీ కిష్టంలేని వివాహం చేసుకుని ఆయన మనస్సు నొప్పించలేను."

"ఒకవేళ భవిష్యత్తులో ఏ క్రైస్తవ మతానికో, మహమ్మదీయ మతానికో చెందిన యువకుడు నీ మనస్సు నాకర్షించడం జరిగితే?"

క్షణం సేపు మౌనంగా ఉండి "అప్పుడు నా మనస్సును చంపుకుంటానే తప్ప నన్ను కంటిపాపలా చూసుకునే డాడీ మనస్సు నొప్పించను" అంది రేణుక స్థిర నిశ్చయకంఠంతో.

విద్య మరి మాట్లాడలేదు.

సాయంత్రం ఇంటికి వెళ్ళిన రేణుకకు ఇంటి ముందు పూల మొక్కల మధ్య గార్డెన్ చెయిర్‌లో కూర్చుని ఏదో వేదాంత గ్రంథం దీక్షగా చదువుతూ కనిపించారు తండ్రి.

"హల్లో డాడీ, ఈ రోజేమీ ప్రోగ్రాం లేదా? తీరిగ్గా ఇంట్లోనే కూర్చున్నారు" పలకరించింది రేణుక.

"ఈరోజు ముఖ్యమయిన ప్రోగ్రాం ఏమీ లేదమ్మా. అందుకే వెళ్ళలేదు. కూర్చో !" కూతురు వంక ఆపేక్షగా చూస్తూ అన్నారు ముకుంద రావుగారు.

రేణుక కూర్చుంది.

"మీకీ మధ్య ఆధ్యాత్మిక చింతన ఎక్కువయింది డాడీ" అంటూండగా లోపల్నుండి తల్లి వచ్చింది.

"కాఫీకి లోపలికి రాకుండా ఇక్కడే కూర్చున్నావేమిటే ? ఇంద కాఫీ" అంటూ కూతురికి కాఫీ గ్లాసందించింది.

"అమ్మాయి పెళ్ళిచేసే ఉద్దేశం ఏమన్నా ఉందా ? లేక ఇలాగే వేదాంత గ్రంథాలు చదువుతూ కూర్చుంటారా?" రేణుక లోపలికి వెళ్ళాక విమలమ్మ అంది.

ఆశ్చర్యంగా చూశారు ముకుందరావు గారు. "లక్షణంగా చదువుకుంటున్న పిల్లకిప్పుడు పెళ్ళిచేయడమేమిటి?"

"ఆఁ పెద్ద చదువు చదువుతోంది మీ కూతురు. కూర్చుని మురిసిపోండి" విసుగ్గా అంది విమలమ్మ.

భార్య ధోరణి అర్థంకాలేదు ముకుంద రావుగారికి. రేణుక మెడిసిన్ చదువుతున్నందుకు తనకన్న ఆవిడే ఎక్కువగా మురిసిపోతుంటుందెప్పుడూ. మరిప్పుడీ విసుర్లేమిటి ? విమలమ్మే మళ్ళీ అంది "ఇదయ్యాక యం.డి. అంటుంది. ఆ తర్వాత అమెరికా అంటుంది''

"అంతంత పెద్ద చదువులు చదివాక అమ్మాయికి మనం చూసే వరుడు నచ్చుతాడా?" అంది విమలమ్మ.

ఆమె ఎదురుచూసినట్లే ముకుందరావుగారు ఆలోచనలో పడ్డారు.

''ఏమండీ! నాదో మాట!'

నొసలు చిట్లించారు ముకుందరావుగారు. "ఏమిటి?''

"మెడిసిన్ చదివే అమ్మాయిలు అబ్బాయిలు ఎక్కువగా కలిసి మెలిసి ఉంటారటగదా''

"అయితే?''

''అదికాదండి. విద్య చెప్పింది. మన రేణుని ఆకర్షించేందుకు ఎందరో అబ్బాయిలు ఎన్నోవిధాలా ప్రయత్నిస్తున్నారట. అమ్మాయి నిప్పులాంటిది. ఆకర్షణలకు, ప్రలోభాలకు లొంగిపోయేరకం కాదని నాకు తెలుసు. అయితే వయస్సు ప్రభావానికి లోబడకుండా ఉండడం మానవ తరంకాదు. అప్పుడు...." అని మాటలాపేసి భర్తవైపు ప్రాధేయపూర్వకంగా చూసింది విమలమ్మ.

''ఊఁ... అప్పుడు?''

''అప్పుడు మీరు అమ్మాయి మాట కాదనకూడదు. ఆమె కోరుకున్నవాడితో పెళ్ళి జరిపించాలి. అందుకిష్టమయితేనే రేపు అమ్మాయిని కాలేజీకి పంపండి. లేకుంటే చదువు మానిపించి పెళ్ళి ప్రయత్నాలు చేయండి''

ముకుందరావుగారు మాట్లాడలేదు.

''ఏమండీ! పెద్దమ్మాయి చావు ఇంకా నా హృదయంలో పచ్చిగానే ఉందండీ. మరోసారి గర్భశోకం తట్టుకునే శక్తి నాకు లేదండీ. అందుకే మీకు చేతులెత్తి మొక్కుతాను. ఆలోచించండి'' ప్రాధేయపూర్వకంగా అంది విమలమ్మ.

ముకుందరావుగారు మౌనంగా పుస్తకం అందుకుని చదవడం ప్రారంభించారు. విమలమ్మ లేచి లోపలికి వెళ్ళిపోయింది..

• • •

మధ్యాహ్నం లంచవర్లో రేణుక, స్నేహితురాండ్రు నవ్వులు, మాటల మధ్య టిఫిన్ బాక్సులు ఖాళీ చేస్తున్నారు.

"అన్నట్టు మీకో విషయం తెలుసా?" విద్య అంది.

"ఏమిటే?"

"మనలో ఒకరికి ఈరోజు బర్త్‌డే. ఎవరికో చెప్పుకోండి చూద్దాం!" నవ్వుతూ అంది విద్య.





ఒకరివయిపోకరు ఆరాగా చూసు
కున్నారందరూ.

చివరికి అందరి చూపులు రేణుకమీద

నిలిచాయి. ఎప్పుడూ నిరాడంబరంగా ఉండే రేణుక ఆరోజు ప్రత్యేకంగా అలంకరించుకుంది. తలంటు పోసుకుని, కుంకుమరంగు కంచిపట్టుచీర కట్టుకుని, కెంపుసెట్టు పెట్టుకుని శృంగార దేవతలా మెరిసిపోతున్నది.

"ఏయ్ దొంగా! నీకే కదూ ఈరోజు బర్త్‌డే?" ఉష అంది.

చిరునవ్వుతో తల ఊపింది రేణుక.

"హాపీ బర్త్‌డే టూ యూ" ముక్త కంఠంతో అన్నారు అందరూ.

"థాంక్యూ!"

"ఊరికే థాంక్స్ చెప్పడం కాదు. హోటల్ పామ్‌గ్రోవ్‌లో సాయంత్రం మాకు పార్టీ ఇవ్వాలి" లావణ్య అంది.

"ఓకే!" చిరునవ్వుతూ అంది రేణుక.

సాయంత్రం హోటల్లో ఎవరికి కావలసింది వారు ఆర్డరిచ్చాక తన కోసం అయిస్‌క్రీం తెప్పించుకుంది రేణుక.

యవ్వన సౌరభం వెదజల్లుతూ వసంత కన్యల్లా వెలిగిపోతున్న ఆ మెడికల్ కాలేజి విద్యార్థినులు హోటల్లో అందరి దృష్టిని ఆకర్షించారు. ముఖ్యంగా స్నేహితురాండ్ర మధ్య చుక్కల మధ్య చంద్రుడిలా వెలిగిపోతున్న రేణుకమీద చాలామంది మగాళ్ల దృష్టి స్థిరంగా నిలిచిపోయింది. వాళ్ల చూపులు చురకత్తుల్లా తగులుతుంటే తలవంచుకుని అయిస్‌క్రీం కప్పుమీదే చూపులు నిలిపి అయిస్‌క్రీం తింటున్నది రేణుక.

"రేణూ, ఏమిటే! పుట్టినరోజుగదా.... ఏమాత్రం ఉత్సాహం లేకుండా అలా మౌనంగా కూర్చున్నావు?" సీత అంది.

"మనం బలవంతంగా పర్సు ఖాళీ చేయిస్తుంటే తను ఉత్సాహంగా ఎలాగుంటుందే వెర్రిమొగమా?" నవ్వుతూ అంది విద్య.

"నీ మొహం!" అందంగా కసురుకుంది రేణుక.

"ఏయ్, చూసారా?" గుసగుసగా అంది వైదేహి.

"ఏమిటి?" ఎలిజబెత్ అంది.

"అటు చూడండి" అని ఒక దిశ చూపింది వైదేహి.

అందరూ అటు చూశారు ఆసక్తిగా.

ఫైనలియర్ కుసుమ, డాక్టర్! వరదరాజన్ ఈ ప్రపంచంతో సంబంధం లేనట్లు ఒకరివఋపొకరు ఆర్తిగా, తపనగా చూసుకుంటూ, మాట్లాడుకుంటూ టిఫిన్ ఆరగిస్తున్నారు.

"లవ్‌బర్డ్స్!" ఉత్సాహంగా అంది ఎలిజబెత్.

"తనేం బాగుంటుందని తన వెనక పడ్డాడు డాక్టర్ వరదరాజన్?" రూపసి అయిన ఉష కుసుమ వంక చులకనగా చూస్తూ అంది.

"లవ్ ఈజ్ బ్లయిండ్ అన్నారు. ఆమెలో అతడేమి అందాలు చూశాడో మనకేం తెలుసు? అసలు ప్రేమ ప్రధానంగా మనస్సుకి సంబంధించినది. మనస్సు ఎప్పుడు ఎవరి విషయంలో స్పందిస్తుందో మనకు తెలీదు" అంది సునంద.

"నిజమే. మనస్సు ఏ క్షణం ఎవరికేసి ఆకర్షింపబడుతుందో తెలుసుకోవడం మానవసాధ్యం కాదు. ఏది ఏమయినా ప్రేమించడం, ప్రేమింపబడడం ఒక మహత్తరమైన అనుభవం అంటాడు..."

"ఎవరే?"

"ఒక రచయిత !"

"అంతేనా ? ఇంకా ఎవరో అనుకున్నాను" కొంటెగా అంది భామ.

ఆమె భావం అర్థం చేసుకుని నవ్వేసింది ఎలిజబెత్.

"నేనింకా ఆ అదృష్టానికి నోచుకోలేదులే"

"ఏ అదృష్టానికి?" రేఖ అడిగింది.

"ప్రేమింపబడే అదృష్టానికి..."

"అదో పెద్ద అదృష్టమా?" అర్థోక్తిలో అంది రేణుక.

"రోజుకి పంద ప్రేమలేఖలు అందుకునే నీకు ప్రేమింపబడడం అదృష్టం అనిపించదేమో కాని నా దృష్టిలో ఒక మగాడి హృదయంలో ప్రణయజ్యోతి వెలిగించి అతడికి సమస్తంగా మారి, అతడికి ప్రాణమయి బతకడం ఒక వరంగా భావిస్తాన్నేను" భావావేశంతో అంది ఎలిజబెత్.

"నాకు మాత్రం ప్రేమ అన్నమాట వింటేనే ఒంటికి కారం రాసుకున్నట్లు భగభగ మండుతుంది. కంటికి కాస నదురుగా కనిపించే ఆడదాన్ని చూస్తే ప్రతి వెధవకూ పైత్యం ప్రకోపిస్తుంది. దానికే ప్రేమ అన్న పేరు పెట్టేసి ఆ స్త్రీ జీవితంతో ఆడుకునేందుకు తయారవుతారు. శోచనీయమైన విషయమేమిటంటే ప్రొఫెసర్లు, డాక్టర్లు సైతం ఈ మానసిక దౌర్బల్యానికి లొంగిపోడం. రానురాను మగాళ్ళను చూస్తేనే అరికాలి మంట నెత్తికెక్కుతోంది. మగవాసనే సోకనిచోటుకి వెళ్ళిపోవాలనిపిస్తోంది" రేణుక అంది.

"ఇప్పుడిలాగంటున్నావు కాని చూస్తుండు నువ్వే తలమునకలుగా ప్రేమలో పడతావు. అప్పుడు ప్రేమే నిత్యం ప్రేమే దైవం ప్రేమే సర్వం. కనక స్త్రీ పురుషుల్లారా...ప్రేమించండి. ప్రేమమాధుర్యంలో తేలిపొండి. జీవితాలను రసమయం చేసుకోండంటూ ప్రేమ ప్రచారం సాగిస్తావు" అని నవ్వింది లావణ్య.

రేణుక ముఖం చిట్లించి ఊరుకుంది.

అయిస్క్రీం తినడం పూర్తిచేసి పరధ్యాన్నంగా చుట్టూచూస్తూ కూర్చున్న ఆమె హఠాత్తుగా తుళ్ళిపడింది. చప్పున అన్నిశబ్దాలు ఆగిపోయి చుట్టు నిశ్శబ్దం, అతిమధురమయిన నిశ్శబ్దం వ్యాపించింది. ఆ నిశ్శబ్దంలో ఆమె గుండెల్లో చిరుగంటలు సుమధురంగా మోగుతుంటే, ఎన్నో జన్మల,యుగయుగాలనాటి ఏదో జ్ఞాపకం-అతి తీయని జ్ఞాపకం ఆమె హృదయపు అట్టడుగు పొరల్లోంచి ఉవ్వెత్తున లేచిపడే కెరటంలా అతివేగంగా పైకెగసిపడుతూ ఆమెను వివశను చేసింది. స్తబ్ధుగా ఉండే ఆమె మనస్సులో వర్ణనాతీతమయిన ఏదో సంచలనం, అలజడి, అణువణువున ఏదో పులకరింత, గుండెల్లో అనిర్వచనీయమయిన ఏదో స్పందన , ఏదో మైకంలో పడిపోతున్న అనుభూతి . . రేణుకలో ఈ సంచలనానికి కారణం.

వాళ్ళకు కొద్దిదూరంలో కూర్చుని ఉన్న ఒక యువకుడు బాగా ఎత్తుగా, బలిష్టంగా, చామనఛాయగా ఉన్నాడు. జుట్టు, నుదురు, కళ్ళు, ముక్కు, నోరు పూర్తిగా నీగ్రో పోలికలో ఉన్న అతను చెప్పలేనంత అందంగా, ఆకర్షణీయంగా ఉన్నాడు. అతనూ రేణుకవేపు అనిమిషంగా చూస్తున్నాడు.

ఇద్దరిచూపులు కలుసుకున్నాయి.ఇద్దరికిద్దరూ చూపులు విడదీసుకోకుండా ఒకరివేపు ఒకరు అలాగే తాదాత్మ్యంగా చూసుకుంటూ చుట్టూ ప్రపంచాన్నే మరచినట్లు కూర్చున్నారు.

"రేణూ..వెళ్దామా?" రేణుక భుజం

మీద తట్టి పిలిచింది విద్య.

సుందరస్వప్నం నుండి మేల్కొన్న దానిలా చూసింది రేణుక.

బస్సుకోసం ఎదురుచూస్తుండగా రోడ్డు కటువేపున్న పాన్‌షాపుముందు నిలబడి సిగరెట్ స్మోక్ చేస్తూ కనిపించాడు ఇందా



కటి నీగ్రో యువకుడు. అతడి చూపులు రేణుకమీదే నిలిచిఉన్నాయి. రేణుక అణువణువున ఏదో ఉద్వేగం, మాటలకందని ఏదో మధురానుభూతి.

బస్సువచ్చి ఆగింది. అయిష్టంగానే బస్సెక్కింది.

అతను ఎవరు?

పేరేమిటి?

ఏం చేస్తుంటాడు?

ఈ మహానగరంలో అతనెక్క డుంటాడు?

తను మళ్ళీ అతడిని చూస్తుందా?

మనస్సులో ఏదో ఆరాటం, అశాంతి, అస్థిమితం.

బస్సుదిగి ఇంటికేసి నడుస్తున్న రేణుక వెనుక బూట్లచప్పుడు వినిపించి వెనుదిరిగి చూసింది. లిప్తకాలం ఆమె గుండె ఆగిపోయింది. మరుక్షణం రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది. ఆమె శరీరం వెనక అందాలుచూస్తూ మెల్లిగా నడిచి వస్తున్నాడు ఆ యువకుడు. రేణుక వెనుదిరగటంతో అతడు చప్పున ఆగిపోయాడు. ఒకరివేపొకరు చూసుకుంటూ కొన్ని క్షణాలు అలాగే నిలబడిపోయారు. ముందుగా తెప్పరిల్లిన రేణుక చప్పున ఇంట్లోకి వచ్చేసింది. గేటు మూసేస్తూ చూసింది. అతను ఇంటివేపు పరిశీలనగా చూసి తలపంకించి వెళ్ళిపోయాడు. తననుసరించి అతను ఎందుకు వచ్చినట్లు? ఒకవేళ అతనూ ఈ పరిసర ప్రాంతాల్లో నివసిస్తున్నాడా? లేక తనెవరో, ఎక్కడుంటుందో తెలుసుకునే నిమిత్తం తన వెన్నంటి వచ్చాడా?

రేణుక ఉలిక్కిపడింది.

మగాళ్ళను విపరీతంగా ద్వేషించే తను ఈ రోజు ఒక మగాడిని గురించి, అదీ ముక్కు మొహం తెలీని నీగ్రోలాంటి



అపరిచితుడిని గురించి ఆలోచిస్తున్నది!

స్నానంచేస్తూ అతను గుర్తొచ్చి శరీరాన్ని చేతులతో కప్పుకుంది. ఒళ్లు జల్లుమంది. ముఖం ఎర్రగా కందిపోయింది. 'ఏయ్ మిస్టర్. ఎవరు నువ్వు? నా మనస్సులో చొరబడి అల్లరిచేస్తున్నావ్!'

మనస్సులో ప్రేమగా కసురుకుంది.

"అదేం తిండి తినడమే! కోడి కెలికినట్లు కెలికి లేచిపోతున్నావు" కూతురువేపు విడ్డూరంగా చూస్తూ అంది విమలమ్మ.

"ఆకలి లేదమ్మా"

"వయస్సు పిల్లకు ఆకలిలేకపోవడమేమిటే?"

రేణుక మాట్లాడకుండా డైనింగ్ టేబిల్ శుభ్రం చేయసాగింది. ఆ పని పూర్తయాక తన గదిలోకి వెళ్ళిపోయింది.

టేబిల్ ముందు కూర్చుని పుస్తకం తెర

చింది. పుస్తకం పేజీలో అతను స్నిగ్ధ దరహాసం చేస్తూ కనిపించాడు. ఎంతగా ప్రయత్నించినప్పటికీ చదువుమీద ఎప్పటిలా మనస్సు లగ్నంచేయలేకపోయింది. శరవేగంతో అతడికేసి పరుగులుతీస్తూ పారిపోతున్న మనస్సుని అదుపులో పెట్టడం అసాధ్యమయింది. గత్యంతరం లేక పుస్తకం మూసేసి వెళ్ళి పడుకుంది. ఆమెకసలు ఆరోజు చదవాలనిపించలేదు. వెచ్చగా పడుకుని తన మనస్సునింతగా కదిలించిన ఆ యువకుడిని గూర్చి ఆలోచించాలనిపించింది. ఆమె పెదవులు చిరునవ్వుతో అందంగా విచ్చుకున్నవి.ఎత్తుగా, బలిష్టంగా, అణువణువున మగసిరి ఉట్టిపడుతూ ఎంత ఠీవిగా, హుందాగా, ఆకర్షణీయంగా ఉన్నాడు! ఆ జుట్టు.... ఎంత బిరుసుగా, చిలిపిగా ఉంది! ఆ గుబురు వెంట్రుకలను తాను సవరించే రోజు వస్తుందా? బలిష్టమయిన అతడి బాహువుల మధ్య ఇమిడిపోయి అతడి గుండెచప్పుడు వింటూ...

రేణుక ఉలిక్కిపడింది!

ఈరోజు తనకేమయింది? అపరిచితుడయిన ఆ వ్యక్తినిగురించి ఇంత సన్నిహితంగా తనెలా ఆలోచిస్తున్నది! కొన్ని గంటలక్రితందాకా మగవాసనే సోకని చోటికి వెళ్ళిపోవాలనుకుంటూ మగాడినెంతగానో ద్వేషించిన తను ఇప్పుడు ఒక మగాడిని కోరుకుంటున్నది! అతడిని ఈ జన్మలో మళ్ళీ చూస్తుందోలేదో! అటువంటిది అతడిని గురించి ఇంతగా ఆలోచిస్తున్నదేమిటి? తల విదిలించి మంచం పక్కనే ఉన్న రేడియో స్విచ్ ఆన్ చేసింది.

'అంఖోమే తుమ్
హోటోంపె తుమ్
దఢ్కన్‌మె తుమ్
సాఁసోంమె తుమ్
దీవానా మై హోజాయెగీ' అమిత్ కుమార్ శ్రావ్యంగా పాడుతున్నాడు. తన ప్రస్తుత మానసిక స్థితికి అద్దంపట్టేలాగున్న ఆ పాటను పరవశంగా వింది రేణుక.

ఎవరతను?

తననింతగా ఆకర్షించిన అతడి పేరేమిటి?

ఏం చేస్తుంటాడు?

మధురోహలలో తేలిపోతూ కాలగతినే మరచిపోయి పడుకున్న రేణుకకు హఠాత్తుగా పదేళ్ళక్రితం ఒంటిమీద కిరోసిన్ గుమ్మరించుకుని కాల్చుకు చచ్చిపోయిన అక్క శ్యామల గుర్తొచ్చి పెనుగాలిలో చిగురుటాకులా వణికిపోయింది.

తన తండ్రికి పుట్టిన వాళ్ళకు ప్రేమించే స్వేచ్ఛలేదు.

జీవన సహచరుని ఎన్నుకునే స్వాతంత్ర్యంలేదు.

ఎంత చదువుకున్నా తండ్రి ఇష్టానికి తల వంచాల్సిందే.

తన మనస్సులోకి వేగంగా జొరబడుతున్న ఆ యువకుడిని ఇపుడే బయటికి గెంటెయ్యకపోతే తను మానసికంగా తీవ్రమయిన వ్యధకు గురికావలసివస్తుంది. శ్యామలక్కలాగే తన జీవితమూ విషాదాంతమవుతుంది.

రాగభావనలతో నిండిపోయిన మనస్సులో సన్నగా బాధ బయలుదేరింది.

• • •

మర్నాడుదయం హాస్పిటల్‌కి వెళ్ళేందుకు తయారయి బస్‌స్టాప్‌కి వచ్చిన రేణుక ఉలిక్కిపడింది. మరుక్షణం

ఆమె సుందర వదనం నెలరాజు సందర్శనంతో వికసించిన కలువలా వికసించింది. మనస్సు సంతోష నాట్యం చేసింది. బస్‌స్టాప్ వద్ద స్తంభాన్నానుకుని నిలబడి ఉన్నాడు నిన్నటి నీగ్రో యువకుడు. తెల్లపాంటులో నేవీబ్లూఫుల్ స్లీవ్స్ షర్ట్ టక్ చేసి నిన్నటికంటె అందంగా, ఆకర్షణీయంగా ఉన్నాడు.

ఇక్కడెందుకున్నాడు?

కొంపదీసి తనకోసం కాదుగద!

క్రీగంట అతడికేసి చూసింది.

నిర్నిమేషంగా ఆమె వంకే చూస్తున్న అతడి పెదిమల మీద కనిపించీ కనిపించకుండా చిరునవ్వు.

రేణుక గుండె లయ తప్పింది! బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. మరీ అంత సూటిగా చూస్తాడేమిటి? పైగా నవ్వడం....ఎవరయినా చూస్తే ఏమనుకుంటారు?

నిన్నటి ధ్యాసమంతా వృధా అయింది. మనస్సు మళ్ళీ పువ్వు చుట్టు భ్రమరంలా అతడిచుట్టూ పరిభ్రమించసాగింది.

"హలో...గుడ్మార్నింగ్"

ఉలిక్కిపడి చూసింది.

ఆమె క్లాస్‌మేట్ మహదేవన్.

"గుడ్‌మార్నింగ్" చిరునవ్వుతో అంది.

ఆమె పక్కనే నిలబడి ఏదో మాట్లాడసాగాడు మహదేవన్.

వాళ్ళిద్దరూ మెడికల్ స్టూడెంట్స్. పైగా క్లాస్‌మేట్స్. తరచు కలిసి చదువుకుంటూంటారు. ఆ సంగతిఆ చుట్టుపక్కల అందరికీ తెలుసు. అందుకే వాళ్ళ చనువుని ఎవరూ అపార్థం చేసుకోరు.

మహదేవన్‌తో మాట్లాడుతూ నీగ్రో యువకుడికేసి చూసింది రేణుక.

అతడు కళ్ళలో ఈర్ష్యాసూయలు నింపుకుని చూపులతోనే కాల్చేసేలా చూస్తున్నాడు మహదేవన్ని.

అతడి కళ్ళలో ఈర్ష్య గమనించి చకిత అయింది రేణుక. మరుక్షణం ఆమె మనస్సు తేలిపోయింది. ప్రేమ ఉన్నచోట ద్వేషం ఉంటుందంటారు. ఈయనగారు అపుడే తనను ప్రేమించడం ప్రారంభించినట్లుంది. అందుకే మహదేవన్‌తో తన చనువుని అపార్థం చేసుకుని ఈర్ష్యతో దహించుకుపోతున్నాడల్లె ఉంది. నవ్వొచ్చిందామెకు. 'డియర్ మీ,మహదేవన్ నాకు జస్ట్ ఫ్రెండ్. స్నేహం తప్ప మామధ్య మరేమీలేదు. కంగారు పడకు' అని చెప్పాలనిపించింది. అదే సమయం మహదేవన్‌తో మరింత చనువుగా మాట్లాడి ఆ నీగ్రో యువకుడిని ఏడిపించాలని కొంటెబుద్ధి పుట్టింది. అందుకే మహదేవన్‌తో ఎప్పటికన్న ఎక్కువ చనువుగా మాట్లాడింది.

మధ్య మధ్య కిలకిల నవ్వులు, కేరింతలు.

దొంగచాటుగా నీగ్రో యువకుడికేసి చూస్తూనే ఉంది. ఆమె ఎదురుచూసినట్లుగానే అతను ఉక్రోషంగా, నిస్సహాయంగా చూస్తున్నాడు.

బస్సు రావడంతో మహదేవన్‌తోబాటు బస్సెక్కింది. బస్సెక్కుతూ చూసింది.

అతడు అక్కడే నిలబడిచూస్తున్నాడు.

బస్సు దిగి హాస్పిటల్ కేసి వెళ్తూ యథాలాపంగా చూసింది.

బస్‌స్టాప్ వద్ద స్కూటర్ మీద కూర్చుని ఇటే చూస్తున్నాడు అతను. చిన్నగా నవ్వుకుంది రేణుక.

తన వివరాలు తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. తెలుసుకుని ఏం

చేస్తాడు? ప్రేమిస్తున్నానని ఉత్తరం రాస్తాడా?

ఆమె బుగ్గల్లో మందారాలు విచ్చుకున్నాయి. ఆ రోజంతా అతడి ధ్యాసగానే గడిపింది. తనూ స్టూడెంటే కాబోలు. ఏం చదువుతున్నాడో? పేరేమిటో...?

సాయంత్రం విద్యతో కలసి హోటల్ కెళ్ళింది. కాఫీ సిప్ చేస్తూ విద్య ఏదో చెప్తుంటే వింటూ పరధ్యాన్నంగా చుట్టూ చూస్తున్నది రేణుక.

లోపలికి వస్తూ కనిపించాడు నీగ్రో యువకుడు. వస్తూనే ఎవరికోసమో వెదుకుతున్నట్లు ఒక్కక్షణం నిలబడి చుట్టూ కలయచూసాడు. రేణుకను చూడగానే అతడి కళ్ళలో కోటి మెరుపులు మెరిసాయి. ఆమె స్పష్టంగా కనబడేలా స్థలం చూసుకుని కూర్చున్నాడు. కూర్చుంటూ ఆమె వయిపు సూటిగా చూసాడు.

అతడి వయిపే చూస్తున్నది రేణుక చూడకుండా ఉండలేకపోతున్నది. క్షణం సేపు ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

రేణుక ఒళ్లు జల్లుమంది. చప్పున కళ్ళు దించుకుంది. ఆమె హృదయ క్షేత్రంలో ప్రేమ విత్తుపడి క్షణాల్లో మొలకెత్తి పెరిగి పెద్దదయి శాఖోపశాఖలుగా విస్తరించి పుష్పించింది. ఆ ప్రణయ సుమ సౌరభంతో ఆ చుట్టు పరిసరాలు గుభాళించాయి...

"విద్యా ... ఆకలిగా ఉందే !" గారాబంగా అంది రేణుక.

"మరో కప్పు కాఫీ తాగుతావా?"

"ఊహూఁ కాఫీ వద్దు"

"మరి?"

"ఏదయినా టిఫిన్ తీసుకుంటేనో?"

ఆశ్చర్యంగా చూసింది విద్య. "ఇందాకా వద్దన్నావు?"

"ఇప్పుడు తినాలనిపిస్తున్నదే"

"అయితే మసాలాదోసె తెప్పించుకుందాం. బాగుంటుంది"

"కాలే కడుపుకి ఏదో ఒకటి!"

నిజానికి రేణుకకు ఆకలి లేదు. అయితే టిఫిన్ సాకుతో మరి కాస్సేపు అక్కడే ఉండి అతడిని కళ్లారా కాస్సేపు చూసుకోవచ్చని రేణుక ఎత్తుగడ. పాపం అది తెలీని విద్య స్నేహితురాలికి నిజంగా ఆకలనుకుంది. రేణుక అతడి వయిపు చూసింది.

అతడి చూపులెప్పుడో ఆమె మీద స్థిరంగా నిలిచిపోయి ఉన్నాయి. ఇద్దరి మధ్య చూపుల సంభాషణ ప్రారంభమయింది.

హోటల్లోంచి బయటపడ్డాక విద్యతో కలిసి బస్టాపులో నిలిచింది. రోడ్డుకటు వయిపు స్కూటర్ పక్కన నిలబడి అతను!




ఇంటికి వెళ్లేటప్పటికి విజయవాడ నుండి సదాశివం బాబాయి, పిన్ని, వాళ్ళ అమ్మాయి సుజాత వచ్చి ఉన్నారు.

"హాయ్ బాబాయ్....ఎప్పుడొచ్చారు? పిన్నీ...కులాసా? ఏమే సుజీ..చదువంటే అప్పుడే బోరు కొట్టిందా, ఇంటర్‌తో ఆపేశావు?" అని ముగ్గుర్నీ ఒకేసారి

పలకరించింది రేణుక.

"వెళ్లి కాళ్లు చేతులు కడుక్కురామ్మా! నీ కిష్టమని అరిసెలు, పూతరేకులు తెచ్చాను" రేణుకవయిపు ఆపేక్షగా చూస్తూ అంది శారదమ్మ.

రేణుక వెళ్లి స్నానం చేసి బట్టలు మార్చుకుని వచ్చింది.

తెల్లని బట్టల్లో అప్పుడే కడిగిన ముత్యంలాగున్న రేణుకవైపు విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నది సుజాత.

రేణుక కన్న మూడేళ్లు చిన్నదైన సుజాత చామనఛాయగా అతిసామాన్య మైన రూపురేఖల్తో సంసారపక్షంగా ఉంటుంది. రేణుకకు మల్లె దేవుడు తనకూ అపురూప సౌందర్యం ప్రసాదించలేదని ఆమెకు చెప్పలేనంత దిగులు. రూపసి కాని ప్రతి కన్నెపిల్ల మనస్సులో జనించే అతిసహజమయిన బాధ అది.

రాత్రి అసలు విషయం తెలిసింది. సుజాతకు పెళ్ళి నిశ్చయమయింది. వరుడు ఇంజనీరు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సర్వీసులో ఉన్నాడు. బాగా ఆస్తిపరులు. వాళ్ళ అంతస్థుకి, అబ్బాయి చదువుకి తగ్గట్టు కట్నం యాభయి వేలిచ్చి అమ్మాయికి వంద తులాల బంగారం పెట్టి పెళ్ళి ఆడంబరంగా, అట్టహాసంగా చేయాలి. పెళ్ళి వచ్చేనెల ఇరవయి అయిదోతేదీ...అంటే సరిగ్గా నెలరోజు లుంది ఇంకా.

"కంగ్రాచ్యులేషన్స్!" అంది రేణుక.

సుజాత నవ్వి ఊరుకుంది.

ఆ రాత్రి రేణుక గదిలోనే పడుకుంది సుజాత.

"పెళ్ళికొడుకు బాగుంటాడా?" కుతూహలంగా అడిగింది రేణుక.

"ప్చ్! పర్వాలేదు."

"నీకు నచ్చాడా?"

"ఏమో!"

"అదేమిటే?" ఆశ్చర్యంగా అంది రేణుక.

సుజాత మంచం మీద లేచి కూర్చుని దిండు ఒళ్ళోకి తీసుకుంది.

"ఏమో అక్కా! పెళ్ళిచూపులప్పుడు అతడిని చూశాగానీ నా మనస్సులో ఎటు వంటి కదలికలేక ఎప్పటిలాగే స్తబ్ధగా ఉండిపోయింది. ఎప్పుడయినా అతను గుర్తొచ్చినా కథల్లో, నవలల్లో వర్ణించినట్లు శరీరంలో పులకరింతలుండవు. సినిమాల్లో లాగా మనస్సు మధురోహలలో తేలిపోదు. అతడికీ అంతేననుకుంటాను. నన్ను చూసి నప్పుడు మొహంలో ఎటువంటి ఉత్సాహం, కుతూహలంలేక నిర్లిప్తంగా ఉన్నాడు. బహుశా నాలాగే అతనూ పెద్దల ఇష్టానికి తలవంచి ఈ పెళ్ళి కంగీకరించాడను కుంటాను."

రేణుక మాటలాడలేదు.

ఆమెకు తెలుసు. ఈ దేశంలో ఎన్నో పెళ్ళిళ్లు అలాగే జరిగిపోతుంటాయి. పెళ్ళయిన కొత్తలో ఒకరి పట్ల ఒకరికి మోజు, ఆకర్షణ ఏర్పడినప్పటికి క్రమేణా పరస్పరం అనురాగం, ఆర్ద్రత పెరగక పోతే యాంత్రికంగా రాత్రి కోరిక తీర్చు కుంటూ, బిడ్డల్నికంటూ వివాహ బంధానికి కట్టుబడి ఉన్న దంపతులు ఎందరో!

"అక్కా!"

సుజాత వంక చూసింది రేణుక.

"నేనో మాటడగనా?"

చిత్రంగా చూసింది రేణుక. "అడుగు"

"నువ్వు... ఎవరినయినా ప్రేమి స్తున్నావా?"

మూడు రోజుల క్రితమయితే ప్రేమా

లేదు, దోమాలేదు అని కొట్టిపారేసి ఉండేది. కాని ఇప్పుడు ఆమె హృదయంలో ప్రణయజ్యోతిని వెలిగించిన ఆ యువకుడు ఆమె నోటంట ఆ మాటలు రానివ్వలేదు. మనోచక్షువులముందు అతడి రూపం ప్రత్యక్షమయింది. లవ్ ఎట్ ఫస్ట్ సైట్... తన విషయంలో నిజమయిందా? నిజంగా తను అతడిని ప్రేమిస్తున్నదా? లేకుంటే తన మనస్సు అహరహం అతడి చుట్టూ పరిభ్రమిస్తోం దెందుకని? అతడు గుర్తొస్తేనే తన అణువణువు పులకరించడానికి కారణమేమిటి?

రేణుక ఆలోచనలో పడింది. ఆలోచిస్తూనే పుస్తకం తెరచింది.

* * *

మరికొన్ని రోజులు గడిచాయి.

ఆ నీగ్రో యువకుడు ప్రతిరోజు క్రమంతప్పకుండా పొద్దున్న బస్‌స్టాపు వద్ద, సాయంత్రాలు హోటల్‌లోను హాజరవుతూనే ఉన్నాడు. చూపులతో రేణుకను నిలువెల్లా స్పృశిస్తూనే ఉన్నాడు. కళ్ళలో హృదయగతభావాన్ని స్పష్టంగా ప్రతిఫలింపచేస్తూనే ఉన్నాడు. మరెవరయినా తనకేసి అలాచూస్తే ఒంటిమీద తేళ్లు, జెర్రులు పాకుతున్నట్లు కంపరంగా ఫీలయే రేణుకకు అతడిచూపు వెచ్చగా, హాయిగా ఉంది. అతడి చూపులతో చూపులుకలిపి అడపాదడపా చిరునవ్వులు చిందిస్తూ తనకే తెలీకుండా అతడిని ఉత్సాహపరుస్తూనే ఉంది. మళ్ళీ తన అణువణువున నిండిపోతున్న అతడినుండి మనస్సును మరలించుకునేందుకు రాత్రిళ్ళు చన్నీటిస్నానాలు, భగవధ్యానాలు చేస్తూనే ఉంది.

ఆ రోజు ఆదివారం.

సుజాత చూడాలంటే మధ్యాహ్నం ఆమెను వెంటబెట్టుకుని జూకి వెళ్ళింది రేణుక. ఆఫ్రికన్ కోతులున్న బోను ముందు నిలిచి వాటికి బఠానీలు అందిస్తూ నవ్వుతూ సరదాగా పలకరిస్తున్నారు.

"హలో, డార్లింగ్!"

అతిమంద్రంగా సన్నిహితంగా మధురంగా వినిపించిందొక కంఠం.

చివ్వున పక్కకు తిరిగిచూసింది రేణుక.

ఆమె పక్కనే దాదాపు ఆమెనానుకున్నట్లుగా నిలబడి ఒక కోతిపిల్లకు అరటిపండునందిస్తున్నాడు ఆమె మనస్సుకత్యంత సన్నిహితంగా వచ్చేసిన ఆ యువకుడు. అతను సంబోధించింది తననే అని గ్రహించలేనంత అమాయకురాలేంకాదు రేణుక. ఆమె మొహం ఎర్రబడింది.

అంతదగ్గరనుండి చూస్తే అతడు మరింత ఆకర్షణీయంగా, సమ్మోహనంగా కనిపించాడు.

ఆమె తనవేపు చూస్తున్నదని గ్రహించి అతడు చప్పున ఆమెవంక చూసాడు.

రేణుక కంగారుగా చూపులు మళ్ళించుకుని "పదవే సుజీ పోదాం" అంది సుజాత చెయ్యి పట్టుకుంటూ.

వాళ్ళు జూలో తిరిగినంత సేపు వాళ్ళ వెనకే నీడలా తిరిగాడు అతను.

అక్వేరియం వెళ్తే అక్కడా ఎదురయాడు.

మెరీనా రెస్టారెంటులో అయిస్క్రీం తింటుండగా అక్కడా కనిపించాడు.

'ఏయ్! నా వెన్నంటి తిరగడంతప్ప నీకు మరోపనిలేదా?'

చూపులతోనే అతడిని నిలదీసింది రేణుక.

బీచికి వెళితే అక్కడా ప్రత్యక్ష

మయాడు.

"అక్కా! ఎవరే అతను? మధ్యాహ్నం నుండి మన వెనకే తిరుగుతున్నాడు" అంది.

"ఏమో, నాకుమాత్రం ఏమి తెలుసు?" ఎగసిపడుతున్న అలలవేపు చూస్తూ ముభావంగా అంది రేణుక.

దాదాపు ఎనిమిది గంటలదాకా అక్కడే మాట్లాడుకుంటూ కూర్చున్నారు ఇద్దరూ. వాళ్ళకు కొద్ది దూరంలో రేణుక వంకే చూస్తూ అతను.

సుజాత చూడకుండా అతడివేపు దొంగచూపులు చూస్తూనే ఉంది రేణుక.

ఆమె మనస్సులో ఎన్నో ఆలోచనలు, ఊహలు, కోరికలు....



"అక్కా! నా పెళ్ళికి వస్తావుకదూ?"

"ప్రయత్నిస్తాను."

"అలా కాదు. తప్పక రావాలి. లేకుంటే నేను పెళ్ళే చేసుకోను. అసలు పెళ్ళికి నువ్వు రావాలనే ముహూర్తం క్రిస్మస్ సెలవులప్పుడు వచ్చేలా నిర్ణయించారు తెలుసా?"

"అయితే తప్పకవస్తాను" చిరునవ్వుతో అంది రేణుక.

సుజాత ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

"మా మంచి అక్కయ్య!"

రేణుక అసంకల్పితంగా నీగ్రో యువకుడివంక చూసింది.

అతడి పెదవులమీద స్పష్టాస్పష్టంగా దరహాసం.

ఆమె మొహం రాగరంజితమయింది.

అంతలోనే ఏదో ఆలోచన కలిగి ఉలిక్కిపడింది.

సుజీ పెళ్ళికి విజయవాడ వెళ్తే వారం పదిరోజులు అతడి దర్శనభాగ్యం లభించదు. అమ్మో! అతడిని చూడకుండా తను బ్రతగ్గలదా? పెళ్ళికి వెళ్ళకుంటే సుజీ ఊరుకోదు. ఇప్పుడేమి చేయడం?

* * *

సుజాత పెళ్ళి నాలుగు రోజులుందనగా తల్లిదండ్రులతోబాటు రేణుక విజయ

వాడ వెళ్ళింది. అప్పటికే చాలామంది బంధువులు వచ్చేసారు. పిల్లల ఆటలతో, పెద్దల మాటలతో ఇల్లంతా సందడిగా, కళకళ్ళాడుతూ ఉంది. రేణుకను బంధువు లందరూ ఎంతో ఆపేక్షగా, గౌరవంగా పలకరించారు. అందరికీ నమ్రతగా సమాధానాలుచెప్పి పిన్ని ఇచ్చిన కాఫీ తాగి మేడమీద సుజాత గదికి వెళ్ళి పోయింది రేణుక.



స్నానంచేసి వచ్చి సుజాత పెళ్ళి బట్టలు, నగలు చూడసాగింది రేణుక.

ధవళ వస్త్రాల్లో పాలరాతి ప్రతిమ లాగున్న ఆమెను ముగ్ధదృష్టితో చూడ సాగింది సుజాత. ఎప్పుడూ నిరాభర ణంగా, సింపుల్ గా ఉండే రేణుక తల్లి బలవంతంతో నగలు పెట్టుకుంది.

''అక్కా! ఇప్పుడెవరయినా మనిద్దరిని

చూస్తే మనలో పెళ్ళికూతురెవరో తెలియక తికమక పడతారేమో!''

"నీ మొహం''

''అవునక్కా! నువ్వే పెళ్ళికూతురులా చక్కగా, కళకళ్ళాడుతూ ఉన్నావు. అసలు ఇప్పుడు నిన్నుగనక పెళ్ళికొడుకు చూస్తే ఈ అమ్మాయినెందుకు చూపలేదని పెద్దలతో దెబ్బలాడతాడేమో!''

రేణుక మొహం ఎర్రబడింది. ''నోర్ముయ్' అని కసురుకుంది.

సుజాత మాటలాడలేదు.

రేణుక ఆమె వయిపు పరీక్షగా చూసింది. భావశూన్యంగా ఉంది. సుజీ ఆ మాటలు ఎందుకన్నది?

పెళ్ళికొడుకు బాహ్య సౌందర్యానికి ప్రాధాన్యత ఇచ్చే వ్యక్తా?

సుజీకావిషయం తెలిసిందా?

ఒకవేళ అతడు నిజంగా అటువంటి వ్యక్తయితే అతడి సాహచర్యంలో అట్టే అందగత్తెకాని సుజీ సుఖపడగలదా?

రేణుక మనస్సు కలతచెందింది. అదే సమయంలో తన మనస్సునంతకంతకు ఆక్రమించుకుంటున్న యువకుడు గుర్తొచ్చాడు.

ఈ రోజుల్లో మగాళ్ళు చాలామంది బాహ్య సౌందర్యానికే ప్రాధాన్యతనిస్తున్నారు.

అతనూ అటువంటివాడేనా?

కావచ్చు! కనకనే తన అందంచూసి తన వెనక పడుతున్నాడు. ఆ మాట నిశ్చయంగా చెప్పవచ్చు.

అటువంటప్పుడు అతడిని నమ్మవచ్చా? అతడితో అనుబంధం ఆశించవచ్చా?

పైగా విదేశీయుడు. ఆపైన చేతినిండా డబ్బున్నవాడని చూస్తేనే తెలుస్తుంది. అటువంటివాడు తన ప్రేమకు విలువనిస్తాడా!

ఇలాగే తనను చూసి చూసి, వెంటాడి వెంటాడి ఎలాగోలా తనను వశపరచుకుని తనమీద మోజు తీరాక తిరిగిచూడకుండా తన దేశం పారిపోతాడేమో!

అలా జరగదన్న నమ్మకంలేదు.

అతనెటువంటివాడో తనకు తెలీదు.

ఊహూ...అతడిపట్ల తన మనస్సులో ఏర్పడిన ఆకర్షణను ఆదిలోనే తుంచెయ్యడం మంచిది. లేకుంటే తన జీవితంలో ఎటువంటి పరిణామాలు ఏర్పడుతుందో ఎవరు చూడొచ్చారు?

ఆ క్షణంనుండి అతడిని గురించి ఆలోచించరాదని నిర్ణయించుకుంది. అయితే ఒకసారి మనస్సులో ప్రేమభావం జనిస్తే దాన్ని అంతమొందించడం అంత సులభంకాదని ఆమెకు తెలీదు.

* * *

తల్లిదండ్రులు, తోబుట్టువు వచ్చారని తెలిసి మర్నాడు సాయంత్రం రేణుక అక్క నీరజ వచ్చింది. "నిన్నసగా వచ్చారు. నన్ను పలకరించి వచ్చేందుకు క్కూడా మీకు తోచలేదు కదూ? అసలు ఈ ఊళ్లో నేనున్న సంగతే మరచిపోయినట్లున్నారు" నిష్ఠూరంగా అంది.

అక్క చేతిలోనుండి పాపనందుకుంది రేణుక.

దీప్తికి రెండేళ్లు. తెల్లగా, బొద్దుగా, అందంగా,రబ్బరు బొమ్మలా ముద్దొస్తోంది. రేణుక మొహం చూసి ఏడుపుకప్రారంభించింది.

నీ చదువెలా సాగుతోంది?''

చప్పున తన మనస్సు దోచుకున్న నీగ్రో యువకుడు గుర్తొచ్చాడు రేణుకకు.

"ఏవమ్మా మరదలా" అంటూ వచ్చింది కిరణ్మయి. ఇంతలో "హాయ్, వదినా! ఎప్పుడొచ్చారు?'' ఉత్సాహంగా లేచి ఎదురు వెళ్తూ అంది రేణుక.

"ఇప్పుడే!'' దీప్తి నెత్తుకుని ముద్దు పెట్టుకుంటూ అంది కిరణ్మయి.

"అన్నయ్య?"

"అందరు కలిసే వచ్చాము''

మధు, శ్యాంసుందర్‌లు వచ్చారు గదిలోకి.

చెల్లెళ్ళిద్దరిని పలకరించి అలసటగా ఉందంటూ మంచం మీద మేనువాల్చాడు శ్యాంసుందర్. పడుకున్న తక్షణం నిద్ర కొరిగాడు.

మధు, నీరజలు ఒక్కచోట చేరి మాట్లాడుకుంటున్నారు.

రేణుక, కిరణ్మయి ఒక దగ్గర చేరారు.

''అన్నట్లు పెద్దన్నయ్య రాలేదెందుకని?"

"ఎంత ప్రయత్నించినా సెలవు దొరకలేదట. వీలయితే ఎల్లుండి సాయంత్రానికి వచ్చేస్తానన్నారు"

ముహూర్త సమయానికి నిరంజన్ వచ్చేశాడు. సుజాత మొహం వికసిత పద్మమే అయింది. పెళ్ళికొడుకు శంకర్‌ని చూసిన రేణుక మనస్సు అసంతృప్తితో నిండిపోయింది. నల్లగా, పొట్టిగా, లావుగా చింతమొద్దులాగున్న అతను సన్నగా, నాజూగ్గా పూతీవెలాగుండే సుజాతకు ఈడుజోడులా లేదనిపించింది. అయినా పెద్దలు నిర్ణయించిన పెళ్ళి. ఈడు జోడు ఎలాగున్నప్పటికీ, ఇష్టాలు, అభీష్టాలు ఉత్తర దక్షిణ ధృవాలయినప్పటికీ సర్దుకుని జీవితాంతం కలిసి బతకాలి. సుజాత స్థానంలో తను లేనందుకు ఆ క్షణం ఎంతో సంతసించింది రేణుక.

తక్కిన అందరితోబాటు రేణుకనూ కాబోయే బావగారికి పరిచయం చేసాడు రవీంద్ర. రేణుక అపురూప సౌందర్యం చూసి ఊపిరిపీల్చడం మరచిపోయాడు శంకర్. మొట్టమొదటిసారి తనని చూసినప్పుడు ఎందరో మగాళ్లు అలాగే మంత్రముగ్ధుల్లా స్తంభించిపోవడం రేణుక కలవాటే. అయితే తన చెల్లెలికి కాబోయే భర్త తనకేసి అలా చూట్టం ఆమెకు కంపరం పుట్టించింది. పెళ్ళిపీటల మీద కూర్చున్నప్పుడు సైతం అతడి చూపులు తననే వెంటాడటం గమనించి నొసలు చిట్లించింది. ఆలోచించి వెళ్ళి సుజాత వెనక కూర్చుంది. అక్కడ కూర్చుంటే అతడికి తనను చూసే అవకాశం లేదు.

రేణుక మనస్సు శాంతించింది.

మనస్సు కోరుకునేవాడు తనకేసి చూస్తే ఎంత వెచ్చగా, హాయిగా, పరవశంగా ఉంటుందో తక్కినవాళ్లు చూస్తే అంత కంపరంగా, జుగుప్సగా ఉంటుందన్న నిజం ఆరోజు స్పష్టంగా గ్రహించింది రేణుక.

అగ్నిసాక్షిగా, వేదమంత్రాల మధ్య పెద్దలు ఆశీర్వదిస్తుండగా, మంగళ వాద్యాలు మోగుతుండగా సుజాత శంకర్ అర్ధాంగి అయింది.

'డార్లింగ్, మన జీవితాల్లో ఇటువంటి శుభదినం వస్తుందా?'

నీగ్రో యువకుడిని తలచుకుంటూ తియ్యగా అనుకుంది రేణుక.

* * *

తల్లిదండ్రులతో బాటు ఆరోజే మద్రాసుకు తిరిగొచ్చింది రేణుక. సెంట్రల్ స్టేషన్లో రైలు దిగుతుండగా

ఎన్నడూ ఎరుగని సంతోషోద్వేగంతో మనస్సు ఊయలలూగింది.

తనకెంతో ప్రియతముడయిన ఆ యువకుడిని మళ్ళీ చూడబోతోంది. ఆమె అణువణువు పులకరించింది.

ఎప్పుడు తెల్లవారుతుందా, అతడి నెప్పుడు చూస్తానా అన్న ఆరాటంతో ఆ రాత్రి కంటిమీద రెప్పవేయలేదు. క్షణాలు యుగాలుగా అస్థిమితంగా, అసహనంగా, అతి దీర్ఘంగా గడిచిందా రాత్రి. అతడి ఆలోచనలతోనే తూరుపు తెల్లవారింది.

స్నానం చేసి పువ్వులుకోస్తూ వేగంగా కొట్టుకుంటున్న గుండెలతో బస్‌స్టాప్‌కేసి చూసింది.

అతడు మామూలుగా నిలిచే చోట స్టయిల్‌గా స్తంభాన్నానుకుని నిలబడి స్మోక్ చేస్తూ ఇటే చూస్తున్నాడు.

లేత నీలిరంగు హవుస్‌కోటులో ఉన్న రేణుకను చూసి అతడి కళ్ళు మెరిసాయి.

తను ఆరోజు ప్రత్యేక శ్రద్ధతో అలంకరించుకుంది. నిలువుటద్దం ముందు నిలిచి వివిధ కోణాల్లో తన అందం చూసుకుంది. తన రూపం తనకే ముద్దొచ్చింది. వంగి అద్దం మీద ప్రతిబింబాన్ని ముద్దు పెట్టుకుంది.

'అతడు తననిలా ముద్దుపెట్టుకునే రోజు ఎప్పుడొస్తుంది?'

శరీరంలో అణువణువు మధురానుభూతితో తుళ్ళిపడుతుండగా, కోటి కోరికలతో మనస్సు తేలిపోతుండగా బస్‌స్టాప్‌కేసి నడిచింది. అప్పటికింకా ఎవరూ రాలేదు. బస్‌స్టాపులో ఒక చివర అతను, మరో చివర రేణుక. యధాలాపంగా చూసినట్లు అతడి వయిపు చూసింది. అతను ఆమె వంకే తదేకంగా చూస్తున్నాడు. ఇద్దరి చూపులు క్షణంలో సగం సేపు కలుసుకున్నాయి. రేణుక చప్పున కళ్లు దించుకుంది. ఆమె మనస్సులో, శరీరంలో అణచిపెట్టినా అణగారని ఏదో ఉద్వేగం.

తనకేమయింది?

ఈ యువకుడిని చూస్తే తన మనస్సు అదుపుతప్పి పిచ్చిగంతులు వేస్తోందేమిటి! చదువు పూర్తయేదాకా ప్రేమ, పెళ్ళి గొడవలు పెట్టుకోకూడదని ఇన్నాళ్ళూ ఎంతో నిగ్రహంగా ఉంది. ఇతగాడి విషయంలో తన నిగ్రహం పూర్తిగా సడలిపోతున్నది. అంతకంతకూ తన మనస్సులోకి, రక్తమాంసాల్లోకి చొచ్చుకుపోతూ, తన ప్రాణమయిపోతున్నాడు. ఇతడి ఆకర్షణ నుండి తప్పించుకోవడం ఎలా?

"హాయ్, రేణూ!"

ఉలిక్కిపడి చూసింది రేణుక.

అమల.

ఏదో హోటల్లో రిసెప్షనిస్టుగా ఉంది అమల. మగాళ్ళను రెచ్చగొట్టేలా డ్రెస్ చేసుకునే అమలంటే రేణుకకు సదభిప్రాయం లేదు. అయినా పలకరించినప్పుడు పలకడం సంస్కారం. అందుకే, "హలో!" అంది ముభావంగా.

"ఊరెళ్లావా....ఇన్నాళ్ళూ కనిపించలేదు?" అంది అమల.

"అవును విజయవాడ వెళ్ళాను."

"ఏమిటి విశేషం?"

"మా కజిన్ సిస్టర్ పెళ్ళి."

అమల ఏదో చెబుతుంటే పరధ్యాన్నంగా వింటున్నది రేణుక.

"రేణూ! టి.వి. ఆర్టిస్టుల్ని సైతం ఆకర్షిస్తున్న నీ అందం నిజంగా అద్వితీయం. అందుకే నిన్ను చూస్తే నాకు ఈర్ష్య" అంది అమల.

"టి.వి. ఆర్టిస్టెవరు? నేను ఆకర్షించడమేమిటి?"

ఆ యువకుడిని చూపుతూ, "చూడు అతనే విక్టర్. నీకేసి ఎలా చూస్తున్నాడో! అతడికి స్కూటరుంది. అయినా బస్సు కోసం వేచి ఉన్నవాడిలా గంటల తరబడి ఇక్కడే నిలబడి ఉంటాడు. ఇక్కడున్నంతసేపు అతడి చూపులు నీమీదే. నువ్వు బస్సెక్కిన మరుక్షణం స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోతాడు"

"అతడి పేరు నీకెలా తెలుసు?" ఉద్వేగంగా అంది రేణుక.

"నాకేమిటి మద్రాసులో టి.వి. చూసే అందరికీ తెలుసు. ఏం, నువ్వు టి.వి. చూడవా?"

"ఉహుఁ నాకా అలవాటు లేదులే"

కాస్సేపట్లో బస్సు వచ్చింది. అందర్తోబాటు గబగబ వెళ్ళి బస్సెక్కింది రేణుక.

"రేణూ...గమనించావా?" అమల అంది.

"ఏమిటి?"

"బస్సు స్టార్టయింది. అతను వెళ్ళిపోతున్నాడు. అతను ఇక్కడికి రావడం నిజంగా నీకోసమే!" గొప్ప రహస్యం కనిపెట్టినదాన్లా అంది అమల.

రేణుక హృదయం సంతోషంతో ఉప్పొంగిపోతున్నది.

'విక్టర్!' తియ్యగా అనుకుంది.




ఆరోజు డిశంబర్ ముప్పయి ఒకటి. సంవత్సరంలో చిట్టచివరి రోజు!

ఆ సంవత్సరం తన జీవితాన్ని, అనుభవాలను సమీక్షించుకుంది రేణుక. అందరి సంగతేమో కాని తనకీ సంవత్సరం సరదాగా, ఉత్సాహంగా గడిచిపోయింది.

చదువు విషయంలో కూడా ఫర్వాలేదు. సంతృప్తికరంగానే గడిచింది. ముఖ్యంగా తన జీవితంలో ఒక తియ్యని మలుపు...

తన మనస్సులోకి, ఆలోచనల్లోకి అనూహ్యంగా ఒక పురుషుడు ప్రవేశించాడు. బొత్తిగా అపరిచితుడయిన ఆ వ్యక్తి తనలో నిద్రాణమయి ఉన్న స్త్రీత్వాన్ని తట్టిలేపాడు.

నూత్న సంవత్సరంలో తన కోరిక నెరవేరుతుందా?

తను అతడికి చేరువవుతుందా?

* * *

రాత్రి పన్నెండు గంటలప్పుడు చదువుతున్న పుస్తకం మూసి అతడిని గురించి ఆలోచిస్తూ పడుకుంది.

క్రిస్టియన్ అయిన అతను ఈ వేళప్పుడు నూతన సంవత్సరాగమనం కోసం ఎదురు చూస్తూ చర్చిలో ఉన్నాడేమో ... లేక స్నేహితులతో కలిసి ఏ హోటల్లోనో ఎంజాయ్ చేస్తున్నాడేమో అనుకుంటూనే నిద్రలోకి జారుకుంది.

మర్నాడు జనవరి ఫస్ట్. కాలేజి లేదు. తిరిగ్గా తలంటి స్నానం చేసి పూజచేసి టిఫిన్ తిని ఇవతలికి వచ్చింది. అప్పటికే పోస్ట్ వచ్చి ఉంది. వాటిలో న్యూ ఇయర్ గ్రీటింగ్స్ ఎన్నో! స్కూలు రోజులప్పటి ఓల్డ్ ఫ్రెండ్స్, ప్రస్తుతం క్లాస్‌మేట్స్ స్నేహితులు ఆరాధకులు....

ఒక్కొక్కటే తీసి చూసి పక్కన

పడేస్తుంటే చివరి గ్రీటింగ్ కార్డ్ తీసి చూసిన రేణుక బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. విక్టర్ పంపాడు దాన్ని

అందమయిన ప్రేమికుల జంట. గగన మార్గాన తేలిపోతున్న నెలరాజును చూస్తూ ఒకరి ఒడిలో ఒకరు ఒదిగిపోయి ఉన్నారు.

తన గదిలోకి వెళ్ళిపోయి మంచం మీద పడుకుని ఆ చిత్రంకేసి తదేకంగా చూడసాగింది. అందులో ఉన్న యువతి స్థానంలో తనను, యువకుడి స్థానంలో విక్టర్ని ఊహించుకుంది. నరనరాల్లో విద్యుత్తు స్పృశ పాకినట్లనిపించింది.

"అమ్మాయ్, గుడికెళ్దాం వస్తావా?" విమలమ్మ కేకేసింది.

చప్పున లేచింది రేణుక.

మొహం కడుక్కుని సుజాత పెళ్ళికి పినతండ్రి పెట్టిన చీర కట్టుకుంది. నిమ్మపండు రంగు కంచిపట్టు చీర. చీర రంగు ఆమె శరీరం రంగుతో కలిసిపోయింది. అదేరంగు పట్టు జాకెట్టు. చేతులకు రెండేసి బంగారు గాజులు, మెడలో రెండు వరసలుగామడిచివేసుకున్న లాంగ్ చెయిన్, చెవులకు నక్షత్రాకారంలో బంగారు దుద్దులు....

ఆ అలంకరణలో స్వర్ణ ప్రతిమలా మెరిసిపోతున్న కూతురు వయిపు ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసింది విమలమ్మ.

'ఇటువంటి అపురూప సౌందర్యవతికి జన్మనివ్వడం కూడా ఒక విధంగా అదృష్టమే!' అనిపించిందామెకు.

"అమ్మా..నేను రెడీ!" చీరకుచ్చిళ్ళు సరిచేసుకుంటూ అంది రేణుక.

"పద, పోదాం."

ముకుందరావుతో చెప్పి ఇద్దరూ బయటికి వచ్చారు.

బస్ స్టాపులో ఎప్పట్లాగే స్తంభాన్నానుకుని నిలబడి ఉన్న విక్టర్ని చూసి ఉలిక్కిపడింది రేణుక.

'గాడ్, ఇతను ఎంతసేపుగా ఇక్కడిలా కాచుకుని ఉన్నాడు? తనను చూడాలన్న కోరిక అతనిలో అంత బలీయంగా ఉందా? పిచ్చికాకుంటే ఊరికే చూసినంత మాత్రాన ఏమొస్తుందతడికి?'

ఆమె హృదయం అనురాగార్ద్రమయింది. ప్రేమగా అతడినోసారి పల్కరించాలనిపించింది.మరుక్షణం వికృతంగా, భయంకరంగా కాలిపోయిన శ్యామల మృతదేహం మనో చక్షువుల ముందు ప్రత్యక్షమయి ఒళ్లు జలదరించింది. తన ఇంట్లో పుట్టినవాళ్ళకు ప్రేమించే స్వేచ్ఛలేదు. తన జీవిత భాగస్వామిని ఎన్నుకునే అధికారం లేదు. తండ్రి నిర్ణయానికి తలవంచి తీరాలి. అందుకే... అందుకే తన మనస్సులో చిగురిస్తున్న అనురాగ లతను ఇప్పుడే తుంచెయ్యాలి. లేకుంటే శ్యామలక్కలా తన జీవితమూ విషాదాంతం కావడం ఖాయం. అందుకే మనస్సు కఠినం చేసుకుని అతడివయిపు చూడకుండా ఉండిపోయింది.

సైదాపేటలో బస్సు మారుతుండగా తన వెనకే బస్సు ఎక్కుతున్న విక్టర్ని చూసి నొసలు చిట్లించింది.

ఆమె వెనకే దాదాపు ఆమెను తాకుతూ నిలబడ్డ అతనూ మైలాపూరుకే టిక్కెట్టు కొన్నాడు.

అతడి సామీప్యం రేణుకలో విద్యుత్తును ప్రవహింపజేస్తున్నది.

"అందమా, నీ పేరేనా రేణుక?"

రేణుక చెవిలో గుసగుసగా వినిపించింది.

చివ్వున వెనుదిరిగి చూసింది.

ఆమె నల్లనివిశాలనేత్రాల్లోకి సూటిగా చూశాడు విక్టర్.

చప్పున కళ్లు దించుకుంది రేణుక.

"నా పేరు విక్టర్! నీ ఆరాధకుడిని. నీ అనుగ్రహం కోసం యుగాలుగా తపస్సు చేస్తున్నాను. దేవీ... నీ అనుగ్రహం లభిస్తుందా?" మళ్ళీ చిన్నగా అన్నాడు విక్టర్.

రేణుక పెదిమలు కొరుకుతూ మౌనంగా ఉండిపోయింది.

"స్వీట్ డార్లింగ్! నా మనస్సు దోచుకున్నావు. కళ్లు మూసినా, తెరచినా నీ రూపమే కనిపిస్తూ మనశ్శాంతిలేకుండా చేస్తోంది. నీ కోసం మారాంచేసే మనస్సుని, తనువుని సముదాయించడం నా శక్తికి మించిన పనయింది. ఏంచేస్తే నీ అనుగ్రహం పొందగలను?"

అతి మంద్రస్వరాన చెవిలో మళ్ళీ వినిపించింది విక్టర్ కంఠం.

"ఏంచేస్తే నువ్వు నోరు మూస్తావు?" విసురుగా అంది రేణుక.

"చెప్పనా?" చిలిపిగా చూశాడు విక్టర్ "నోటి మీద ముద్దు పెట్టుకుంటే అదే మూతబడిపోతుంది"

చిదిపితే రక్తం కారేటంతగా ఎర్రబడిపోయింది రేణుక సుందర వదనం.

"ఆహా... సిగ్గు ఇంతందంగా ఉంటుందా!" కవ్విస్తున్నట్లుగా అన్నాడు విక్టర్.

అతడి మాటలు ఎవరయినా వింటున్నారేమోనని చుట్టూ బెరుకుగా చూసింది రేణుక.

ఎవరి గొడవల్లో వాళ్లున్నారు.

విక్టర్ వైపు చూసింది.

చిన్నగా నవ్వాడు.

రేణుక గుండె జల్లుమంది.

ఏమిటితడి సాహసం? ఈరోజు మరీ చొరవ తీసుకుంటున్నాడు. చిత్రంగా అతడి చిలిపి మాటలు తనకు పరవశాన్నే కలిగిస్తున్నవి. మనస్సుకు ఎనలేని సంతోషాన్ని కలిగిస్తున్నవి. సిగ్గుతో ముడుచుకుపోయేలా చేస్తున్నవి.

రేణుక భయపడింది.

వద్దు వద్దనుకుంటూనే తను ప్రేమ అనే సాలెగూడులో చిక్కుకుపోతున్నది.

* * *

ఆరోజు ఆదివారం. లేచేటప్పటికి బారెడు పొద్దెక్కింది. తీరుబడిగా తలంటి స్నానంచేసి వంటింట్లో ఉన్న తల్లి దగ్గరికి వచ్చింది.

"టిఫిన్ తింటావా?" ఉల్లిపాయలు తరుగుతున్న విమలమ్మ అడిగింది.

"ఏం చేసావ్?"

"రవ్వ ఉప్మా"

"బోర్. కాఫీ ఉంటే ఇవ్వు చాలు''

విమలమ్మ లేచి చేతులు కడుక్కుని కూతురికి కాఫీ కలిపి ఇచ్చింది.

కాఫీ తాగుతూ, "వంట ఏం చేస్తున్నావ్?'' అంది రేణుక.

"చేపల పులుసు, పెరుగు గారెలు, పొటాటో చిప్స''

''వెరీ గుడ్!''

పుస్తకాలు తీసుకు వచ్చి వంటింట్లోనే ఒకవైపున్న డైనింగ్ టేబుల్ ముందు కూర్చుంది. చదువుతుండగా హఠాత్తుగా ఏదో గుర్తొచ్చి లేచి బయటికి వచ్చి బస్‌స్టాప్‌కేసి చూసింది.

స్తంభాన్నానుకుని నిలబడి ఇటే చూస్తున్నాడు విక్టర్.

రేణుక పెదిమలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

దేవీ దర్శనార్థమై భక్తుడు వేచి ఉన్నాడు!

ఇంతలో ఎదురింటావిడ పలకరించింది.

ఆవిడతో మాట్లాడుతూ కాస్సేపు గేటు వద్దే నిలబడింది.

లోపలకు వచ్చేస్తూ స్కూటర్ స్టార్ట్ చేసి వెళ్లిపోతున్న విక్టర్ని చూసి నవ్వుకుంది.

ఒక్కరోజు తనను చూడకున్నా ఉండలేడు కాబోలు ... తనస్థితీ ఇప్పుడలాగే ఉంది. అతడిని చూడనిరోజు ఏదో పోగొట్టుకున్నట్లు అశాంతిగా, అస్థిమితంగా అసలేమీ బాగుండదు. పొద్దున అతడిని



చూస్తేనే తృప్తితో రోజంతా ఉత్సాహంగా ఉండగలుగుతోంది.

ఆలోచిస్తూ వచ్చి ఆరోజు దినపత్రిక చూస్తున్న తండ్రిపక్కన కూర్చుంది.

"ఏమిటి డాడీ, న్యూస్?"

"ఏముంది? పేపరు తెరిస్తే హత్యలు, దోపిడీలు, మానభంగాలు...ఇవేగా!"

రేణుక నవ్వి, "రైలు ప్రమాదాలు మరచిపోయారు" అంది.

"నిజమేనమ్మా! రైలు ప్రమాదాలు ఈమధ్య మరీ ఎక్కువయ్యాయి. రైలు దోపిడీలూ ఎక్కువే అయాయి. రైలు ప్రయాణం చేయాలంటే ఆలోచించవలసి వస్తున్నది" అన్నారు ముకుందరావుగారు.

రేణుక పేపరు అందుకుంది.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచి పోయాయి.

"రేణూ!"

తలెత్తి చూసింది రేణుక.

"నెల్లూరు నుండి ఉత్తరం వచ్చిందమ్మా!"

నొసలు చిట్లించింది రేణుక. దాదాపు రెండు నెలల క్రితం నెల్లూరు నుండి ఒక డాక్టరు వచ్చి ఆమెను చూసి వెళ్ళాడు. తెల్లగా, పొడుగ్గా, ఆకర్షణీయంగా ఉన్నాడు. అయితే అప్పటికే మనస్సులో విక్టర్‌కి గుడికట్టేసిన రేణుక అతడి వయిపు కళ్ళెత్తి చూడలేకపోయింది.

"ఆ అబ్బాయి నిన్నుతప్ప ఇంకెవ్వరినీ చేసుకోనని భీష్మించుక్కూర్చున్నాట్ట... ఆలోచించు తల్లీ. అతను చూడ చక్కగా నీకు ఈడు జోడుగా ఉంటాడు.

"ప్లీజ్, డాడీ!" అసహనంగా అంది రేణుక. "నాకిప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు. వాళ్ళకు వేరే సంబంధం చూసుకోమని రాసెయ్యండి."



"నీ ఇష్టం అమ్మా!" నీరసంగా అన్నారు ముకుందరావుగారు.

మంచి సంబంధం తప్పిపోతున్నదని ఆయనకెంతో విచారంగా ఉంది. అయితే మెడిసిన్ చదువుతున్న కూతురు మెడలు వంచి బలవంతంగా పెళ్ళి చేసే సాహసం లేదాయనకు.

గడియారం గంటలు కొట్టడం విని తలెత్తి చూసింది రేణుక.

పన్నెండు.

"అమ్మా, ఆకలేస్తోందే" గారాబంగా అంది.

"పొద్దున్న టిఫిన్ తినలేదు. ఆకలేయదూ మరి. లేచిరా, వడ్డిస్తాను. మీరూ లేవండి" అంది విమలమ్మ.

తనకు, తండ్రికి మాత్రం వడ్డించడం చూసి, "నువ్వూ వడ్డించుకో అమ్మా" అంది రేణుక.

కూతుర్ని ఆపేక్షగా ఒకసారి చూసి తన కంచంలో అన్నం వడ్డించుకుంది విమలమ్మ.

"హాయ్! రేణూ ఏం చేస్తున్నావ్?" తుపానులా లోపలికి దూసుకువస్తూ అంది విద్య.

"రా విద్యా...కూర్చో" ఆదరంగా అంది విమలమ్మ.

విద్య కూర్చుంటూ – "పెరుగుగారెలు చేసావా ఆంటీ?" అంది.

విమలమ్మ నవ్వి "ఆదివారాలు అవి చేయకుంటే నీ ఫ్రెండు నన్ను వదిలి పెడుతుందా?" అని ఒక పళ్ళెంలో రెండు పెరుగుగారెలు పెట్టి విద్యముందుకు తోసి "తీసుకో" అంది.

"సినిమా ప్రోగ్రామా?" నవ్వుతూ అడిగాడు ముకుందరావుగారు.

"మీరనుమతిస్తే వెళ్తాము" చిలిపిగా అంది విద్య.

"అనుమతించకపోతే?" అంతకన్న చిలిపిగా అన్నాడు ముకుందరావుగారు.

"మీతో దెబ్బలాడి మరీ ఫ్రెండుని లాక్కుపోతుంది" నవ్వి అంది విమలమ్మ.

"ఇంతకీ ఏ సినిమా?" రేణుక అడిగింది.

"సాటర్ డే నైట్ ఫీవర్. పాటలు విన్నావా? అబ్బ...ఎంత బాగున్నాయో! అంతకన్నా అద్భుతంగా ఉందట జాన్ ట్రవోల్టా డిస్కో డాన్సులు. మా పిన్నికొడుకేమన్నాడో తెలుసా?"

"ఏమన్నాడు?"

"డె బ్బ యి రో జు ల యి ఊళ్ళో ఆడుతుంటే ఇంకా ఆ సినిమా చూడలేదా? టట్. నీ జన్మ వ్యర్థం అనేసాడు"

రేణుక నవ్వి, "అతనంటేనే నీ జన్మ వ్యర్థమయిపోతుందా?'' అంది.

"అమ్మమ్మ కబుర్లు చెప్పక లేచి వేగం తయారుకా'' విసుగ్గా అంది విద్య.

"లేడికి లేచిందే పరుగన్నట్లు ఏమిటా తొందర?"

"ఆ సినిమా చూడాలని నాకెంత ఆత్రంగా ఉందో నీకేం తెలుసు!''

"ఈరోజు ఆదివారం అన్న సంగతి మరచిపోయావా?"

"ఆదివారం అయితేనేం!"

"మనకు టిక్కెట్స్ దొరుకుతాయా అని..."

"మనం ఇక్కడే మీనమేషాలు లెక్కబెడుతూ కూర్చుంటే దొరకవు. వెళ్ళి ప్రయత్నిస్తే దొరుకుతాయి" అని ఆగి రేణుక వయిపు విసుగ్గా చూసింది విద్య.

"అమ్మమ్మలా ఏమిటా తినడం. గబగబ తినలేవూ?"

"నీ సినిమా పిచ్చి నాకు ప్రాణసంకటంగా తయారయిందే తల్లీ" అని లేచి వాష్‌బేసిన్ వద్ద చేతులు కడుక్కొని తన గదికి వెళ్ళిపోయింది రేణుక.

వాళ్ళు వెళ్ళేటప్పటికి కౌంటర్ ముందు కొండవీటి చాంతాడంత ఉంది క్యూ. స్త్రీల వైపు క్యూ కూడా బాగా పెద్దదిగానే ఉంది.

రేణుక పెదిమలు విరిచింది "విద్యా! ఈ రద్దీలో మనం టిక్కెట్స్ కొనలేము. నా మాట విని పద. వెళ్ళిపోదాం" అంది.

"నథింగ్ డూయింగ్. ఈరోజు ఈ సినిమా చూడవలసిందే! ఉండు. క్యూలో తెలిసినవాళ్ళెవరయినా కనిపిస్తారేమో చూస్తాను" అని చూడసాగింది విద్య.

"మళ్ళీ పక్కన చేరి అల్లరి చేస్తుంటే అదీ బాగానే ఉంటుంది" కోపంగా అంది రేణుక.

క్షణాలు, నిమిషాలు గడిచి పోతున్నాయి.

క్షణక్షణానికి రేణుకకు విసుగు అధికమవుతున్నది.

అంతలో ఎవరో వ్యక్తి వాళ్ళను సమీపించాడు.

"అమ్మా ... టిక్కెట్స్ కావాలా?" ఎంతో మర్యాదగా అడిగాడు.

విద్య మొహం విప్పారింది. 'కావాలి' అంది ఆత్రంగా.

ఆ వ్యక్తి టికెట్లు ఇచ్చి డబ్బు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

"ఆ టికెట్లు డూప్లికేటేమోనే! లేకుంటే పైసా లాభం లేకుండా అసలు రేటుకే టిక్కెట్లెందుకిస్తాడు?" అనుమానంగా అంది రేణుక.

విద్య మొహం పాలిపోయింది.

కాని, గేట్ కీపర్ మౌనంగా టిక్కెట్స్ చింపి డోర్ తెరిచాడు.

"థాంక్ గాడ్!" రిలీఫ్‌గా నిట్టూర్చింది విద్య. నువ్వు మరీ అనుమానాల పుట్టవు. అందరినీ అనుమానిస్తావు. అతడెవరో పాపం, దేవుడిలా వచ్చి టిక్కెట్స్ ఇస్తే శంకించావు"

రేణుక మాట్లాడలేదు.

లోపల విక్టర్ని చూసి ఆమె హృదయస్పందనం హెచ్చింది. శరీరమంతటా వర్ణనాతీతమయిన ఏదో ఉద్వేగం, తడబాటు! పైగా సీటు నెంబరు ప్రకారం అతడి పక్కనే కూర్చోవలసి వచ్చింది. పెళ్ళిపీటలమీద వరుడి పక్కన కూర్చునే వధువు మానసికస్థితి ననుభవించిందా క్షణం.

విక్టర్ ఆమె వైపు అసలు చూడలేదు. సినిమా ప్రారంభమయేదాకా మేగజైన్ దీక్షగా చూస్తూ కూర్చున్నాడు. అతడు తన వైపు చూడకపోవడం రేణుకకెంతో ఆశాభంగం కలిగించింది. ముఖం చిన్నబోయింది.

సినిమా ప్రారంభమయిన కాస్సేపటికి, 'హలో' అన్నాడు విక్టర్ మంద్ర స్వరాన. అతడితో పరిచయం కోసం తహతహలాడుతున్న రేణుక బిడియంగానే 'హలో' అంది.

"ఇదివరకు మీరీ పిక్చర్ చూడలేదా?" అడిగాడు విక్టర్.

"ఉహూఁ. మీరు?"

చిన్నగా నవ్వి, "ఎన్నిసార్లు చూసానో లెక్కలేదు" అన్నాడు.

"అంత బాగుందా?"

"నాకు బాగా నచ్చింది."

విక్టర్ మాట్లాడుతుంటే అతడి ఊపిరి వెచ్చగా తాకి ఆమె అణువణువూ పులకరించింది.

"ఈరోజు నాకెంత సంతోషంగా ఉందో చెప్పలేను" చిన్నగా అన్నాడు విక్టర్.

చురుగ్గా చూసింది రేణుక. "ఎందుకు?"

"మీరు... మీరు..." ఆపైన ఏమి చెప్పాలో తోచనట్లు ఆపేసాడు.

రేణుకకర్థమయింది—తను అతడి పక్కన కూర్చోవడమే అతడి సంతోషానికి కారణమని. ఒకవేళ తనను చూసి విక్టరే టిక్కెట్స్ కొని ఆ వ్యక్తిచేత పంపా

దేమో అనిపించింది. ఆలోచిస్తే అది నిజమేనేమోననిపించింది.

లేకుంటే డబ్బుచుట్టూ ప్రపంచం పరిభ్రమిస్తున్న ఈ కాలంలో ముక్కూ మొహం తెలీని అపరిచిత వ్యక్తి పైసా లాభం లేకుండా అసలురేటుకే టిక్కెట్ ఇవ్వడమేమిటి? పైగా టిక్కెట్ నెంబర్స్ పక్క పక్కనే వచ్చింది...

"ఇఫ్ యూ డోంట్ మైండ్, ప్లీజ్ హేవిట్!"

కాడ్‌బరీస్ మిల్క్ చాక్‌లెట్స్ అందిస్తూ అన్నాడు విక్టర్.

"నో, థాంక్యూ!"

"ప్లీజ్, ఈరోజు నా పుట్టినరోజు కాదని నన్ను నిరాశ పరచకండి"

"మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే!" స్నేహంగా అంది రేణుక.

"థాంక్యూ!"

ఇద్దరూ సినిమా చూస్తూ తగ్గుస్వరాల్లో మాట్లాడుకుంటున్నారు. కాస్సేపటికే ఇద్దరి మధ్య కొత్తదనంపోయి చిరకాల పరిచితుల్లా మాట్లాడుకోసాగారు.

"మీరిక్కడివారు కారనుకుంటాను?" రేణుక అంది.

"అవును. మాది కెన్యాదేశం. ఇంజనీరింగ్ చదువునిమిత్తం ఇక్కడికి వచ్చాను"

"గిండీ ఇంజనీరింగ్ కాలేజిలో చదువుతున్నారా?"

"నో, నో. ఐ.ఐ.టి.లో బి.టెక్. చదువుతున్నాను"

"మీ దేశంలో ఇంజనీరింగ్ కళాశాలలు లేవా? ఇంతదూరం వచ్చారు?"

"లేకేం. ఉన్నాయి. జస్ట్ ఫర్ చేంజ్, ఇక్కడికి వచ్చాను"

"ఇక్కడ మీకు బాగుందా?"

రేణుకవైపు చూశాడు విక్టర్. "చాలా బాగుంది"

అతడి పక్కన కూర్చుని అలా తగ్గుస్వరాల్లో మాట్లాడుకుంటూంటే రేణుక హృదయం మధురోహలలో తేలిపోతున్నది. కొన్ని నిమిషాలు మౌనంగా పిక్చర్ చూస్తూ కూర్చుంది. కాని పక్కన మనస్సు గిలిగింతలుపెట్టే ప్రియుడు కూర్చునుంటే స్క్రీన్‌మీద అందగాడు—శాన్‌ట్రవోల్టా ఆమెను ఈషణ్మాత్రం ఆకర్షించలేకపోయాడు. మెల్లిగా చూపులు విక్టర్ మీదికి మళ్ళించింది. ఆమె వంకే చూస్తున్న విక్టర్ చూపులతో ఆమె చూపులు ముడిపడగా చప్పున విడదీసుకుంది. గుండె చుట్టూ వెచ్చగా, తియ్యగా, మత్తుగా ఏదో ఆవరించినట్లయింది.

'అబ్బ..ఇతడి చూపులకెంత శక్తుంది! కేవలం చూపులతోనే ఎవరినీ ఖాతరు చేయని తనని ఇట్టే లొంగదీసుకున్నాడు. తన మనస్సంతటా అణువణువున నిండిపోతున్నాడు. తన ఆలోచనలు, కోరికలు, ఆశలు అన్నిటికి కేంద్రమయ్యాడు. అతడి చూపులతో చూపులు కలిస్తేనే తననేదో మైకం ఆవరిస్తుంది. మనస్సు పురివిప్పుతుంది. ఈ ఆకర్షణకేనా ప్రేమ అని పేరు?'

"ఈసారి నా పుట్టినరోజుకి భగవంతుడు ఎంతో విలువయిన కానుకనిచ్చాడు"

విక్టర్ వయిపు ప్రశ్నార్థకంగా చూసింది రేణుక.

"ఏమిటి?"

ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ, "మీ పరిచయం" అన్నాడు విక్టర్.

రేణుక వదనం కెంపు దాల్చింది. "నా పరిచయం అంత విలువయినదా?"

"ఆహాఁ! ఎన్నాళ్లో తపస్సు చేస్తే

లభించిన వరప్రసాదం"

రేణుక మాట్లాడలేదు.

ఇద్దరూ మౌనంగా సినిమా చూడసాగారు.

"ఇఫ్ యూ డోంట్ మైండ్ నేనో మాట అడగనా?" చిన్నగా అంది రేణుక.

ఆమె వైపు ఆసక్తిగా చూశాడు విక్టర్. "బై ఆల్ మీన్స్!"

"మీరు... సిసలయిన నీగ్రోలా ఉండరు?" సంకోచంగానే అంది రేణుక.

"అందుక్కారణం ఉంది" చిన్నగా నవ్వి అన్నాడు విక్టర్.

"ఏమిటి?" ఉత్కంఠగా అంది రేణుక.

"నాది ప్యూర్ నీగ్రోబ్లడ్ కాదు..."

"అంటే?"

"డాడీ నీగ్రో. మమ్మీ బ్రిటిష్ వనిత. అందుకే డాడీ పోలికలు కొద్దిగా, మమ్మీ శరీరచ్ఛాయ స్వల్పంగా సంక్రమించింది" అని నవ్వాడు విక్టర్.

అతడి వయిపు కుతూహలంగా చూసింది రేణుక. "మీకెందరు తోబుట్టువులు?"

"ముగ్గురు—ఒక అన్న, తమ్ముడు, చెల్లి"

"మీ చెల్లెలు చదుకుంటున్నారా?"

"ఆఁ! మెడిసిన్ ఫైనలియర్ చదువుతోంది?"

"ఎక్కడ?"

"మా ఊళ్ళోనే"

"మీ ఊరు?"

"నైరోబి"

"మీరు ఇంజనీరింగ్‌లో కాస్త ఆలస్యంగా చేరారనుకుంటాను?"

"నిజమే... ఫిజిక్స్‌లో బాచిలర్స్ డిగ్రీ తీసుకున్నాక కొన్నాళ్ళపాటు దేశాలు తిరిగి చూడాలనిపించింది. మా అన్నతోబాటు దాదాపు రెండు సంవత్సరాలు ప్రపంచం మీద పడ్డాను. తర్వాత రెండేళ్ళపాటు జపాన్‌లో ఉండి కరాటేలో శిక్షణ పొందాను. అప్పుడే రిఫ్రిజిరేటర్లు తయారుచేసే ఓ ఫాక్టరీలో అప్రెంటిస్‌గా ఉన్నాను. అక్కడ కోర్స్ పూర్తవుతున్న తరుణంలో పత్రికలో ఓ అడ్వర్టైజ్‌మెంట్ చూసి మీ దేశంలో కొన్నాళ్ళుండాలనిపించింది. ఐ.ఐ.టి. సీటు కోసం అప్లయి చేస్తేవచ్చింది. వెంటనే చేరిపోయాను" అన్నాడు.

"అంటే మీకు కరాటేలోనూ ప్రవేశం ఉందన్నమాట"

"ఆఁ బ్లాక్ బెల్ట్ వీరుడిని!" నవ్వి అన్నాడు విక్టర్.

అతడు నవ్వినప్పుడు మరీ ఆకర్షణీయంగా ఉంటాడని ఆరోజే గమనించింది రేణుక.

"ఎవరే అతను?" ఇంటర్వెల్లో అడిగింది విద్య.

'నాగుండె... నా రక్తం... నా ప్రాణంలో ప్రాణం... నా జీవన చైతన్యం...నా సర్వస్వం' అనబోయి "బస్ స్టాపులో చూస్తుంటాను. ముఖ పరిచయం ఉంది" అంది.

విద్య అనుమానంగా చూసింది. రేణుక తన నుండి ఏదో దాస్తున్నదనిపించింది. హాస్పిటల్ దగ్గర, బస్‌స్టాపులోనూ, అమరావతి హోటల్లోనూ అతన్ని ఎన్నోసార్లు చూసి ఉంది ఆమె. రేణుక వయిపు చూసినపుడు అతడి కళ్లలో మెరిసే మెరుపులు ఆమె గమనించింది. ఆ విషయం ఆమెకొట్టే విస్మయం కలిగించలేదు. ఆమెకు ఆశ్చర్యం కలిగిం

చిందలా రేణుక విక్టర్ వంక ఆసక్తిగా చూటమే! అతడి వంక చూసినపుడు ఆమె కళ్ళలో వెలిగే అపురూపమయిన కాంతి, మొహంలో చిందులు వేసే సంతోషం విద్యకనుమానం కలిగించింది. రేణుక స్వభావం ఆమెకు బాగా తెలుసు. చాలామంది సుందరాంగులకు మల్లే రేణుకకూ తన వెనకబడేమగాళ్ళంటే చాలా చులకన. ఎంతటివాళ్ళనీ లక్ష్యపెట్టదు. ఒక్కోసారి ఆమె ప్రవర్తన చూస్తే పురుష ద్వేషిణి ఏమో అన్న అనుమానం కూడా కలుగుతుంది. తన చుట్టూ హద్దులు ఏర్పరచుకుని ఆ హద్దులు దాటి తను ఇవతలికి రాకుండా, ఇతరులు ఆ హద్దులు దాటి లోపలికి ప్రవేశించకుండా ఎంతో జాగ్రత్తగా ఉంటుంది. తను అభిమానించేవారితో ఎంత సరదాగా, ఆత్మీయంగా, చలాకీగా మాట్లాడుతుందో తక్కినవారితో అంత ముభావంగా ఉంటుంది. కొత్త పరిచయాలు అసలే ఏర్పరచుకోదు. అటువంటిది ఈ నీగ్రో యువకుడితో ఎంతో చనువుగా, కులాసాగా మాట్లాడేస్తున్నది. పక్కన తనున్న సంగతే మరచిపోయినట్లు పూర్తిగా అతడి వయిపునకే ఒరిగిపోయి కూర్చుంది. వాళ్ళిద్దరి మధ్యా ఉన్నది కేవలం ముఖ పరిచయం మాత్రమేకాదు అంతకు మించిన అనుబంధం ఏదో ఉంది. యల్.కె.జి. నుండి కలిసి చదువుతున్న తమ మధ్య ఎటువంటి రహస్యాలు, అరమరికలు లేవు. అటువంటిది ఈరోజు రేణుక తన నుండి ఏదో దాస్తున్నది. విద్య మనస్సు చివుక్కుమంది. బయటకి వెళ్తున్న విక్టర్ వంక పరిశీలనగా చూసింది. అప్రయత్నంగా అతడిపక్కన రేణుక నూహించుకుంది. 'అందమయిన జంట' అనుకోకుండా ఉండలేకపోయింది.

"విద్యా....కాఫీ!''

ఉలిక్కిపడి చూసింది విద్య.

కాఫీకప్పు అందిస్తూ స్నేహ పూర్వకంగా నవ్వాడు విక్టర్ "ప్లీజ్ తీసుకోండి"

"నో... థాంక్యూ'' ముభావంగా అంది విద్య.

"ఫర్వాలేదు తీసుకోవే'' చిన్నగా అంది రేణుక.

ఒకసారి ఆమె వయిపు చూసి మౌనంగా కప్పు అందుకుంది విద్య.

'అంఖోమె తుమ్'
హోటోంపె తుమ్'
దఢ్‌కన్‌మె తుమ్
సాఁసోమె తుమ్.
దీవానా మై హోజాయెగి...'

ఈమధ్య రేణుక మదిలో అహరహం మెదులుతున్న పాట!

ఆమెకెంతో నచ్చిన పాట!!

అమిత్‌కుమార్ మృదుమధురంగా పాడుతున్నాడు.

రేణుక క్రీగంట విక్టర్ వయిపు చూసింది.

అతడు మెల్లిగా ఆ పాటనే హమ్ చేస్తున్నాడు.

"హిందీ తెలుసా మీకు?" అప్రయత్నంగా అడిగింది.

ఆమె వయిపు చూసాడు విక్టర్. "తెలుసు... అన్నట్లు మీరు మీ ఫ్రెండుతో మాట్లాడినది ఏ భాష?"

"నా మాతృభాష. ఇండియాలో హిందీ తర్వాత అధిక సంఖ్యాకులు మాట్లాడేభాష... తెలుగు" గర్వంగా అంది రేణుక.

"మీ స్వస్థలం మద్రాసేనా?"

"ఉహూఁ ఆంధ్రలో ఉన్న విజయవాడ

దాడీ ఉద్యోగరీత్యా ఇక్కడికి వచ్చారు. మాకందరికీ ఈ ఊరే బాగా అలవాటయిపోయింది. వదిలి వెళ్ళలేక ఇక్కడే స్థిరపడిపోయాం"

ఇంటర్వెల్ తర్వాత సినిమా పునః ప్రారంభమయింది.

"మీకెందరు తోబుట్టువులు?" విక్టర్ అడిగాడు.

"ముగ్గురు అన్నయ్యలు, ఒక అక్క. నేనే చిన్నదాన్ని" అని నవ్వింది రేణుక.

"అన్నయ్యలు ఏం చేస్తుంటారు?"

"పెద్దన్నయ్య స్టేట్ బాంకులో ఆఫీసరు. రెండో అన్నయ్య ఇంజనీరు. ఇద్దరూ హైదరాబాదులో ఉన్నారు. చిన్నన్నయ్య ఢిల్లీలో ఒక అమెరికన్ ఫర్మ్‌లో ఎగ్జిక్యూటివ్‌గా ఉన్నాడు''

ఇద్దరూ తగ్గు స్వరాల్లో మాట్లాడుకుంటూ సినిమా చూస్తున్నారు.

వాళ్ల మాటల మధ్య ఎన్నో విషయాలు దొర్లిపోతున్నవి.

విక్టర్‌తో మాట్లాడుతుంటే ప్రతిరోజు అతడిని కలుసుకుని గంటల తరబడి మాట్లాడుతున్నట్లే ఎంతో చిరపరిచితంగా, సహజంగా ఉంది. ఎంతమాత్రం కొత్తగా అనిపించడంలేదు. అందుక్కారణం—

తన హృదయంలో అతడిపట్ల పొంగి పొరలుతున్న అనురాగమా?

విక్టర్ మాటల్లో కేవలం స్నేహమే తప్ప మరోభావం కానరావడం లేదు. అనవసరంగా చెయ్యి తాకించడం, కాలు తగిలించడంలాంటి వెకిలిచేష్టలు చేయక ఎంతో హుందాగా, మర్యాదగా ఉంది అతడి ప్రవర్తన.

ఇంకాస్సేపటిలో సినిమా అయిపోతుందనగా,

"మిస్ రేణుకా! మీరు అపార్థం చేసుకోకుంటే హోటల్లో కాఫీ తీసుకుందాం. వస్తారా?" మర్యాదగా అడిగాడు విక్టర్.

తటపటాయించింది రేణుక.

"ప్లీజ్" ప్రాధేయపూర్వకంగా అన్నాడు విక్టర్.

విద్యతో చెప్పింది రేణుక.

"నేను ఇంటికి వెళ్ళాలి. నీకిష్టమయితే నువ్వు వెళ్ళు. నీ ఫ్రెండేగా!" అంటీ ముట్టనట్లు అంది విద్య.

రేణుకకు వెళ్లాలనీ ఉంది....వెళితే విక్టర్‌తో తెంచుకోలేనంతగా అనుబంధం పెరిగిపోతుందేమోనన్న సంశయమూ కలిగింది.

ఆమె ద్వైదీభావంతో సతమతమవుతూండగా సినిమా అయిపోయింది. ముగ్గురూ బయటికి వచ్చారు.

''రేణూ..నేను వెళ్తాను. బై!" అని చరచర వెళ్ళిపోయింది విద్య.

విక్టర్‌తో ఒంటరిగా మిగిలిపోయింది రేణుక.

మరి తప్పించుకునే మార్గంలేక రేణుక విక్టర్‌తోబాటు హోటల్‌కు వెళ్లింది.

హోటల్లో బాగా రద్దీగా ఉంది. టేబిల్ దొరికి కూర్చునేందుకు చాలా సేపే పట్టింది. "ఏం తీసుకుంటారు?'' మెనూకార్డు చూస్తూ అడిగాడు విక్టర్.

''ఐస్‌క్రీం!''

''టిఫిన్ ఏదయినా....''

''ప్లీజ్, నేనిప్పుడేమీ తినలేను''

ఒకసారి ఆమెవేపు చూసి, ''మీ ఇష్టం!'' అని అయిస్‌క్రీం ఆర్డరిచ్చాడు విక్టర్.

''మీరెక్కడ ఉంటున్నారు? హాస్టల్‌లోనా?'' అడిగింది రేణుక.

''లేదు. సాంథోమ్‌లో ఓ ఇంట్లో అద్దె

కుంటున్నాను."

"భోజనం?"

"ఊరునిండా హోటళ్ళేగా!" నవ్వాడు విక్టర్.

ట్రేలో అయిస్‌క్రీం కప్పులు తెచ్చి పెట్టాడు వెయిటర్.



అతడిచూపుతో చూపులు కలిపే సాహసంలేక అధోవదన అయింది రేణుక. ఆ క్షణం వాళ్ళ హృదయాలు ప్రణయానుభూతితో స్పందిస్తున్నవి. అయితే మనస్సులో భావాలు బయటికి చెప్పుకోలేని స్థితి...

"కాస్సేపు బీచ్ లో..."

హోటల్నుండి బయటికి వస్తుండగా అన్నాడు విక్టర్.

అతడివేపు చురుగ్గా చూసింది రేణుక. "కాఫీ అన్నారు. పుట్టినరోజు మిమ్మల్ని చిన్నబుచ్చడమెందుకని సరే అన్నాను. ఇప్పుడు బీచ్ అంటున్నారు"

"ప్లీజ్!"

"ఈ ప్లీజులతో నాముందరి కాళ్లకు బంధాలు వేసేస్తున్నారు మీరు"

విక్టర్ నవ్వాడు. అతడి అందమయిన మొహంలో ప్రపంచాన్నే సాధించినంత విజయోత్సాహం కనిపిస్తున్నది.

అతడివెనక స్కూటర్ మీద కూర్చునెందుకు సంశయించింది రేణుక.

"మెడిసిన్ చదువుకుంటున్న మీకూ ఇంత సంశయమా?" కవ్విస్తున్నట్లు అన్నాడు విక్టర్.

చివ్వున స్కూటర్ మీద కూర్చుంది.

"దట్స్ గుడ్!"

బీచిలో జనసమ్మర్దానికి దూరంగా కూర్చున్నారు.

మోకాళ్ల చుట్టూ చేతులు పెనవేసి ఎగసిపడుతున్న కెరటాలవంక తదేకంగా చూస్తూ మౌనంగా కూర్చుంది రేణుక.

ఆమెపక్కనే కూర్చున్న విక్టర్ కూడా ఏదో ఆలోచిస్తూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

క్షణాలు, నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోతున్నాయి.

"విక్టర్, ఇక వెళ్లిపోదాం. అమ్మ కంగారు పడుతుంటుంది."

ఎంతోసేపటికి ఆలోచనల నుండి నిజ ప్రపంచానికి వచ్చిన రేణుక చుట్టూ దట్టంగా ఆవరించిన చీకటిని చూస్తూ కంగారుగా అంది.

ఆమె చేతిని అంటీముట్టనట్లు ఒకసారి తాకి లేచాడు విక్టర్.

"నేను బస్సులో వెళ్లిపోతాను."

"నో, నో.... ఇప్పటికే ఆలస్యమయింది. బస్సులుపట్టి ఇల్లు చేరేటప్పటికి ఇంకా ఆలస్యమవుతుంది. నేను స్కూటర్ మీద డ్రాప్ చేసేస్తాను."

నిజానికి రేణుకకూ బస్సు కోసం

వెయిట్ చేసే ఓపిక లేదు. అందుకే కాదనకుండా స్కూటరెక్కి కూర్చుంది.

స్కూటర్ బస్‌స్టాప్ సమీపించగానే, "ఇక ఆపెయ్!" అంది రేణుక.

విక్టర్ స్కూటరాపాడు.

రేణుక స్కూటర్ దిగి, "థాంక్యూ



వెరీమచ్!" అంది.

"నేనే థాంక్స్ చెప్పాలి" చిన్నగా నవ్వి అన్నాడు విక్టర్.

"ఎందుకు?" అంది రేణుక.

ఆమె కళ్ళలోకి సూటిగా చూసాడు విక్టర్. "ఇంత సేపు నాతో గడిపి నా కెనలేని సంతోషం చేకూర్చినందుకు!"

రేణుక తల వంచుకుంది.

ఇద్దరూ ఒకరినొకరు ఏకవచనంలోనే సంబోధించుకుంటున్నారు. అయితే ఇద్దరిలో ఏ ఒక్కరూ ఆ విషయం గమనించలేదు.

"మళ్ళీ మనం కలుసుకోవడం ఎప్పుడూ, ఎక్కడ?"

విక్టర్ వయిపు చూసింది రేణుక. "మళ్ళీ మనం కలుసుకోవలసిన అవసరం ఉందా?"

"రేణూ, ప్లీజ్!"

రేణుక ఆలోచించింది.

"రోజూ సాయంత్రం అమరావతిలో కాఫీ తీసుకోవడం నాకలవాటు!"

"నీతోబాటు నీ ఫ్రెండుంటారు?"

"ఉంటే నీకేం?"

"రేణూ..."

రేణుక నవ్వింది, "ఓ.కె. రేపట్నుండి నేనొక్కదాన్ని వస్తాను. అయితే ఒక షరతు."

"ఏమిటి?" ఆత్రంగా అడిగాడు విక్టర్.

"నా బిల్లు నేనే చెల్లిస్తాను."

"అంతేనా? ఇంకా ఏమిటో అనుకున్నాను."

"వస్తాను విక్టర్...గుడ్‌నైట్!"

"గుడ్‌నైట్!"

చక చక వెళ్ళిపోతున్న రేణుక వయిపు ఆప్యాయంగా చూస్తూ నిలబడి పోయాడు విక్టర్.

* * *

మర్నాడు సాయంత్రం హోటల్ అమరావతిలో అడుగు పెట్టిన రేణుకకు ఎదురు వచ్చాడు విక్టర్.

పలకరింపుగా నవ్వింది రేణుక. "హలో!"

"హలో!"

"నువ్వొచ్చి చాలా సేపయినట్లుంది?"

"ఆఁ! నలభై యుగాలయింది"

ఇద్దరూ వెళ్ళి లోపల కూర్చున్నారు.

"ఏమిటి విశేషాలు?" మంచినీళ్ళ గ్లాసుని చేత్తో కదుపుతూ అన్నాడు విక్టర్.

"ఏముంది? రోగాలు, రోగులు, మందులు ... మెడికల్ లైన్లో ప్రవేశించిన వాళ్ళకు అంతకు మించిన విశేషాలే ముంటాయి?" నవ్వి అంది రేణుక.

"నిజమే. మా డాడీ కూడా ఇరవయి నాలుగ్గంటలూ హాస్పిటల్ తాపత్రయంతోనే ఉంటారు"

విస్ఫారిత నేత్రాలతో చూసింది రేణుక. "మీ డాడీ డాక్టరా?"

"అవును. నైరోబిలో లీడింగ్ సర్జన్ మా డాడీ. నైరోబీలోనే పెద్ద నర్సింగ్‌హోం రన్ చేస్తున్నారు. అక్కడ డాడీ కింద ఇరవయిమంది డాక్టర్లు వర్క్ చేస్తున్నారు. వారిలో మా తమ్ముడు జార్జ్ కూడా ఒకడు..."

"ఇంట్లో అందరూ డాక్టర్లయితే నువ్వు మాత్రం ఇంజనీరింగ్ చదువుతున్నావెందుకు?"

"నేను డాక్టర్ కాకుంటేనేం, నా భార్య డాక్టరు..."

రేణుక గుండెల మీద మంచు ముద్ద పెట్టి నొక్కినట్లు ఫీలయింది.

"నీకు... నీకు పెళ్ళయిందా?"

ఆమె కళ్ళలో మెరుపులా కనిపించి మాయమయిన వ్యథను గమనించి విక్టర్ తృప్తిగా నవ్వుకున్నాడు.

"ఐమీన్... నా కాబోయే భార్య!" రేణుక కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

అతడి జవాబు విని ఎంతో రిలీఫ్ ఫీలయింది రేణుక. ఏదో అడగబోయింది.

అంతలో వెయిటర్ వచ్చాడు.

పెసరట్టుకి ఆర్డరిచ్చింది రేణుక.

వాళ్ళవయిపు అదోలా చూస్తూ వెళ్ళిపోయాడు వెయిటర్.

అది గమనించింది రేణుక.

ఆ హోటల్ వెయిటర్లందరికీ రేణుకి తెలుసు.

తనను విక్టర్‌తో చూసి వాళ్ళేమనుకుంటారో!

రేణుక మొహం ఎర్రబడింది.

ఆమెవంక తదేకంగా చూస్తున్న విక్టర్ చీటికి మాటికి ఈవిడగారి సుందర వదనం ఇలా ఎర్రగా కందిపోతోందెందు చేత అనుకున్నాడు ఆశ్చర్యంగా.

ఆలోచిస్తూనే మంచినీళ్ళ గ్లాసందుకున్నాడు. అందులో సగం నీళ్లు కొంతసేపు క్రితం రేణుక తాగింది. మిగిలిన సగం నీళ్ళు తాగేసి ఖాళీగ్లాసు టేబిల్ మీదుంచాడు విక్టర్.

రేణుక గుండె ఝల్లుమంది.

విక్టర్ తన ఎంగిలి తాగాడు.

ఆరోజు బస్సులో అతడి అల్లరి మాటలు గుర్తొచ్చి ఆమె మొహం అరుణ రాగరంజితమయింది. తన మనస్సులో మాట అతను స్పష్టంగా ఎప్పుడో చెప్పేసాడు. అయినా తను అతడు పలకరించడం ఆలస్యం బదులు పలికింది. అతడిని రోజూ కలుసుకునేందుకు అంగీకరించింది. అంటే... చూచాయగా తన మనస్సునతడికి తెలియజేస్తోంది..

వెయిటర్ పెసరట్టు తెచ్చిపెట్టాడు.

నెమ్మదిగా తింటూ విక్టర్ ఏదో చెప్తుంటే పరధ్యాన్నంగా వింటున్నది. హఠాత్తుగా ఏదో గుర్తొచ్చి విక్టర్ వంక చూసింది—"అన్నట్లు నువ్వు టి.వి.లో ప్రోగ్రామ్స్ ఇస్తావని విన్నాను?"

ఆశ్చర్యంగా చూసాడు విక్టర్. "వినడమేమిటి నీకు తెలీదా? మీ ఇంట్లో టి.వి. ఉందనుకుంటాను!"

"ఉంది కాని టి.వి. చూసే అలవాటు నాకు లేదు. ఆసక్తీ లేదు. నీ ప్రోగ్రాం ఎప్పుడుఉందో చెప్పావంటే నీకోసం చూస్తాను."

"రేపు ఉంది" ఏదో ఆలోచిస్తూ అన్నాడు విక్టర్.

మర్నాడు ఆరు గంటలకే టి.వి. ముందు హాజరయింది రేణుక.

విమలమ్మ ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటే! ఎన్నడూ లేనిది ఈ రోజు ఆరు గంటలకే టి.వి. ముందు హాజరయ్యావు?"

రేణుక నవ్వి ఊరుకుంది.

నిరీక్షణ ఎంత బాధాకరమయిందో ఆ రోజు అనుభవ పూర్వకంగా తెలుసుకుంది.

కాలం నత్తనడక నడుస్తూ ఎలాగయితేనేం చివరికి యూత్ ప్రోగ్రాం ప్రారంభమయింది. కాసేపటికి మూర్తీభవించిన పురుషత్వంలాగున్న విక్టర్ తెరమీద ప్రత్యక్షమయాడు. గిటార్ చేతబట్టుకుని స్టయిల్‌గా వంగి వందనం చేసాడు.

పది నిమిషాల ప్రోగ్రాంలో నాలుగు పాటలు పాడాడు. నాలుగూ గుండెలు

గిలిగింతలు పెట్టే ప్రణయగీతాలే!

సూటిగా తననే చూస్తూ తనను ద్దేశించే అతనా పాటలు పాడినట్లనిపించి బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది రేణుకకు.

ఆ ప్రోగ్రాం పూర్తవగానే లేచి తన గదిలోకి వెళ్లిపోయింది.

రేణుక చదవడం ప్రారంభించిందంటే చదువులో పూరిగా లీనమయిపోయి కాలగతినే మరచిపోతుంది. అలా కాలం నెమ్మదిగా ముందుకు కదిలిపోతుండగా నీరవ నిశ్శబ్దం రాత్రిపై పెత్తనం చెలాయిస్తున్న ఆ సమయంలో నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ ఫోను రింగయింది.

విసుగ్గా చూసింది రేణుక.

ఈ వేళప్పుడు ఫోను చెయ్యాల్సిన అవసరం ఎవరికొచ్చింది?

విసుక్కుంటూనే వెళ్ళి రిసీవ్ చేసింది.

"హలో!"

"రేణూ...నువ్వేనా?"

విక్టర్ కంఠం గుర్తుపట్టి, "విక్టర్!?" అంది సంభ్రమంగా.

"మేలుకునే ఉన్నావా? గుడ్!"

"ఇంత రాత్రప్పుడు ఫోన్ చేస్తున్నావేం?"

"టి.వి... చూసావా?"

"ఆఁ...."

"ఎలా ఉంది నా ప్రోగ్రాం?"

"పాట వింటూ నన్ను నేను మరచిపోయాను. నిజం! నువ్వింత బాగా పాడగలవని నేను కల్లోనయినా అనుకోలేదు"

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్!"

విక్టర్ కంఠంలో అంతులేని సంతోషం.

"ఏం చేస్తున్నావ్?"

"ఆలోచనల మధ్య చదవడం నేర్చుకుంటున్నాను" మెల్లిగా అంది రేణుక.

"ఏమిటి?"

"సరేలే. నువ్వు బుర్రబద్దలు కొట్టుకోకు ... ఇంతకీ ఎక్కడినుండి ఫోన్ చేస్తున్నావ్?"

"నేనున్న ఇంటికి ఫోన్ ఉంది"

"నిజం?"

"నిజమే. అయినా ఇంత చిన్న విషయానికి నీకెందుకంత ఆశ్చర్యం?"

"చిన్న విషయమా? ఈ దేశంలో ఫోన్ కనెక్షన్ దొరకడం ఎంత కష్టమో నీకేం తెలుసు?"

అరగంట తర్వాత ఫోన్ క్రెడిల్ చేసిన రేణుక వదనంలో అంతులేని తృప్తి, సంతోషం... విక్టర్ని మూడు నెలలుగా చూస్తున్నప్పటికీ నిజానికి అతడితో పరిచయమయింది నిన్ననే. ఈ రెండు రోజుల స్వల్ప వ్యవధిలో తమ మధ్య ఎంత చనువు పెరిగిపోయింది! అతడితో మాట్లాడుతుంటే ఏమాత్రం జంకు, సంకోచాలు ఏర్పడవు. మధూ అన్నయ్యతో మాట్లాడుతున్నంత సహజంగా ఉంది.

కాని తన చనువుని అతడు అపార్థం చేసుకుంటే?

నిజానికి అతనెటువంటివాడో తనకు తెలీదు.

క్షణిక సుఖం కోసం పథకం వేసుకుని మరీ ఆడదాన్ని మోసంచేసే మగాళ్ళు ఎందరో!

విక్టర్ అటువంటి మోసగాడు కాడు అని నమ్మకమేమిటి?

అసలే అనుకున్నది నెరవేరకుంటే కృంగిపోయే మనస్తత్వం తనది. విక్టర్ తనమీద మోజు తీరాక మొహం చాటేస్తే భరించి ఊరుకునే మనస్థయిర్యం తనకు లేదు. గాయపడి తపించేకన్న విక్టర్తో

అనుబంధాన్ని ఇపుడే తెంచేసుకోవాలి...

ఆ రాత్రి గట్టిగా నిర్ణయం చేసుకుంది.

అయితే రేణుకకు ఒక విషయం తెలీదు.

స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ కూడా అటు వంటిదే. ఆ ఆకర్షణా వలయంలో చిక్కుకుంటే తప్పించుకుని బయటపడటం ఏమంత సులభం కాదు. రాత్రిళ్లు ఎన్ని నిర్ణయాలు చేసుకున్నప్పటికీ రోజూ విక్టర్ని కలుసుకోకుండా ఉండలేక పోతున్నది రేణుక.

* * *

దాదాపు రెండు నెలలు గడిచి పోయాయి. ఇంతవరకు వారి మాటలు స్నేహపరిధిని దాటలేదు. అయితే ఒక రోజు మాత్రం ఎదురుచూడని విధంగా విక్టర్ మనస్సులో మాట చెప్పేశాడు.

ఆరోజు... ఇద్దరూ బీచిలో కూర్చున్నారు.

విక్టర్ స్పెయిన్‌లో తను చూసిన బుల్ ఫైట్ గురించి చెబుతుంటే ఆసక్తిగా వింటున్నది రేణుక.

స్పోర్ట్స్, రాజకీయాలు, సినిమా, సాహిత్యం, సంగీతం...ఏ విషయం మీద నయినా అనర్గళంగా మాట్లాడగల నేర్పుంది విక్టర్‌కి.

విక్టర్ మాట్లాడుతూనే సిగరెట్ వెంట సిగరెట్టుగా అరగంటలో అయిదు సిగరెట్లు తగలేసాడు.

భరించలేక అతడి పెదవుల మధ్య సిగరెట్టు లాగి దూరంగా విసిరికొట్టింది రేణుక.

''అన్ని విషయాలూ తెలుసుగానీ స్మోకింగ్ ఆరోగ్యానికి హానికరం అన్న సంగతి తెలీదా?''

విక్టర్ నవ్వి, ''తెలిసే అలవాటుకి బానిసనయిపోయాను'' అన్నాడు.

''వెరీబాడ్!'' రేణుక అంది.

ఆమె కళ్ళలోకి సూటిగా చూసాడు విక్టర్. ''అసలు ఈ అలవాటు వ్యసనం కింద మారడానికి కారణం నువ్వే!''

రేణుక గుండె లయతప్పింది. వస్తుంది వస్తుంది అని ఎదురుచూసిన క్షణం వచ్చేసిందా? తలవంచుకుని, ''నేనేం చేసాను?'' అంది.

చప్పున ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు విక్టర్. రేణూ, మైడార్లింగ్! ఐ లవ్ యూ...ఐ నీడ్‌యూ! నా మనస్సు, శరీరం నీకోసం తపించిపోతున్నాయి. నువ్వు లేకుండా నేను బతకలేను. స్వీటీ.... ఐ వాంట్ యూ....ఐ వాంట్ యూ ఫరెవర్...''

రేణుక మనోనేత్రాల ముందు వికృతంగా కాలిపోయిన అక్క శ్యామల మృతదేహం కనిపించింది.

'డార్లింగ్! నీవు నన్ను ప్రేమించే కంటే వెయ్యింతలు ఎక్కువగా నేను నిన్ను ప్రేమిస్తున్నాను. కాని... నీ ప్రేమ సంగీకరించి నీదాన్నయే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నాకు లేవు...' భోరుమని ఏడవసాగింది ఆమె అంతరాత్మ.

పైకి మాత్రం బింకంగా, ''ఏదో ఫ్రెండ్లీగా మాట్లాడుతున్నావని చనువుగా మాట్లాడితే చివరికి ఇదా నీ అసలు స్వరూపం. మొత్తానికి మగాడిననిపించుకున్నావు. రెండు రోజులు స్నేహంగా మాట్లాడితే మూడో రోజు ప్రేమ పాఠాలు వల్లించడం మీకలవాటనుకుంటాను'' అంది.

ఆమె వయిపు ఎర్రగా చూసాడు విక్టర్. ''రేణూ! నీకూ, నాకూ మధ్య ఉన్నది స్నేహభావం కాదు. ఆరోజు హోటల్లో మొట్టమొదటిసారిగా నిన్ను

చూసిన క్షణం నుండి ఈ క్షణందాకా నిన్ను నేను ప్రణయదృష్టితోనే చూస్తున్నాను. ఆ సంగతి నీకు సుస్పష్టంగా తెలుసు. అంతేకాదు నువ్వూ నన్ను ప్రేమిస్తున్నావు...కాంక్షిస్తున్నావు"

"అబద్ధం..."

"నువ్వు చెప్పినంత మాత్రాన నిజం అబద్ధమయి ఊరుకోదు. నేను నిన్ను ఆశిస్తున్నానని తెలిసే నా చూపులతో చూపులు కలిపి నాలో ఆశలు రేపావు. నేను పలకరిస్తే నిస్సంకోచంగా నాతో మాట్లాడేవు. కాదనకుండా నా వెంట హోటళ్ళకు, సినిమాలకు, బీచ్‌లకు తిరిగావు. నిస్సంకోచంగా నా ఎంగిలి తిన్నావు. అర్ధరాత్రిళ్లు ఫోను చేసినా గంటల తరబడి మాట్లాడి నన్ను ప్రోత్సాహపరిచావు. నాలో ఇంతగా ఆశలు రేపి ఇప్పుడు కాదని నన్ను వెర్రివాడిని చేద్దామనా నీ ఉద్దేశం?" ఆగ్రహంగా అన్నాడు.

మౌనంగా అతడి చేతిలో నలిగిపోతున్న తన చేతిని లాక్కుంది రేణుక.

"నువ్వు నన్ను ప్రేమించడంలేదని గుండెల మీద చెయ్యి చేసుకుని చెప్పు" రెట్టించాడు విక్టర్.

"నాకంత అవసరం లేదు" ముభావంగా అంది రేణుక.

"రేణూ!" హఠాత్తుగా విక్టర్ కంఠంలో అంతులేని మార్దవం. "నువ్వెందుకు కాదంటున్నావో నాకర్థం కావడం లేదు. రేణూ..ప్లీస్! నువ్వు కాదంటే నేను బతకలేను. నా సుఖం, సంతోషం, మనశ్శాంతి... నా సర్వస్వం నువ్వే. నువ్వు కాదంటే నా జీవితం చీకటయిపోతుంది. రేణూ...నాకు నువ్వు కావాలి, నీ ప్రేమ కావాలి. నీకు దూరమయి జీవితాంతం విరహాగ్ని జ్వాలల మధ్య దహించుకుపోతూ బతికే ధైర్యం నాకు లేదు"

"ప్రాధేయపడితే ఇచ్చేదికాదు ప్రేమ"

"అంటే, నీ ఉద్దేశం?"

"నాకు ప్రేమలు, ప్రణయాలు-వీటిలో విశ్వాసం లేదు. అసలు పెళ్ళి చేసుకోవాలన్న ఉద్దేశమే నాకు లేదు. కేవలం బాహ్య సౌందర్యానికి విలువ ఇచ్చే మగజాతి అంటేనే నాకు ద్వేషం. అందుకే పెళ్ళి, ప్రేమ-వీటికి దూరంగా చదివిన చదువు సార్థకం చేసుకుంటూ పవిత్రంగా, నిష్కామంగా బతకాలన్నదే నా జీవిత ధ్యేయం. నాకు తెలీకుండా నీలో ఆశలు రేపానేమో....క్షమించు" మృదుస్వరాన అంది రేణుక.

ఆమె మనస్సులో పెనుతుఫాను చెలరేగుతున్నది.

ఈ యువకుడితో జీవితం పంచుకోవాలని తనెంతగానో ఆకాంక్షిస్తున్నది. కాని తీరా అతడు కోరితే నిర్దయగా కాదంటున్నది. తన జీవితం విషాదభరితం అవుతుందని తెలిసీ కాదంటున్నది. రేణుక మనస్సు ఆక్రోశిస్తున్నది.

"రేణూ! నిన్ను నువ్వే మోసగించుకునేందుకు ప్రయత్నిస్తున్నావు" నెమ్మదిగా అన్నాడు విక్టర్.

రేణుక మౌనంగా ఉండిపోయింది.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

"రేణూ! ఆలోచించు. ఇది జీవితానికి సంబంధించిన సమస్య. నీ మనస్సు నాకు తెలీదనుకోకు. నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నువ్వు నన్నంతకన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నావు. నేను నిన్ను కోరుకుంటున్నంతగా నువ్వు నన్ను కోరు

కుంటున్నావు. నాకు దూరమయి నువ్వు మనశ్శాంతితో జీవించలేవు. మీ ఇంట్లో కాదంటారేమోనని భయపడుతున్నావా?" లాలనగా అడిగాడు.

రేణుక మాట్లాడలేదు.

"లేక నేను వంచిస్తానేమోనని సంకోచిస్తున్నావా?"

రేణుక నోరు విప్పలేదు.

"నా జీవితాన్ని నీ కాళ్ళకింద తివాచీగా పరచేందుకు తపించిపోతున్నాను. నేను నిన్ను మోసం చేస్తానా? నీ జీవితాన్ని పూలశయ్యగా చేస్తాను. నన్ను నమ్ము"

అప్పటికీ మాట్లాడలేదు రేణుక.

"ఇంతగా ప్రాధేయపడినా నోరు విప్పవు. పువ్వులాంటి నీ హృదయం ఇంత వజ్రకఠినమయి ఉంటుందని నేనూహించలేదు. అప్పన్లే. ఎదుట మోకరిల్లి ప్రాధేయపడేవాళ్ళను చూస్తే ఎవరికయినా అలుసే!" నిష్ఠూరంగా అన్నాడు విక్టర్.

ఒకసారి అతడి వయిపు చూసి తల వంచుకుంది రేణుక.

ఆమె కళ్ళలో నీటిపొరను విక్టర్ గమనించలేదు.

"నేను నీకేమీ కానా?" మళ్ళీ అన్నాడు విక్టర్.

"ఉహుఁ! నువ్వు నాకేమీ కావు" ఒంట్లో శక్తిసంతా కూడదీసుకుని ఆ మాటలంది రేణుక.

"నీ నిర్ణయం మారదా?" బాధాతప్త స్వరంతో అడిగాడు విక్టర్.

"క్షణక్షణానికి నిర్ణయాలు మార్చుకునే అలవాటు నాకు లేదు. నీకు...ఆశాభంగం కలిగించానేమో. నన్ను క్షమించు. ఇకపై నన్ను కలుసుకునేందుకు ప్రయత్నించకు. నీకు, నీ స్నేహానికి గుడ్‌బై. వస్తాను" అని వెళ్ళిపోయింది మండుతున్న గుండెలతో రేణుక.

మనోచక్షువుల ముందు చీకటితో చుట్టివేయబడిన భవిష్యత్తు కనిపిస్తుండగా నిస్పృహగా ఇసుకలో వెల్లకిలా వాలిపోయాడు విక్టర్.

"డాడీ! పరీక్షలయేదాకా నేను హాస్టల్లో ఉంటాను" ఆ రాత్రి భోజనాల సమయంలో అంది రేణుక.

ఆశ్చర్యంగా చూశారు ముకుందరావుగారు. "ఎందుకమ్మా?"

నిర్జీవహాసం చేసింది రేణుక. "కొన్నాళ్ళు హాస్టల్ లైఫ్ ఎంజాయ్ చేయాలని ఉంది."

"నీ ఇష్టం తల్లీ!"

కూతురు మాట కాదనలేని తండ్రి అన్నారు.

మర్నాడే హాస్టల్లో చేరిపోయింది రేణుక.

విక్టర్ని మరచిపోవాలనీ, చేస్తున్న ప్రయత్నాల్లో మొదటి ప్రయత్నం అది.

రోజులు గడిచిపోతున్నాయి.

ఆమె మనస్సుతో చేస్తున్న భీకర పోరాటంలో చదువునొక ఆయుధంగా ఉపయోగించుకుంటోంది.

మహోగ్రంగా సాగిపోతున్న ఆమె చదువుని చూసి స్నేహితురాళ్ళు విస్మితులయారు. రేణుక మాట్లాడ్డం తగ్గించేసింది. నవ్వడం మరచిపోయింది. విక్టర్ని మరచిపోవాలి, అంతే!

అయితే రోజులు గడిచేకొద్దీ విక్టర్ని మరచిపోవడం అనుకున్నంత సులభం కాదని తెలుసుకుంది.

జాగ్రదవస్థలో, సుషుప్త్యావస్థలో స్వప్నావస్థలో, ఊహల్లో ఆలోచనల్లో, అంతటా ... విక్టర్!

తన జీవితంతో అతను ఎంతగా పెనవేసుకుపోయాడో తలచుకుంటే ఆమెకే ఆశ్చర్యంగా ఉంది. అతడి ఆలోచనలే ఆహారంగా, అతడి ధ్యాసే ఊపిరిగా బతుకుతున్న మనిషి ఈ జన్మలో అతడిని మరచిపోగలదా?

"రేణూ! నిన్న నీ ఫ్రెండ్ కలిసి మాట్లాడాడు" ఒక రోజు విద్య అంది.

ఆశ్చర్యంగా చూసింది రేణుక. "ఎవరు?"

"విక్టర్!" ఆమె ముఖంలోకి నిశితంగా చూస్తూ అంది విద్య.

"ఏమి మాట్లాడాడు?'' ముభావంగా అంది రేణుక.

"నీ ఫ్రెండ్ కనిపించడం లేదు. ఊరెళ్ళిందా అని అడిగాడు''

రేణుక మౌనంగా చేతిలో పుస్తకం పేజీలు తిరగేస్తూ కూర్చుంది.

"నువ్వు హాస్టల్లో ఉంటున్న సంగతి చెప్పాను'' విద్యే మళ్ళీ అంది.



''ఎందుకు చెప్పావ్?'' కటువుగా అంది రేణుక.

''అడిగితే చెప్పాను. తప్పా?''

"నా అనుమతి లేకుండా నా వివరాలు ఊళ్ళో అందరికీ చెప్పడం తప్పే" కోపంగా అంది రేణుక.

తెల్లబోయి చూసింది విద్య "రేణూ"

రేణుక మాట్లాడలేదు.

''అసలేం జరిగిందే? పాపం అతను చాలా బాధపడుతున్నాడనుకుంటాను. మనిషి రూపు మారిపోయి ఏదోలా గున్నాడు"

విద్య మాటల్లో అంతులేని కుతూహలం!

కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీరు విద్య చూడకుండా తలవంచుకుని మౌనంగా ఉండిపోయింది రేణుక.



విక్టర్ హాస్టల్ కి వస్తాడేమో!

రేణుక గుండె వేగంగా కొట్టుకుంది.

ఆరాత్రి ఆలోచనలతో కంటిమీదికి కునుకన్నది రాలేదు.

మర్నాడు బుధవారం మధ్యాహ్నం



క్లాసెస్ లేవు. రేణుక తీరిగ్గా గదిలో పడుకుని నిద్రపోయేందుకు ప్రయత్నిస్తుండగా...

''మీకోసం ఎవరో వచ్చారమ్మా" అంటూ కబురు తెచ్చాడు వాచ్ మన్.

తృళ్ళిపడి చూసింది రేణుక.

"ఎవరు?"

''ఎవరో నీగ్రో లాగున్నాడమ్మా''

ఒక్కక్షణం ఆలోచించింది రేణుక.

''చూడు – నేను లేనని చెప్పెయ్యి. ఇప్పుడేకాదు. అతనెప్పుడొచ్చినా నేను లేననే చెప్పాలి. గుర్తుంచుకుంటావుకదూ?'' అని వాచ్ మన్ చేతిలో పదిరూపాయల నోటుంచింది.

"అలాగే చెప్తానమ్మా" అని తలూపుకుంటూ వెళ్ళిపోయాడు.

రేణుక కిటికీ వద్ద నుంచుంది.

కాస్సేపటికి వెళ్ళిపోతూ కనిపించాడు

విక్టర్.

అతడిని చూసి అప్రతిభురాలయింది రేణుక.

ఎప్పుడూ నీటుగా, స్మార్ట్‌గా ఉండే విక్టర్ గడ్డం పెంచేసాడు. బట్టలు కూడా కొద్దిగా నలిగిపోయి ఉన్నాయి. దూరానికే అతడి మొహంలో విషాదం కొట్టొచ్చి నట్లు కనిపిస్తున్నది. నడకలో వెనకటి హుషారు, ఉత్సాహం మచ్చుకయినాలేవు.

అతడిని చూస్తుంటే ఆమె హృదయంలో ఎన్నాళ్లగానో అణచి పెట్టుకున్న దుఃఖం ఏడుపురూపంగా బయటికి తన్నుకు వచ్చేసింది. ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి అలాగే నిద్రపోయింది.

* * *

కళ్ళు మూసుకుని నిశ్శబ్దంగా పడుకున్న రేణుకను ఆలోచనలు శత్రువుల్లా చుట్టుముట్టాయి.

నవ్వుతూ, తుళ్ళుతూ సంతోషంగా సాగిపోతున్న తన జీవితంలో ఈ అవాంఛనీయ పరిణామమేమిటి? వట వృక్షచ్ఛాయనుండి మండుటెండలోకి అందునా ఎడారి మధ్యకు విసిరివేయ బడ్డట్టయింది ... ఆవేదనాగ్ని జ్వాలల మధ్య ఇంకా ఎన్నాళ్ళిలా జీవించాలి?

అహోరాత్రాలు మనశ్శాంతి లేకుండా నీరసంగా, నిస్సారంగా, అనుభవ శూన్యంగా, నిరాశా నిస్పృహలే తోడుగా జీవితాంతం ఇలా అలమటిస్తూ బతక వలసిందేనా? ఇక్కడ తను బాధపడు తున్నట్లే అక్కడ విక్టర్ కూడా బాధ పడుతుండవచ్చునన్న ఆలోచన మరింత అశాంతిని కలుగజేసింది. ఒక వంక తన సర్వస్వం అతడికర్పించి అతడిలో ఒక భాగంగా ఐక్యమైపోవాలని తపిస్తూనే నిర్దయగా అతడిని తిరస్కరించింది. తన నమితంగా కోరుకుంటున్న అతడి హృద యాన్ని తూట్లు పొడిచింది. తన సుఖ సంతోషాలను తనే దూరం చేసుకుంది.

కన్నీళ్ళతో దిండు తడిసిపోయింది.

తమ గుండెల్లో ప్రేమభావం పుట్టిం చిన భగవంతుడు తమనెందుకు ఒకే కులంలో పుట్టించలేదు? ఇద్దరి మధ్య జాతి, కులం, మతంలాంటి అడ్డుగోడలనెందుకు కల్పించాడు?

మనిషి జీవితగతినే మార్చివేసే ప్రణయభావం ఎంత చిత్రమయింది! అది రెండు హృదయాలను ఏకం చేస్తుంది. రెండు జీవితాలను పెనవేస్తుంది. మధురోహలలో తేలిపోయేలా చేస్తుంది. దుస్సహమయిన వ్యధతో నిముషమేనా శాంతి లేకుండా తపింపజేస్తుంది.

మహత్తరమయిన ప్రేమను కవులు, రచయితలు సృష్టించిన ఒక అందమయిన అబద్ధమని తనే ఎన్నోసార్లు కొట్టిపారే సింది. అదే అబద్ధమయితే ఈనాడు తన గుండెల్లో గూడుకట్టుకున్న ఈ వ్యధ కూడా అబద్ధమేనా? ఆరోజు మొట్టమొదటి సారి విక్టర్ని చూసినప్పుడు తనలో ఏర్పడిన సంచలనమే, తర్వాత్తర్వాత అతడిని చూసినప్పుడు కలిగిన సంతోషం, మధుర స్పందనం ఈనాడు అతడి వియోగంలో అనుభవిస్తున్న దుస్సహమయిన ఈ వ్యధ.... ఇవన్నీ అబద్ధమేనా? అబద్ధమే అయితే శ్యామలక్క ఎందుకు చచ్చిపోయింది? మనిషి ఆలోచనా సరళినే మార్చివేసే ఈ అపురూపమయిన భావం అబద్ధమయితే మనిషిని కట్టిపడేస్తున్న మరెన్నో అను బంధాలు కూడా కేవలం భ్రాంతి అవుతా యేమో! ఆలోచనలతో ఆ రాత్రి కాళ రాత్రి అయింది.

మర్నాడుదయం ఉషోదయం చూస్తుంటే ఒకనాడు అరుణోదయం చూసి తాననుభవించిన సంతోషం గుర్తొచ్చింది.

ఆనాటికి, ఈనాటికి... ఎంత వ్యత్యాసం!

వద్దు వద్దనుకుంటూనే విక్టర్ని ప్రేమించినందులకేనా ఈనాడింత వేదన అనుభవిస్తున్నది?

''రేణూ! మనమిద్దరం కలసి అమరావతిలో కాఫీ తీసుకుని చాలా రోజులయింది. ఇవ్వాళ వెళ్దామా?" ఆరోజు సాయంత్రం విద్య అంది.

"ష్యూర్!"

కాఫీ తాగుతుండగా విద్య, "హాయ్" అని ఎవరినో ఉత్సాహంగా పలకరించింది. ఎవరా అని వెనక్కి తిరిగి చూసింది రేణుక.

వాళ్ళకేసి వస్తున్న విక్టర్ని చూడగానే ఆమె గుండె లిప్తకాలం కొట్టుకోవడం ఆగిపోయింది. మరుక్షణం రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది. అరచేతుల్లో చెమట పట్టేసింది.

విక్టర్ వచ్చి విద్య పక్కనే కూర్చున్నాడు. "హౌ ఆర్ యూ?"

"ఫైన్!" చిరునవ్వుతో చెప్పింది విద్య.

విక్టర్ మంచినీళ్ళ గ్లాసందుకున్నాడు. "అబ్బ. ఎండ నిప్పులు చెరుగుతున్నది. ఎన్ని నీళ్లు తాగినా దాహం తీరడంలేదు... తాపం చల్లారడం లేదు" అని క్రీగంట రేణుక వయిపు చూశాడు.

రేణుక చూపులు కాఫీకప్పుమీదే కేంద్రీకృతమయ్యాయి.

"పరీక్షలు ఎలా రాశారు?" స్నేహంగా అంది విద్య.

"క్లాసు రావచ్చు... మీ పరీక్షలూ దగ్గరకొచ్చాయనుకుంటాను?"

"ఆఁ. వచ్చేవారమే...తలచుకుంటేనే గుండె గుభేలుమంటోంది"

"మీ ఫ్రెండు మరీ హార్డ్వర్క్ చేస్తున్నట్లుంది? ఈ రెండు నెలల్లో బాగా చిక్కిపోయారు" రేణుక వయిపు పరిశీలనగా చూస్తూ అన్నాడు విక్టర్.

రేణుక మొహం ఎర్రబడింది.

"మీరు ఎప్పుడు వెళ్తున్నారు?" విద్య అంది.

"రేపు!''

"రేపేనా?"

"ఊఁ. పరీక్షలయిపోయాయిగా...ఇక ఇక్కడ ఏమి పని?"

"మళ్ళీ ఎప్పుడొస్తారు?"

వెయిటర్ కాఫీకప్పు తెచ్చి విక్టర్ ముందుంచాడు.

"ఏమో బహుశా రాననుకుంటాను" కాఫీ కప్పు అందుకుంటూ అన్నాడు విక్టర్. వీళ్ళిద్దరిమధ్య ఇంత చనువు ఎప్పుడేర్పడిందా అని ఆలోచిస్తున్నది రేణుక.

ముగ్గురికీ గులాబ్జాం తెప్పించాడు విక్టర్.

"ఇప్పుడెందుకండీ?" మొహమాటంగా అంది విద్య.

"జీవితంలో మళ్ళీ కలుసుకుంటామో లేదో. విడిపోయేముందు మన స్నేహానికి గుర్తుగా నోరు తీపి చేసుకోండి...ప్లీజ్!" అన్నాడు విక్టర్.

గబగబ స్వీట్ తినేసి లేచింది విద్య. "మరిచేపోయాను. ఈరోజు గుడికి వెళ్ళాలని ఇంట్లో త్వరగా రమ్మన్నారు. వస్తాను"

"విష్ యూ ఆల్ సక్సెస్!" స్నేహంగా

అన్నాడు విక్టర్.

"సేమ్ టు యూ!"

"గుడ్‌బై"

"గుడ్‌బై"

రేణుక కూడా లేచింది.

"వెళ్ళకు. నీతో మాట్లాడాలి" ఆమె చెయ్యిపట్టి ఆపేస్తూ అన్నాడు విక్టర్.

ఒకసారి అతడివయిపు చూసి మౌనంగా కూర్చుంది రేణుక.

విద్య వెళ్ళిపోయింది.

రేణుక తింటున్న స్వీట్ తను తీసుకుని, తను తింటున్నది ఆమె ముందుంచాడు విక్టర్.

చురుగ్గా చూసింది రేణుక.

గులాబ్‌జాం తినడమే తన జీవిత ధ్యేయమన్నట్లు సీరియస్‌గా తింటున్నాడు విక్టర్. ఎన్నోసార్లు తినగా లేనిది ఈ ఒక్కసారి తింటే ఏమయింది అనుకుని ప్లేటు చేతిలోకి తీసుకుంది.

"మాటలు మరచిపోయావా లేక నాతో మాట్లాడ్డం ఇష్టంలేదా?" విక్టర్ అన్నాడు.

ఒకసారి అతడి వయిపుచూసి మౌనంగా ఊరుకుంది రేణుక.

"మనస్సులోమాట పైకి చెప్పడమే నేను చేసిన పొరబాటనుకుంటాను. అప్పట్నుండి నేను నీకు శత్రువునయానులాగుంది. నేను వెంటబడతానేమోననే కదూ హాస్టల్లో ఉంటున్నావు?"

"విక్టర్!" వ్యధగా అంది రేణుక.

ఆమె కళ్ళలోకి లోతుగా చూశాడు విక్టర్. రేణుక తలవంచుకుంది. విక్టర్ మళ్ళీ మాట్లాడే ప్రయత్నం చేయలేదు. రేణుక చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. రేణుక కాదనలేదు.

ఇద్దరూ మౌనంగా స్వీటు తిని లేచారు.

"ఎక్కడికి వెళ్దాం?" హోటల్‌నుండి బయటికి వస్తూ అడిగాడు విక్టర్.

"నీ ఇష్టం!"

"బీచికి వెళ్దామా?"

తల ఊపింది రేణుక.

బీచిలో జనానికి బాగా దూరంగా దాదాపు నిర్జనంగా ఉన్నచోట కూర్చున్నారు. తీరం చేరుకోవాలని వ్యర్థంగా ప్రయత్నిస్తున్న కెరటాలవంక చూస్తూ మౌనంగా కూర్చున్నారిద్దరూ.

"నేను రేపు వెళ్ళిపోతున్నాను" ఎంతోసేపటికి మెల్లిగా అన్నాడు విక్టర్.

అతడివయిపు చూసింది రేణుక.

"ఇందాక విద్యతో చెప్తున్నావుగా. విన్నాను"

"నేను వెళ్ళిపోతున్నానంటే నీకేమీ అనిపించడంలేదా?"

"ఏమనిపించాలి?"

ఆమె వయిపు తదేకంగా చూశాడు విక్టర్. స్వర్ణప్రతిమలాగున్న ఆమె జీవితంలో తనకు చోటులేదనుకుంటే అతడికి భరించశక్యం కానంత బాధనిపించింది.

"రేణుకా! ... ప్చ్... నిన్ను నిందించి ఏం ప్రయోజనం. ... నేను దురదృష్టవంతుడిని ... నిజంగా దురదృష్టవంతుడిని!... గుండెల్లో దాచుకునే తల్లిదండ్రులు, అభిమానంతో ముంచెత్తే తోబుట్టువులు, అష్టయిశ్వర్యాలు, ఆరోగ్యం, తెలివితేటలు...ఓహ్ నేను అడగకనే భగవంతుడు నాకన్ని సుఖాలు, సౌకర్యాలు ప్రసాదించాడు. నా జీవితాన్ని వర్ధించిన విస్తరి చేశాడు. సాటివాళ్ళుచూసి ఈర్ష్యపడే జీవితాన్ని ఇచ్చాడు.కాని..కాని నేనమితంగాకోరుకునే నిన్ను నాకుకాకుండాచేసి నా జీవితంతో

ఆడుకుంటాడులాగుంది. ఇన్నాళ్ళూ నీకు నా పట్ల అనురక్తి ఉందన్న ఆశ నా హృదయంలో ఏదో మూల మినుకు మినుకుమంటూ భవిష్యత్తుమీద ఆశను కలిగించింది. ఇప్పుడిహ ఆ ఆశ అడియాసే అని తెలిశాక ఇక ఏ ఆశతో జీవించను? ఎవరికోసం జీవించను? ఏ ఆధారంతో బతకను? ఓ గాడ్...ఐవాంట్ టు డై" చేతుల్లో మొహం దాచుకున్నాడు విక్టర్.

ఇక నిగ్రహించుకోలేకపోయింది రేణుక. తన ప్రాణానికి ప్రాణం అయిన అతడి మొహంలో విషాదం, మాటల్లో వ్యథ భరించలేకపోయింది. అతడి భుజం మీద చెయ్యివేసి "విక్కీ..." అంది అనురాగ పూర్ణ కంఠంతో.

చివ్వున తలెత్తి చూసాడు విక్టర్. అతడి కళ్లు ఎర్రగా మంకెనపువ్వుల్లా గున్నాయి.

"ఐ లవ్ యూ!" రేణుక హృదయం చీల్చుకుని వచ్చిందామాట. నమ్మశక్యం కానట్లు చూశాడు విక్టర్.

"రేణూ!"

"నిజం డార్లింగ్. ఆరోజు హోటల్ పామ్‌గ్రోవ్‌లో నిన్ను మొట్టమొదటిసారి చూసిన ఆ క్షణాలు ఎటువంటివోకాని ఆ క్షణమే నా మనస్సు నీకంకితమయింది.

ఆ క్షణంనుండి ఈ క్షణం దాకా నీ ఆలోచనలే ఆహారంగా, నీ ధ్యాసే ఊపిరిగా బతుకుతున్నాను.

వేగంగా ఆమెను దగ్గరికి లాక్కుని చుబుకం పైకెత్తి కళ్ళలోకి సూటిగా చూస్తూ, "రేణూ! నువ్వు నిజమే చెబుతున్నావా?" ఉద్విగ్నస్వరంతో అడిగాడు విక్టర్.

"మనస్సులో లేనిమాటను నోటితో చెప్పగల లౌకికురాల్ని కాను నేను. నా హృదయంలోకి ప్రవేశించిన ఒకే ఒక మగాడివి నువ్వు. నా మరణపర్యంతం అక్కడ ఒక్క నువ్వే ఉంటావు...."

"రేణూ.... మై స్వీటీ... మై లవ్" అంటూ ఆవేశంగా ఆమె మొహాన్ని ముద్దులతో ముంచెత్తాడు విక్టర్.

"అబ్బ ఎవరయినా చూస్తారు. వదులు" అతడి కౌగిలి విడిపించుకొనేందుకు ప్రయత్నిస్తూ అంది రేణుక.

"చూస్తే చూడనీ!" అంటూ ఆమె పెదవులు అందుకున్నాడు విక్టర్.

ఆమె లేతపెదిమలు అతడి మోటు పెదవులకింద కొన్ని క్షణాలు కర్కశంగా నలిగిపోయాయి.

"రేణూ!" ఆమె ముంగురులు సవరిస్తూ లాలనగా పిలిచాడు విక్టర్.

అతడివేపు మత్తుగాచూసి తియ్యగా నవ్వింది రేణుక. "నువ్విలాంటివాడివని నాకు ముందే తెలుసు. అందుకే ఇన్నాళ్లూ దూరంగా ఉండిపోయాను. ఈరోజు నాకు ఏమయిందో నిగ్రహం కోల్పోయాను" అనిఅతడి హృదయంమీద వాలిపోయింది.

"మై ప్రెట్టీడాల్!"అని ఆమెను అలాగే పొదివిపట్టుకున్నాడు విక్టర్. "నా తప్త హృదయానికి ఈ జన్మలో శాంతి లభించదని భయపడ్డాను. నా ప్రేమ ఫలించింది. నా ప్రణయదేవత నన్ననుగ్రహించింది. నేనదృష్టవంతుడిని"

"మనిద్దరం అదృష్టవంతులమే!"

అతడి షర్టు గుండీలువిప్పి ఛాతీని పెదిమలతో స్పృశించింది రేణుక.

"ఈక్షణంకోసం ఎంతగా తపించిపోయానో తెలుసా?" పులకించిపోతూ అన్నాడు విక్టర్.

అతడి మెడవంపులో మొహం పెట్టు

కుని తన్మయావస్థలో అలాగే ఉండి పోయింది రేణుక.

"నన్ను ప్రేమిస్తూనే ఇన్నాళ్ళూ నన్నేడిపించావు కదూ!" నిష్టూరంగా అన్నాడు విక్టర్.

అంతసేపు ప్రియుడి పరిష్వంగంలో అనుభవిస్తున్న ఆనందం పాలపొంగులో నీళ్ళు చిలకరించినట్లు చప్పగా చల్లారి పోయి వాస్తవం గుర్తొచ్చింది రేణుకకు. విక్టర్ కేసి ఆర్తిగా, తపనగా చూస్తూ "నా కలల్లో, ఊహల్లో, ఆలోచనల్లో, సుషుప్తావస్థలో, జాగ్రదావస్థలో నా అణువణువునా నువ్వే. నా రక్తంలో కలసిపోయి నువ్వే. నా ఆశలకు, ఆశయాలకు, కోరికలకు కేంద్రం నువ్వే. అలాంటి నా జీవితంతో ఇంతగా పెనవేసుకుపోయిన నిన్ను నేనెలా మరువగలను? నీకు దూరమయి ఎలా బతగ్గలను?" రుద్ధకంఠంతో అంది.

ఆమె మొహం రెండుచేతుల్లోకి తీసుకుని కళ్ళలోకి చూస్తూ "మరచిపొమ్మని ఎవరన్నారు?" అన్నాడు విక్టర్.

"నా దురదృష్టం" పెదిమలు కంపిస్తూండగా అంది రేణుక. "మన అనుబంధాన్ని మా ఇంట్లో ఒప్పుకోరు. అందుకే మనస్సుచంపుకుని నీకు దూరంగా ఉండేందుకు ప్రయత్నించాను. నిన్ను చూస్తుంటే మనస్సుచెప్పిన మాట వినదని నీకు కనిపించకుండా హాస్టల్లో దాక్కున్నాను. నీ ఉత్తరాలు చూస్తే మనస్సు ప్రలోభానికి లొంగిపోతుందని చూడకుండా కాల్చేశాను...."

"రేణూ!"

"ప్రాణప్రదంగా దాచుకోవలసిన ఉత్తరాలను నిర్దయగా మంటకాహుతి చేశాను. నన్ను క్షమించు" దీనంగా అంది రేణుక.

"ఆ ఉత్తరాలు పోనీ. నేను మా ఊరెళ్ళాక రాసే ఉత్తరాలకు జవాబివ్వక పోయావో తర్వాత నీపని చెపుతాను'' బెదిరిస్తున్నట్లు అన్నాడు విక్టర్.

''వద్దు" కంగారుగా అంది రేణుక.

"ఏమిటి వద్దు?" ఆమె చేతినునుపును పరీక్షిస్తూ అన్నాడు విక్టర్.

"ఉత్తరాలు రాయొద్దు.''

''ఎందుకని?''

రేణుక చేతివేళ్ళు ఒక్కొక్కటి ముద్దు పెట్టుకుంటున్న విక్టర్ తాపీగా అడిగాడు.

"మన అనుబంధాన్ని మరి పొడిగించడం నాకిష్టం లేదు."

''ఎందుకని ఇష్టంలేదు?''

"ఓహ్, నువ్వు మళ్ళీ మొదటి కొస్తున్నావు" నిస్పృహగా అంది రేణుక.

విక్టర్ ఆమె ఒళ్ళో తల పెట్టుకుని పడుకున్నాడు.

"ఇన్నాళ్ళూ నేననుభవించిన చిత్తక్షోభ, ఆరాటం, అశాంతి చెప్పినా నువ్వు నమ్మవు. రేణూ..నా సుఖం, సంతోషం, మనశ్శాంతి ఒక్క నీ దగ్గరే ఉంది. నీకు దూరమయి నేను బతకలేను. నువ్వు నాకు కావాలి. శాశ్వతంగా కావాలి. ఈ రెండు నెలలుగా నేనెంత నరకం అనుభవించానో నీకు తెలీదు!"

"ఎందుకు తెలీదు? నేనంతకన్నా ఎక్కువ నరకమే అనుభవించాను" అతడి వెంట్రుకల్లో వేళ్లు జొనుపుతూ అంది రేణుక.

"అందుకే నీ మనస్సు తెలిసాక ఇప్పుడిహ నిన్ను వదులుకోలేను. ప్రపంచం అడ్డు నిలిచినాసరే ప్రాణాలు ఒడ్డి పోరాడి అయినా నిన్ను గెలుచుకుంటాను. నువ్వింకేమీ సాకులు చెప్పి నాకు దూరంగా ఉండేందుకు ప్రయ

త్నించకు. నేను భరించలేను. నీవులేని జీవితం ఊహించేందుకే భయంగా ఉంది"

అతడి నుదురు మీద గెడ్డం ఆనించి కళ్ళలోకి ప్రేమగా చూసింది రేణుక.

"ప్రపంచంలో ఎందరో స్త్రీలుండగా నన్నింతగా కోరుకుంటున్నావెందుకు?"

"ఎందరినో తిరస్కరించిన నువ్వు నన్నెందుకు ప్రేమిస్తున్నావు?" ఎదురు ప్రశ్నించాడు విక్టర్.

"ఆ మాట నా హృదయాన్నడుగు"

"నీ ప్రశ్నకు జవాబూ నా హృదయమే చెప్పాలి"

"కాని సమాంతర రేఖల్లో పయనిస్తున్న మనం కలుసుకోవడం అసంభవమేమో!"

"సమాంతర రేఖలు కలుసుకునేలా నేను చేస్తాను"

"ఎలా?"

"ఊహూ, ఇప్పుడే చెప్పను"

"చెప్పకపోతే నువ్వే దాచుకో"

"అలాగే దాచుకుంటాను. నువ్వు మాత్రం 'మన ప్రేమ ఫలించదు. అందుకని గుడ్‌బై చెప్పుకుని విడిపోయి జీవితాంతం విరహగీతాలు పాడుకుంటూ నిరాశా నిస్పృహలే జీవిత సహచరులుగా నరకంలో బతుకుదాం' అనకు. ప్రేమికులు ఆశావాదులయి ఉండాలి. అప్పుడే ప్రణయ పోరాటంలో గెలుపు లభిస్తుంది"

రేణుక అతడి కళ్ళలోకి చూస్తూ ఆలోచిస్తూ మౌనంగా కూర్చుంది. హఠాత్తుగా ఆమెకేదో గుర్తొచ్చి అతడి చేతిమీద కండ ఊడివచ్చేలా గిచ్చింది.

కెవ్వుమన్నాడు విక్టర్. "ఏయ్, ఏమిటీ మోటుసరసం?"

"సరసం కాదు. కోపం"

"కోపమా!"

"నువ్వు, విద్య ముందుగా అనుకునే హోటల్లో కలుసుకున్నారు కదూ?"

"అవును" ఒప్పుకున్నాడు విక్టర్.

ఈ రోజు మాత్రం ధైర్యం చేయకుంటే నీ మనస్సు అసలు తెలిసేది కాదు. ఆ స్థితిలో ఊరెళ్ళినా ఉత్సాహంగా ఉండి ఉండేవాడిని కాను. నిజంగా ఈ రోజు విద్యగారు నాకు చేసిన సాయం సాటిలేనిది"

అతడి ఛాతీ మీద చూపుడు వేలితో రాస్తూ- "మీ ఇంట్లో ఒప్పుకుంటారా?" అంది రేణుక.

"మా ఇంట్లో నా ఇష్టం కాదనరు" గర్వంగా అన్నాడు విక్టర్. "పైగా డాడీ, మమ్మీ ప్రేమ వివాహం చేసుకున్నారు. అటువంటప్పుడు నేను నిన్ను చేసుకుంటా నంటే కాదంటారా? పైగా మా డాడీకి హిందూ స్త్రీలంటే చాలా గౌరవం. హిందూ స్త్రీని చేపట్టినవాడు తప్పక సుఖపడతాడని డాడీ అభిప్రాయం. కనుక మన పెళ్ళికి సంతోషంగా ఒప్పుకుంటారు"

"అదృష్టవంతుడివి!"

"నా భార్యగా నువ్వు నా జీవితంలోకి అడుగు పెట్టిననాడే నిజంగా నేనదృష్ట వంతుడినవుతాను"

"మా ఇంట్లో ఒప్పుకోరన్నప్పటికీ నువ్వు పదే పదే పెళ్ళిమాటెత్తుతున్నావ్?"

"నా పేరు విక్టర్. విక్టరీ సాధించడం నా లక్షణం. అసలు చిన్నప్పటి నుండి కోరుకున్నది సాధించేదాకా విశ్రమించే అలవాటు నాకు లేదు. తెలిసిందా? మన పెళ్ళి జరుగుతుంది. జరిగితీరుతుంది" నొక్కి చెప్పాడు విక్టర్.

రేణుక మాట్లాడలేదు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"నువ్వు మళ్ళీ ఇండియా వస్తున్నావా?"

అడిగింది రేణుక.

"రాకుంటే మన పెళ్ళిలా జరుగుతుంది. పోనీ నువ్వూ కెన్యా వచ్చేస్తావా?"

"ఆఁ...వస్తాను. తాళిబొట్టు చేతబట్టుకు మరీ వస్తాను" వ్యంగ్యంగా అంది రేణుక.

ఆమె బుగ్గమీద చిటికెవేసి, "నీకంత సాహసం లేదని నాకు తెలుసు. మెడిసిన్ చదువుతున్నావే కాని నువ్వొత్త పిరికి గొడ్డువి. నీలాంటి పిరికిదాన్ని ప్రేమించాక సాహసం చేయక తప్పదుగా! నేనే వస్తాను" నవ్వి అన్నాడు విక్టర్.

అతడి మొహాన్ని ఆప్యాయంగా తాకుతూ, "నువ్వు రేపే వెళ్లితీరాలా?"



అంది రేణుక.

"ఆఁ. మరో మూడు రోజుల్లో నా చెల్లెలి పెళ్లి. వెళ్లకుంటే అది మళ్ళీ జన్మలో నా మొహం చూడదు"

"ప్చ్. ఈరోజే దగ్గరయ్యాము. అంతలోనే వియోగం. నిన్ను చూడకుండా ఎలా ఉండడం?" దిగులుగా అంది రేణుక.

విక్టర్ చప్పున జేబులోంచి ఒక ఉంగరం తీసి ఆమె వేలికి తొడిగాడు. ఆ వేలిమీద ముద్దుపెట్టుకుంటూ, "రేణూ.! గుర్తుంచుకో! ఈ క్షణం నుండి నువ్వు నాదానివి" అన్నాడు.

అతడి నొసట చుంబించి, "నేను ఎప్పటికీ నీదాన్ని" అంది.

"థాంక్యూ డార్లింగ్!"

కబుర్లతో మరికొంత సేపు గడిచిపోయింది.

"ఎనిమిది గంటలు కావస్తోంది. ఇక నేను వెళ్ళాలి" అని లేచింది రేణుక.

"ఎన్నిగంటల ఫ్లయిట్‌కి వెళ్తున్నావ్?" చెప్పాడు విక్టర్.

"మళ్ళీ ఎన్నాళ్ళకో నిన్ను చూట్టం?"

"నన్ను చూడకూడదనేగా హాస్టల్లో దాక్కున్నావ్. ఇప్పుడీ దిగులేమిటి?"

అతడి వయిపు తమకంగా చూస్తూ "అప్పుడయితే మనస్సుకి తెర అడ్డం ఉంది. ఇప్పుడా తెర అడ్డం తొలిగింది. అందుకే దిగులు. అర్థమయిందా?" అంది రేణుక.

"ఉత్తరాలు కాలేజి అడ్రస్సుకి రాయనా, హాస్టల్ అడ్రస్సుకి రాయనా?"

"ఉత్తరాలు అసలు రాయవద్దన్నానా"

"టట్... ప్రేమికులు ఎడబాటులో ఉత్తరాలు రాసుకోవడంలోనే మజా ఉంది. విరహతాపాన్ని పేజీల కొద్ది వర్ణిస్తూ వివరించడం, ప్రేయసి రాసింది చదవడంలో ఉన్న మజా.. ఓహ్ చెప్పనలివి కానిది. ఒక విధంగా ప్రేమికులకు వియోగంలో స్వాంతన కలిగించేది, ఇద్దరి మధ్య ప్రణయానుబంధాన్ని గాఢతరం చేసేది ప్రేమలేఖలే తెలుసా?"

"ఇప్పుడయితే హాస్టల్లో ఉంటున్నాను. పర్లేదు. ఇంటికి వెళ్ళాక నీ ఉత్తరాలు నాకు సమస్యగా తయారవుతాయేమో!" భయంగా అంది రేణుక.



"ప్రతి చిన్న విషయానికి బెంబేలు పడటం నీకలవాటులాగుంది. ఏదోమార్గం ఆలోచించు. ఉత్తరాలు రాయకుండా నేను ఉండలేను. అంతేకాదు నా ఉత్తరాలకు నువ్వు జవాబు ఇచ్చి తీరాలి. లేకుంటే ఊరుకోను"

రేణుక ఆలోచిస్తూ మౌనంగా ఉండి పోయింది.

లేడీస్ హాస్టల్‌కి కొద్ది దూరంలో స్కూటరాపి "ప్చ్... రాత్రి పూట ప్రేయసికి గుడ్‌బై చెప్పి విడిపోవడం కన్న దారుణమయిన శిక్ష మరొకటుండదేమో మగజన్మ ఎత్తినవాడికి" దిగులుగా అన్నాడు విక్టర్.

రేణుక నవ్వి "ఆ ప్రేయసే భార్య అయితే పెళ్ళికన్న దారుణమయిన శిక్ష మరొకటి ఉండదని వాపోతారేమో మీ మగాళ్ళు" అంది.

"నేనెన్నటికీ అలా చింతించను. నువ్వు మొగుడి జీవితాన్ని నరకం చేసే ఆడదానివికావు. నీ సాహచర్యంలో నా జీవితం తియ్యగా, హాయిగా, చల్లగా సాగిపోతుందన్న నమ్మకం నాకుంది"

"నా బాహ్య సౌందర్యం చూస్తున్నావు. తప్ప నా మనస్సెటువంటిదో, నా గుణగణాలెటువంటివో నీకేం తెలుసు?"

"నీకు తెలీదేమో? మొహం చూసి మనిషి ఎటువంటివాడో తెలుసుకోగల శక్తి నాకుంది" విక్టర్ అన్నాడు.

రేణుక అతడి మొహంలోకి ఏదో వెదుక్కుంటున్నదాన్లా చూసింది.

"ఏయ్, ఏమిటా చూట్టం?"

అతడి చేతినందుకుని పెదిమల మీదుంచుకుంటూ "ఐ లవ్‌యూ" అంది ప్రణయోద్విగ్నకంఠంతో రేణుక.

ఆవేశంగా ఆమె మొహం మీదికి వంగబోయాడు విక్టర్.

"మిస్టర్! మనం ఎక్కడున్నదీ మరచిపోయావా? బుద్ధిగా వచ్చినదారినే వెళ్లు. గుడ్‌నైట్" అని హాస్టల్‌కేసి వెళ్ళిపోయింది రేణుక.

• • •

మధూ!" అంటూ లోపలికి వచ్చింది విమలమ్మ.

మంచం మీద పడుకుని ఏదో నవల చదువుతున్న మధు పుస్తకం పక్కన పెట్టేసి లేచికూర్చుంటూ, "రా అమ్మా!" అన్నాడు.

విమలమ్మ మంచం పక్కనే ఉన్న పేము కుర్చీలో కూర్చుంది.

మధు, కిరణ్మయి ఢిల్లీ నుండి పొద్దున్నే వచ్చారు. కిరణ్మయి చెల్లెలు పెళ్ళి నాలుగు రోజుల్లో ఉంది.

"టాక్సీకి చెప్పేసావా?"

"ఆఁ అడ్వాన్స్ కూడా ఇచ్చేసాను. పొద్దున్న అయిదుకంతా వచ్చేస్తుంది. అప్పుడు బయలుదేరితేనే ఎండకు ముందే వెళ్ళి చేరొచ్చు."

"సరే" అంది విమలమ్మ.

కిరణ్మయి విమలమ్మకు స్వయానా అన్నకూతురు. అందుకే పుట్టింట్లో పెళ్ళికి కొడుకు, కోడలితోబాటు నాలుగు రోజుల ముందే బయలుదేరింది. ఇక్కడ ఒంటరిగా ఉండలేరు కనుక వాళ్ళతోబాటు ముకుందరావుగారూ వెళ్తున్నారు.

"జ్యోతిర్మయి మన రేణుకంటే రెండేళ్ళు చిన్నది. వచ్చే వారం ఈపాటికి అది ఓ ఇంటి దీపమయి వెలుగుతూ ఉంటుంది. మనమ్మాయి జీవితంలో ఆ శుభఘడియ ఎప్పుడొస్తుందో, మన ఇంట్లో మంగళవాద్యాలు ఎప్పుడు మోగు

తాయో?!" దిగులుగా అంది విమలమ్మ.

"నెల్లూరు సంబంధం నిశ్చయమయి నట్లేగా?" అన్నాడు మధు.

"ఏదీ, నీ చెల్లెలు ఒప్పుకుంటేగా!"

"ఏమంటుంది?"

"పెళ్ళిమాట ఎత్తితే కస్సుమంటుంది. అదేమంటే చదువుకి, పెళ్ళికి లంకె పెడుతుంది. చదువు పూర్తయేదాకా పెళ్ళిమాటే ఎత్తవద్దంటుంది. వాళ్ళేమో 'పెళ్ళయినా అమ్మాయి ఇక్కడ మద్రాసులోనే మీతోపాటుండి చదువుకుంటుంది. ఏదో మా తృప్తి కోసం ఆ శుభకార్యం కాస్తా జరిగిపోనివ్వండి' అంటూ ఒకటే తాపత్రయపడుతున్నారు. దీన్నెలాగయినా ఆ ఇంట్లో పడేస్తే ఈ ముసలితనంలో మాకు నిశ్చింతగా ఉంటుంది. మీ నాన్నగారయితే రాత్రింబవళ్లు అదే ధ్యాసగా ఉంటున్నారు. దీని ధోరణి ఇలాగుంది. అందర్లోకీ దానికి నువ్వంటేనే ఎక్కువ ఇష్టం. నీవద్దే ఎక్కువ చనువుగా ఉంటుంది. నువ్వే దానికి ఎలాగయినా నచ్చజెప్పి ఈ పెళ్ళికి ఒప్పించాలి."

"పోనీ, ఇంకో రెండేళ్లు ఆగరాదా రేణు భయం సమంజసమేనేమో! పెళ్ళయితే ఇప్పట్లా ఏకాగ్ర చిత్తంతో చదవడం కష్టం. పైగా ఆ విషయంలో మరిన్ని సమస్యలు పుట్టుకురావచ్చు. ఇన్నేళ్ళ చదువూ గట్టెక్కనివ్వండి. పెళ్ళికేం? నువ్వన్నట్లు మనమ్మాయి అందానికీ, చదువుకీ రాజాలాంటి సంబంధమే వస్తుంది. కృష్ణమోహన్ అన్నివిధాల యోగ్యుడే. చెల్లెలికి ఈడు జోడయినవాడే. కానీ చేసుకోవలసిన దానికి ఆసక్తి లేనప్పుడు మనం ఏం చేయగలం?"

"మనం చూసే సంబంధాలు ఏ ఒక్కటీ దానికి నచ్చవనే నా నమ్మకం"

"అమ్మా!" ఆశ్చర్యంగా అన్నాడు మధు.

విమలమ్మ నిట్టూర్చింది. "ఇన్నాళ్ళూ నిప్పుని దాచుకున్నట్లు నా మనస్సులో ఈ రహస్యం దాచుకున్నాను. ఇక నా వల్లకాదు."

"అమ్మా...ఏమయింది?" ఆదుర్దాగా అన్నాడు మధు.

"నీ ముద్దుల చెల్లెలు ఎవరో నీగ్రో కుర్రాడితో ప్రేమ వ్యవహారం సాగిస్తున్నదేమోనని నాకనుమా[illegible]ందిరా నాయనా!"

ఆశ్చర్య చకితుడయాడు మధు.

"నీకెలా తెలుసు?"

"ఆ అబ్బాయి కొన్నాళ్ళుగా క్రమం తప్పకుండా ప్రతి నిత్యం ఇక్కడ బస్సుస్టాప్ వద్ద హాజరవుతుంటాడు. ఎక్కడున్నాడో, ఏమిటోగాని పొద్దున్న ఆరు గంటలకల్లా వచ్చేస్తాడు. స్కూటరుంది అతగాడికి. అయినా గంటల తరబడి బస్సుస్టాపులో వేచిఉంటాడు. ఎందుకో తెలుసా? కేవలం నీ చెల్లిని చూట్టంకోసమే! నేనూ మొదట్లో గమనించలేదు. ఒకరోజు వీధిలో చెత్తపారబోస్తూ యధాలాపంగా చూశాను. అతడు అక్కడే నిలబడి మన ఇంటికేసే చూస్తున్నాడు. అమ్మాయి పువ్వులు కోస్తూ అతడి వంక రెప్పవాల్చకుండా చూస్తున్నది. అది గమనించకుండా ఆరోజునుండి ఇద్దరినీ ఒక కంట కనిపెట్టి చూడసాగాను. రోజులు గడిచేకొద్దీ నా అనుమానం బలపడింది."

మధు నవ్వాడు "నువ్వు మరీ ఎక్కువగా తెలుగు నవలలు చదువుతుంటావు. అందుకే ఏదో ఊహించుకుంటున్నావు"

"లేదురా. నేను వెయ్యి కళ్ళతో కని పెట్టి చూస్తున్నాను. కొన్ని నెలలుగా

దానిలో స్పష్టంగా మార్పు కనిపిస్తున్నది. ఒక ఘడియ ఎంతో సంతోషంగా, ఉత్సాహంగా ఉంటుంది.

మరికొన్ని పర్యాయాలు శూన్యంలోకి నిస్తేజంగా, నిర్వేదంగా చూస్తూ తనలో తనే కుమిలిపోతున్నట్లు ఎలాగో ఉంటుంది.

మధు మాట్లాడలేదు.

కిరణ్మయి గుమ్మంవద్ద నుంచుని వాళ్ళ మాటలు ఆసక్తిగా వింటున్నది.

"నీకు తెలుసుగా...మీ నాన్నగారికి ఈ ప్రేమలు దోమలు అంటే గిట్టదు. కులాంతర, మతాంతర వివాహాలకు అస్సలు సమ్మతించరు. ఆయన మొండి పట్టుదల కారణంగా పెద్దమ్మాయి నిండు జీవితం బలయింది. ఇప్పుడిదేమో ఏకంగా స్త్రీగోనే వరించినట్లుంది. ఇది ఎటుపోయి ఎటు వస్తుందో! నాకు తలచుకుంటేనే కాళ్ళు చేతులు చల్లబడుతుంటాయి. తండ్రి అంగీకరించరని రేణుకి తెలుసు. అందుకే అది లోలోపలే కుమిలిపోతున్నదని నా అనుమానం. నువ్వీమధ్య చూడలేదుగానీ ఎముకలు పైకి లేచిపోయి అస్థిపంజరం లాగున్నదంటే నమ్ము. నిజంగా దాన్ని చూస్తే కడుపు తరుక్కుపోతుంది"

"అసలు విషయమేమిటో నేను నెమ్మదిగా రేణునడిగి తెలుసుకుంటాను. నువ్వనవసరంగా దిగులుపడకు" అనునయంగా అన్నాడు మధు.

"అది రోజురోజుకీ అలా జీవచ్ఛవంలా తయారవుతుంటే దాన్ని చూస్తూ దిగులుపడకుండా ఉండడం సాధ్యమేనా? శ్యామల మరణం ఇంకా నా గుండెల్లో పచ్చిగానే ఉంది"

"నా సలహా ఏమిటంటే తొందరపడి రేణుకి పెళ్ళి ప్రయత్నాలు తలపెట్టద్దు. నేను డాడీకి చెప్తాను. ప్రస్తుతం రేణుని మాతోబాటు ఢిల్లీ పిలుచుకు వెడతాను. కొన్నాళ్ళుండి వస్తుంది"

"నాకు తెలిసింది చెప్పేసి హృదయ భారం తగ్గించుకున్నాను. ఇక నీ చెల్లెలి బాధ్యత నీదే. ఏమి చేస్తావో ఏమో. నీ ఇష్టం"

సాయంత్రం హాస్టల్ వద్ద చెల్లెలిని కలిసాడు మధు. రేణుకను చూసి అప్రతిభుడయాడు. ఆమెను సుజాత పెళ్ళప్పుడు ఆఖరుసారి చూసాడు. ఈ నాలుగయిదు నెలల్లో గుర్తుపట్టలేనంతగా చిక్కిపోయింది.

"ఏమిటన్నయ్యా, అలా కొత్తగా చూస్తున్నావు?" నవ్వి అంది రేణుక.

"నువ్వు నా చెల్లెలివేనా అని చూస్తున్నాను!"

"నీకెందుకా సందేహం వచ్చింది?"

"లేకపోతే ఏమిటి. పది లంఖణాలు చేసినదాన్లా ఇలా చిక్కిపోయావు? ఒంట్లో బాగా లేదా ?" చెల్లెలివంక పరీక్షగా చూస్తూ అన్నాడు మధు.

"నాకేం....నిక్షేపంగా ఉన్నాను. మీరెప్పుడు వచ్చారు?"

"పొద్దున్న"

"బాబిగాడు, వదిన కులాసా?"

తల ఊపాడు మధు.

"పెళ్ళికి ఎప్పుడు వెళ్తారు?"

"రేపుదయం" ఏదో ఆలోచిస్తూ అన్నాడు మధు.

"జ్యోతిని అడిగానని చెప్పు. వీలయితే రమ్మని లెటర్ రాసింది. పరీక్షలు వదిలి ఎలా రావడం?"

"అన్నట్లు రేణూ,మాతోబాటు నువ్వూ ఢిల్లీ వస్తున్నావు. టిక్కెట్ కొనేసాను"

"బాగుంది. నాకిప్పుడు ఢిల్లీలో పనే

మిటి?"

"పనుంటేనే రావాలా? జస్ట్ ఫర్ ఛేంజ్. కొన్నాళ్లుండి వద్దువుగాని. మళ్ళీ పెళ్ళయితే నువ్వు రావడం, రాకపోవడం అంతాబావగారి ఇష్టా యిష్టాలమీద ఆధారపడి ఉంటుంది" నవ్వి అన్నాడు మధు.

తనూ నవ్వి, "అలాగే...వస్తాను" అంది రేణుక.

మరి కాస్సేపుండి వెళ్ళిపోయాడు మధు.

పెళ్ళి ఇంట్లో ఉన్నా అతడి మనస్సు చెల్లెలి చుట్టూ పరిభ్రమిస్తున్నది. సౌందర్యానికి నిర్వచనం చెప్పేలాగుండే చిన్న చెల్లెలంటే అతడికి ప్రాణం. ఆమె కంట తడిపెడితే అతడి ప్రాణాలు గిలగిల్లాడిపోతాయి. తండ్రి కారణంగా ఆమె ప్రేమ విఫలమయి శ్యామలకుమల్లే ఆమె జీవితమూ విషాదాంతం కావచ్చునన్న ఊహే అతడు భరించలేకపోతున్నాడు. రేణుక కోరుకుంటున్న వ్యక్తి నీగ్రో కానీ, మరెవరు కానీ రేణుక జీవితం అతడితో ముడిపడేలా తను చూస్తాడు. ఆ ప్రయత్నంలో తండ్రితో పోట్లాడేందుకు సైతం సిద్ధమే. రేణుక మరో శ్యామల కాకూడదు.

ఢిల్లీ వెళ్ళిన వారం రోజుల తర్వాత ఒక రోజు...

మధు ఆరోజు దినపత్రిక చూస్తుండగా పోస్ట్ వచ్చింది. ఎయిర్ మెయిల్. కెన్యా నుండి రేణుక పేర వచ్చింది. బాగా బరువుగా ఉంది. ఏదో ఆలోచనతో తల పంకించాడు మధు.

"రేణూ" పిలిచాడు.

లోపలినుండి రేణుక వచ్చింది.

"నీకు పోస్ట్ వచ్చింది"

"ఏదీ?" ఆత్రంగా అడిగింది.

మధు ఇచ్చాడు.

కవరు అందుకుంటుండగా రేణుక కళ్ళలో మెరిసిన మెరుపులు మధు దృష్టిని దాటిపోలేదు.

"కెన్యాలో నీకు తెలిసినవాళ్ళెవరున్నారమ్మా?" కాజువల్‌గా అడిగాడు మధు.

కొన్ని క్షణాలు తటపటాయించి చివరికి "విక్టర్ అని ఒక ఫ్రెండు" అంది రేణుక.

"ఎలాంటి ఫ్రెండ్?"

రేణుక వెంటనే జవాబు చెప్పలేదు.

"చెప్పవా?"

అప్పటికీ మౌనం వీడలేదు రేణుక.

"ఆ ఫ్రెండ్ కారణంగానే డాక్టర్ కృష్ణమోహన్‌తో పెళ్ళి వద్దంటున్నావు కదూ?" ఆమె వయిపు పరీక్షగా చూస్తూ అడిగాడు మధు.

"అన్నయ్యా!"

"నాదగ్గరే దాపరికమా" నిష్ఠూరంగా అన్నాడు మధు.

అతడి వయిపు చూసింది రేణుక.

తను ఎంతో అభిమానించే అతడితో విక్టర్ గురించి చెప్పేసి అతడి సాయం అర్థించాలని ఎప్పుడో నిర్ణయించుకుంది. అందుకే విక్టర్‌కి ఇక్కడి అడ్రస్సు ఇచ్చింది. తీరా ఇప్పుడు అన్నగారు అడిగేటప్పటికి తటపటాయించింది.

"చెప్పవా?" మధు రెట్టించాడు.

"అవునన్నయ్యా! విక్టర్‌కి నేను మనస్సిచ్చాను. అతడితో జీవితం పంచుకోవాలని ఆకాంక్షిస్తున్నాను. పెళ్ళంటూ చేసుకుంటే ... అతడినే చేసుకుంటాను. కాదంటే నీకు చెల్లెలిగా, డాడీకి కూతురుగా ఇలాగే ఉండిపోతాను. అంతే తప్ప నా జీవితంలో మరో మగాడికి చోటు

లేదు" తలవంచుకుని మంద్రస్వరాన అంది రేణుక.

"నీతోపాటు మెడిసిన్ చదువుతున్నాడా అతను?"

"ఊహుఁ ఐ.ఐ.టి బి.టెక్ చదివాడు"

"అతడికి మనస్సిచ్చావు, అతడితో జీవితం పంచుకోగోరుతున్నావు...సరే. నీతో జీవితం పంచుకునే అర్హత అతడికుందా మరి?"

"అతడు నాకన్నా అన్నివిధాలా అధికుడే అన్నయ్యా"

"అంతనమ్మకంగా చెప్పేస్తున్నావ్?"

"తెలుసు కాబట్టే చెప్తున్నాను"

"ఏమి తెలుసు?"

"విక్టర్ చాలా బ్రిలియంట్ అన్నయ్యా! అతడికి తెలీని విషయమంటూ లేదు. క్రికెట్‌నుంచి కామన్‌వెల్త్ దాకా, సినిమానుండి సైన్స్ దాకా, చేతబడి నుండి చంద్రమండలం దాకా ఏ విషయమయినా సరే, అతడు మాట్లాడ్డం ప్రారంభించాడంటే ఇవతలివాళ్లు మంత్రముగ్ధుల్లా అతడి మాటలు వింటూ గంటల తరబడి అలా కూర్చుండిపోవలసిందే. అతడి విషయ పరిజ్ఞానం అటువంటిది. ప్రపంచాన్ని రెండుసార్లు చుట్టి వచ్చాడు. కరాటేలో బ్లాక్‌బెల్ట్ పొందాడు ... ఎంత బాగా పాడతాడో తెలుసా? మద్రాసు. టి.వి.లో రెగ్యులర్‌గా అతడి ప్రోగ్రాం ఉంటుంది"

"కాని అతను నీగ్రో"

"అయితేనేం? చామనఛాయగా, పొడుగ్గా, ఆరోగ్యంగా ఎంత హాండ్సమ్‌గా ఉంటాడో తెలుసా?" పరవశంగా అంది రేణుక.

"వాళ్ళ దేశంలో వాళ్ళ స్థితిగతులెటువంటివో ఏమయినా తెలుసుకున్నావా?"

"కెన్యాలో ఆర్థికంగా, సామాజికంగా చాలా ఉన్నత స్థితిలో ఉన్న కుటుంబం వాళ్ళది" అని విక్టర్ తండ్రిని గురించి, తోబుట్టువులను గురించి, టీఎస్టేట్స్ గురించి ఇంకా తక్కిన ఆస్తి వివరాలు తనకు తెలిసినంతమటుకి చెప్పింది రేణుక.

"అంతా బాగానే ఉంది. మరి డాడీనెలా ఒప్పిస్తావు?"

దిగులుగా చూసింది రేణుక. "ఏమో. నాకేమీ పాలుపోవటం లేదు" నిస్సహాయంగా అంది రేణుక "నాన్న ఆ రోజుల్లోనే ఇంగ్లండ్ వెళ్ళి చదివి వచ్చారు గదా! అయినప్పటికీ కులమత విషయాల్లో ఇంత సంకుచితంగా ఎందుకుంటారు?"

"అదే నాకూ అర్థం కాదు. ఆయనగారి ఈ సంకుచిత మనస్తత్వం వలననే శ్యామల అంపరి గుండెల్లో చిచ్చు రగిలించి వెళ్ళిపోయింది" వ్యధగా అన్నాడు మధు.

"అతనికి దూరమయి నేను బతకలేను. అన్నయ్యా.... నువ్వే నాకు సాయం చేయాలి" రుద్ధకంఠంతో అంది రేణుక.

విచలితుడయాడు మధు.

"ఆ బాధ్యత నాది. ధైర్యంగాఉండు. అప్పుడయితే ఇంకా చదువుకుంటున్నాను కాబట్టి శ్యామల విషయంలో ఏమీ చేయలేకపోయాను. ఇప్పుడలా కాదుగా! అవసరమయితే డాడీతో పోట్లాడి నీపెళ్ళి నువ్వు కోరుకునే వ్యక్తితో జరిపిస్తాను. నీ సుఖసంతోషాల కంటే తక్కినదేదీ ముఖ్యంకాదు. నువ్వు నిశ్చింతగా ఉండు" చెల్లెలి తల నిమురుతూ ఆపేక్షగా అన్నాడు.

కృతజ్ఞతార్ద్రనేత్రాలతో చూసింది

రేణుక "అమాత్రం మాట భరోసా ఇచ్చావు చాలు."

"నీ స్వీట్ హార్ట్ చాలా పెద్ద ఉత్తరమే రాసినట్లున్నాడు. వెళ్ళి చదువుకో" చిలిపిగా అన్నాడు మధు.

సిగ్గుతో మొహం ఎర్రగా కందిపోగా లోపలికి పారిపోయింది రేణుక.

* * *

ఆ రోజు ఢిల్లీ నుండి రేణుక వస్తున్నది. ఆమెను రిసీవ్ చేసుకునేందుకు ముకుంద రావుగారు, విమలమ్మ సెంట్రల్ స్టేషన్‌కి వచ్చారు.

అలవాటు ప్రకారం ట్రెయిన్ రెండు గంటలు లేటు!

విసుగ్గా ఒక సిమెంట్ బెంచీ మీద కూలబడింది విమలమ్మ. ముకుందరావు గారు వెళ్ళి మేగజైన్‌కొని తెచ్చుకున్నారు. ఏదో పుస్తకం దొరికితేచాలు ఆయనకు కాలం ఇట్టే గడిచిపోతుంది.

విసుగ్గా చుట్టూ చూస్తున్న విమలమ్మ కొంచెం దూరంలో, క్షణక్షణానికి చేతి గడియారంలో టైం చూసుకుంటూ అసహనంగా పచార్లుచేస్తున్న విక్టర్ని చూసి నొసలు చిట్లించింది. రేణు వస్తున్న సంగతి ఇతగాడికి తెలుసా?

అతడివయిపే చూస్తూ కూర్చుంది.

అలా చూస్తుంటే కొన్నాళ్ళ క్రితం ఏదో మేగజైన్‌లో చదివిన ఒక ఉదంతం గుర్తొచ్చి ఆమె ఒళ్లు జలదరించింది.

ఈ కుర్రాడు తనకూతురంటే మోజు పడుతున్నాడని తెలుస్తూనే ఉంది. ఒకవేళ రేణు కాదంటే ఇతనూ ఆమె మొహం మీద ఆసిడ్ పోసేస్తాడా? దాని బతుకు నాశనం చేసేస్తాడా? ఏమో....!

ఈ కాలం కుర్రాళ్ళు అన్నిటికీ తెగించినవాళ్ళు!

ఒకవేళ తాము కాదన్నా అలా జరిగే ప్రమాదముంది.

విమలమ్మ గుండెల్లో దడపుట్టింది.

ఈ కుర్రాడెవరోకాని తన గుండెల్లో చిచ్చు పెట్టడుకదా!

ఆలోచనల్లోనే ట్రెయిన్ వచ్చేసింది.

ఇద్దరూ ఆదుర్దాగా ట్రెయిన్ ఆ చివర నుండి ఈ చివరకు చూసుకుంటూ వెళ్తున్నారు.

"డాడీ..ఇటు!"

ఒక కంపార్ట్‌మెంట్ డోర్ వద్ద నిలిచి ఉత్సాహంగా పిలిచింది రేణుక.

అప్పుడే విక్టర్ని చూసింది.

చందమామ దర్శనంతో వికశించిన కలువలా వికశించింది ఆమె సుందర వదనం.

విక్టర్ చేతి వేళ్ళను పెదవులతో స్పృశించి చేతిని ఆమె వయిపు గాల్లోకి విసిరాడు.

అందుకున్నానన్నట్లు తల్లిదండ్రులు చూడకుండా చిన్నగా తల పంకించింది రేణుక.

లగేజ్ తీసుకుని ఎంట్రన్స్‌కేసి బయలు దేరారు.

వేల ఈనినట్లు ఎటుచూసినా జనం. బయటికి వెళ్ళటం అందరికీ అవసరమే.

ఒకరినొకరు తోసుకుంటూ, కుమ్ముకుంటూ వెళ్తున్న ఆ సమయంలో... తల్లిదండ్రులకు కొద్దిగా వెనక నడుస్తున్న రేణుక పక్కకొచ్చాడు విక్టర్.

ఆమె నడుం మీద చెయ్యివేసి, "మధ్యాహ్నం హోటల్ చోళ..." ఒక్క ఆమెకు మాత్రం వినపడేంత మెల్లిగా చెప్పి జనసంద్రంలో కలిసి పోయాడు.

మధ్యాహ్నం రెండు గంటలందాకా ముళ్ళ మీద ఉన్నట్లే గడిపింది రేణుక. ఆ తర్వాత ఉండలేకపోయింది.

తన కోసం విక్టర్ వేయికళ్ళతో ఎదురు చూస్తుంటాడు!

వెళ్ళాలి. వెళ్ళితీరాలి!!

డ్రెస్ చేసుకుని బయలుదేరింది.

"అమ్మా! విద్యా వాళ్ళింటికి వెళ్లొస్తానే!" గోముగా అంది.



"రేపు కాలేజీలో కలుసుకుంటారుగా?"

"కాలేజీలో మాట్లాడుకునేందుకు వీలుంటుందేమిటి? నలభై రోజుల విశేషాలు చెప్పుకోవాలి. అమ్మా, ప్లీజ్. వెళ్తానే!"

"సరేలే. వెళ్ళి త్వరగా వచ్చెయ్."

"మా అమ్మ ఎంత మంచిదో!" తల్లి మెడచుట్టూ చేతులు వేసి బుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ అంది రేణుక.

ముకుందరావుగారు ఇంట్లో లేరు. రామకృష్ణ మఠంలో ఏదో ప్రోగ్రాం ఉందని ఫోంచేసిన వెంటనే వెళ్ళిపోయారు. ఆయన ఇంటికి తిరిగి రావడం ఇహ రాత్రి ఏ పదకొండు గంటలకో. ఆ ధైర్యంతోనే రేణుక బయలుదేరింది. కాని తనను నమ్మి ఎంతో స్వేచ్ఛనిస్తున్న తల్లి దండ్రులను తను మోసం చేస్తోంది.

పోనీ విక్టర్ దగ్గరకి వెళ్ళకుండా మానేస్తే అనిపించిందో క్షణం.మరుక్షణం మనో నేత్రాలముందు విక్టర్ రూపం కనిపించింది.

మరి ఆలోచించలేదు. వెళ్తున్నానని తల్లితో చెప్పేసి బయట పడింది.

హోటల్ ఎంట్రన్స్‌వద్దే నుంచుని ఉన్నాడు విక్టర్.

అతడిని చూసి స్నిగ్ధ దరహాసం చేసింది రేణుక "ఆలశ్యం చేశానా?"

ఆమె శరీరంలో ఎత్తు పల్లాలను నిస్సం కోచంగా, నిశితంగా గమనిస్తున్న విక్టర్ ఆమె చేతినందుకుని "ఆఁ, మూట ముప్పయి యుగాలు" అని లోపలికి దారి తీసాడు.

ఇద్దరూ వెళ్ళి ఒకమూల కూర్చున్నారు. ఒకరివయిపొకరు ఆర్తిగా, తపనగా చూసుకుంటూ మౌనంగా కూర్చున్నారు. కాలం నిశ్శబ్దంగా కదిలి ముందుకు సాగి పోతున్నది.

ముందుగా తేరుకున్న రేణుక "నువ్వెప్పుడొచ్చావ్?" అంది.

"మొన్న!" ఆమె మొహం మీంచి చూపులు మళ్ళించకుండా అన్నాడు విక్టర్.

"సెలవులు ఎలా గడిచాయి?"

"నీ వియోగంలో నిమిషాలు యుగాలుగా భారంగా, దుస్సహంగా..."

రేణుక కిలకిలనవ్వి "నీకు కవిత్వము తెలుసునని నాకు తెలీదు సుమా" అంది.

నవ్వినప్పుడు ఆమె బుగ్గల మీద పడిన సొట్టలు ముగ్ధదృష్టితో చూస్తూ, "నీకు తెలీదేమో....ప్రతి ప్రేమికుడూ కవి అవుతాడు" అన్నాడు విక్టర్.

"ఈ కబుర్లకేంగాని మీ చెల్లెలి పెళ్ళి



ఎలా జరిగింది?"

"దివ్యంగా"

"హనీమూన్ స్విట్జర్లాండ్ వెళ్ళారని రాశావు. తిరిగొచ్చేసారా?"

"ఊఁ"

"నీ రిజల్టేమయింది?" విక్టర్ చేతి వేళ్ళతో తన చేతివేళ్లు పెనవేస్తూ అంది రేణుక.

విక్టర్ చూసాడు.

తెల్లగా, పొడుగ్గా, కోమలంగా, అందంగా ఉన్న ఆమె వేళ్ళ మధ్య అతడి వేళ్లు లావుగా, మోటుగా ఎలాగో ఉన్నాయి.

"వెన్నెల వెలుగులాంటి నువ్వు, అమావాస్య చీకటిలాంటి నేను. మనకిద్దరికీ జతకలిపాడు ఆ భగవంతుడు. ఎంత విచిత్రం!" అన్నాడు.

"చీకటిలేందే వెలుగులేదు. వెలుగు లేనిదే చీకటి లేదు. నువ్వులేని నేను లేను, నేనులేని నువ్వు..."

"లేను" అని రేణుక మాటలు పూర్తి చేసాడు విక్టర్.

"మన ఇద్దరి కలయికే జీవితం!" అతడివయిపు ఆరాధనగా చూస్తూ అంది రేణుక.

వెయిటర్ వచ్చాడు ఆర్డర్ కోసం.

విక్టర్ రేణుక వంక చూసాడు.

"నాకు అయిస్క్రీం చాలు."

రెండు అయిస్క్రీంలకు ఆర్డరిచ్చాడు విక్టర్.

వెయిటర్ వెళ్ళిపోయాడు.

"మెడికోవయి ఉండి అస్తమానం అయిస్క్రీం తింటావెందుకు?"

రేణుక నవ్వింది "రోజుకోకప్పు అయిస్క్రీం తినందే నేనుండలేను. చిన్నప్పటినుండి అలా అలవాటయిపోయింది"

"మంచి అలవాటే!" నవ్వి అన్నాడు విక్టర్.

"నువ్వు ఫోంచేసావా?" హఠాత్తుగా గుర్తొచ్చి అడిగింది రేణుక.

తల ఊపాడు విక్టర్.

"ఇంతకీ నీ రిజల్టేమయిందో చెప్పనే లేదు?" విక్టర్ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అంది రేణుక.

"కాలేజి ఫస్టొచ్చాను. దేశం మొత్తం మీద నాది ఫిఫ్త్ రాంక్..."

"కంగ్రాచ్యులేషన్స్!" సంతోషంగా అంది రేణుక "ఎమ్ టెక్ కంటిన్యూ చేస్తావా?"

"ఊఁ. నీ హవుస్ సర్జన్సీ అయేదాకా నేనూ ఇక్కడే ఏదో ఒకటి చేస్తుండాలిగా"

వెయిటర్ అయిస్క్రీం కప్పులు టేబిల్ మీద ఉంచి నెమ్మదిగా వెళ్ళిపోయాడు.

"తీస్కో!"

రేణుక మౌనంగా అయిస్క్రీం కప్పు అందుకుంది.

"ఉత్తరాలు అంత చక్కగా రాయగలవని నేననుకోలేదు సుమా! గుండెల మీద పడుకుని చెవిలో గుసగుసగా చెబుతున్నట్లే ఫీలయ్యాను" రేణుకకు అయిస్క్రీం తినిపిస్తూ అన్నాడు విక్టర్.

సిగ్గుగా నవ్వింది రేణుక "నీ ఉత్తరాలు చదివి నేనూ అలాగే ఫీలయ్యాను"

"దొంగా ... నన్నంత గాఢంగా ప్రేమిస్తూనే ఏడిపించావు కదూ? ఉండు నిన్నేం చేసానో..."

"ఏంచేస్తావ్?" తల వంచుకుని అంది రేణుక.

"ఏమి చేస్తానో కాస్సేపట్లో నీకే తెలుస్తుంది" ఆమె వయిపు కాంక్షగా చూస్తూ అన్నాడు విక్టర్.

అతడి కళ్ళలో ఎరుపు జీరలు చూసి గుండె జల్లుమంది. అసలే ఉద్రేకం ఎక్కువ.

రేణుక మథనపడసాగింది. తను వచ్చి తప్పు చేసిందా? అతడి కళ్ళలో ఏమి శక్తి ఉందో! ఆ కళ్ళలోకి చూస్తే తనను తాను మరచిపోతుంది. అతడి కోరిక కాదనలేని బలహీనత తననావరిస్తుంది. ఈరోజు ... ఏదో దుర్బల క్షణంలో తను అతడికి లొంగిపోతుందా? రేణుక మనస్సు పరిపరి విధాల ఆలోచిస్తున్నది. హోటల్నుండి బయటికి వచ్చాక స్కూటర్ స్టార్ట్ చేస్తున్న ప్రియుడి నుద్దేశించి, "ఎక్కడికి?" అంది.

"స్వర్గానికి!"

"ఏమిటి?"

"ఎస్ మై డార్లింగ్. ఇంకాస్సేపట్లో మన కోసం స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి" చిలిపిగా అన్నాడు విక్టర్.

రేణుక మొహం ఎర్రబడింది. "విక్కీ ప్లీజ్, స్కూటరాపు. నేను వెళ్ళిపోతాను"

విక్టర్ ఆమె మాటలు వినిపించుకోలేదు.

"పెళ్ళికి ముందు నాకిష్టం లేదని నేనిదివరకే చెప్పాను. నేనంటే ఏమాత్రం గౌరవం ఉన్నా నన్నిప్పుడు వెళ్ళిపోనివ్వు!" ప్రాధేయపూర్వకంగా అంది రేణుక.

విక్టర్ మాట్లాడలేదు. స్కూటరాపలేదు. కొన్ని నిమిషాల తర్వాత స్కూటర్ సౌంథోమ్‌లో అతడి ఇంటి ముందాగింది.

"విక్కీ, ప్లీజ్..."

"రేణూ! నన్నూరికే విసిగించక లోపలికి రా" అసహనంగా అన్నాడు విక్టర్. నిస్సహాయంగా అతడి వెంట లోపలికి నడిచింది రేణుక.

ప్రియుడి కోరిక కాదని అతడిని నిరాశపరచలేని బలహీనతకు లొంగిపోయింది ఆమె.

చిన్నదిగా, అందంగా, ముచ్చటగా ఉంది ఇల్లు. ఇంటిముందు అందమయిన పూలతోట. తలుపు తెరచి లోపలికి వెళ్తూ, "అందర్ ఆయియే మేమ్‌సాబ్!" చిలిపిగా అన్నాడు విక్టర్.

లోపలికి వెళ్తుండగా రేణుక కాళ్లు వణికాయి.

తలుపు మూసి మెరుపు వేగంతో రేణుకను చేతుల్లోకి తీసుకుని ముద్దుల వర్షం కురిపించాడు విక్టర్.

కొన్ని క్షణాలు ఊపిరందక ఉక్కిరి బిక్కిరయింది రేణుక.

"అబ్బ, ఏమిటా ఆవేశం?"

"నీకు దూరంగా ఉండలేక పోతున్నాను రేణూ!" అంటూ ఆమెను హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు విక్టర్.

లతలా అతడిని పెనవేసుకుపోయింది రేణుక.

కొన్ని క్షణాలు తియ్యగా, మత్తుగా గడిచిపోయాయి.

"మై స్వీట్ డార్లింగ్!" అంటూ మరోసారి రేణుక అరుణాధరాలమీద చుంబించి వదిలాడు విక్టర్.

"కూర్చో!"

సోఫాలో కూర్చుంది రేణుక.

ఆమె పక్కనే కూర్చుని షూస్ విప్పి సోఫా కిందికి తోసి, "కోపమా?" లాలనగా అన్నాడు విక్టర్.

"ఎందుకు?"

"బలవంతంగా ఇక్కడికి లాక్కు వచ్చానని!"

రేణుక మౌనంగా గది నలువయిపులా

పరికించి చూడసాగింది. ఖరీదయిన సోఫాసెట్. ఎదురుగా గ్లాస్‌టాప్‌టీపాయ్. టీపాయ్‌మీద ఉన్న పింగాణి ఫ్లవర్ వేజ్‌లో రంగురంగుల గులాబీలు. ఒక వయివు అక్వేరియం. పక్కనే టి.వి., మరో వయిపు బుక్ షెల్ఫ్‌లో ఇంగ్లీష నవలలు....

మేగజైన్ ఆమె మీదికి విసిరేసి, "చూస్తూండు. స్నానం చేసి వస్తాను" అని లోపలికి వెళ్ళిపోయాడు విక్టర్.

మేగజైన్ టీపాయ్‌మీద పడేసి లేచి లోపలికి వెళ్ళింది రేణుక.

అది బెడ్‌రూం.

విశాలంగా ఉన్న కిటికీ పక్కనే డెకొలాం డబల్‌కాట్. యు – ఫోమ్‌బెడ్. బెడ్‌మీద బెడ్‌స్ప్రెడ్, రెండు డన్‌లప్ పిల్లోలు. మంచం పక్కనే టేబిల్ మీద టూ ఇన్ వన్ సెట్. దానిమీద క్రోమియం ఫొటోఫ్రేములో ఆమె ఫొటో. ఫొటోలో రేణుక చిరునవ్వులు చిందిస్తూ ముగ్ధమనోహరంగా ఉంది.

బెడ్‌రూంకి అనుబంధంగా ఉన్న బాత్‌రూంలో నీళ్ళచప్పుడు వినిపిస్తున్నది. విక్టర్‌కి తన చేతులతో స్వయంగా ఏదయినా చేసి ఇవ్వాలనిపించి కిచెన్‌కి వెళ్ళింది.

సిమెంట్ దిమ్మమీద గాస్‌స్టవ్ ఉంది. స్టవ్ పక్కనే అయిదారు స్టీలు గిన్నెలు. ఆ పక్కనే ఉన్న షెల్ఫులో – పై అరలో బోర్నవిటా, హార్లిక్స్,ఓవల్‌టిన్, బ్రూకాఫీ, టీ, చక్కెర, సాల్ట్, మిరియాల పొడి. కింది అరలో కప్పులు, సాసర్లు, గ్లాసులు, గాజు పళ్ళెములు. షెల్ఫ్ పక్కన నిలువెత్తు స్టాండు మీద వాటర్ ఫిల్టర్, ఆ పక్కనే ఫ్రిజ్. ఫ్రిజ్ పక్కన డైనింగ్ టేబుల్, వాష్‌బేసన్. ఒకవయిపు పెరట్లోకి వెళ్ళేందుకు దారి ఉంది.

ఫ్రిజ్ తెరచి చూసింది రేణుక.

ఆ సీజన్లో దొరికే అన్ని రకాల పళ్ళున్నవి. బ్రెడ్, జామ్, వెన్న, కోడి గుడ్లు, ఒక గిన్నెలో పాలు,మరో గిన్నెలో పెరుగు. మరి రెండు గిన్నెల్లో మటన్ చాప్స్, ఫిష్ కట్లెట్స్. ఫ్రూట్ జూస్ బోటిల్స్. వాటి పక్కనే స్కాచ్ విస్కీ బాటిల్స్ చూసి–

'ఉహూఁ. దొరగారికి ఈ అలవాటూ ఉందన్న మాట!' అనుకుంది.

ఆలోచిస్తూ బ్రూ కలుపుతుండగా విక్టర్ వచ్చాడు.

అతడి వయిపు చూసింది రేణుక. మరుక్షణం ఆమె మనస్సు అదుపు తప్పింది. మొలచుట్టూ బాత్ టవల్ తప్ప అతడి శరీరం మీద మరో గుడ్డలేదు. ఎత్తుగా, కండలు మెలిదిరిగిన శరీరం. శరీరంనిండా దట్టంగా పెరిగిన వెంట్రుకలు...అణువణువునా మగసిరి ఉట్టిపడుతున్న అతడిని చూస్తుంటే రేణుక శరీర ఉష్ణోగ్రత ఒక్కసారిగా నూటపది డిగ్రీలకు హెచ్చినట్లు శరీరం వేడెక్కిపోయింది. గొంతు తడారిపోయింది. నరనరాల్లో అనిర్వచనీయమయిన ఏదో బాధ, ఆరాటం, అశాంతి. ఆపాదమస్తకం శరీరం కంపిస్తుండగా చప్పున తలవంచుకుంది. ఆమెను వెనకనుండి కౌగలించుకుంటూ, "కాఫీ కలుపుతున్నావా..గుడ్!" అన్నాడు విక్టర్.

రేణుక మాట్లాడలేదు.

ఆమె మెడమీద చుంబిస్తూ "ఐ లవ్ యూ డార్లింగ్!" అన్నాడు తమకంగా.

క్షణంసేపు నిశ్శబ్దంగా నిలబడిపోయింది రేణుక. తర్వాత "కాఫీ!" అంది. ఆ క్షణం ఆమె గొంతు ఆమెకే కొత్తగా వినిపించింది.

కాఫీ తీసుకుని బెడ్‌రూంలోకి వెళ్తూ, "నువ్వూ రా" అన్నాడు.

సంకోచంగానే వెళ్ళింది రేణుక.

విక్టర్ మంచంమీద కూర్చుని ఉన్నాడు.

రేణుక చెయ్యిపట్టి లాగి ఒళ్ళో కూర్చోబెట్టుకుంటూ "అలా ఉన్నావేం?" అన్నాడు లాలనగా.

"ఎలా ఉన్నాను?"

"విలన్ చేతికి చిక్కిన హీరోయిన్లా!"

పక్కున నవ్వింది రేణుక. హఠాత్తుగా ఆమె హృదయం తేలిక పడ్డట్లనిపించింది.

"నిజం. నువ్వు విలనువే!" హాయిగా నవ్వుతూ అంది.

"ఎవరికి?" ఆమె వెంట్రుకలు వాసన చూస్తూ అన్నాడు విక్టర్.

"డాక్టర్ కృష్ణమోహన్‌కి"

నొసలు చిట్లించాడు విక్టర్. "ఎవరతను?"

"నా తల్లిదండ్రులు నాకు నిశ్చయం చేసిన వరుడు"

"రేణూ"

"నిజమే డార్లింగ్. నా పెళ్ళి అతడితో జరిపించాలని డాడీ చాలా పట్టుదలగా ఉన్నారు. ఇంట్లో అందరూ అతనంటే చాలా ఇష్టపడుతున్నారు. నిన్ను చూడకుంటే, నువ్వు నా జీవితంలోకి తుఫానులా ప్రవేశించకుంటే అతడిని చేసుకునే ఉండేదాన్నేమో. కాని ఇప్పుడు నువ్వే ప్రాణంగా బతుకుతున్న నేను మరొకరిని నా జీవితంలోకి ఎలా ఆహ్వానించగలను?"

"మీ ఇంట్లో మరీ ఒత్తిడి చేస్తే?"

"చచ్చిపోతాను తప్ప మరొకరితో జీవితం పంచుకోలేను" కొద్దిగా వెనక్కి తిరిగి విక్టర్ భుజంమీద తల వాల్చి అంది రేణుక.

ఆమె చుట్టూ చేతులు బిగించాడు విక్టర్.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"పెళ్ళి...కాకుండా నాకిష్టంలేదని చెప్పినా నువ్వు నన్ను ఇబ్బందిలో పడేస్తున్నావు"

"నిన్ను పెళ్ళి చేసుకోకుండా నీ ఒంటిమీద చెయ్యివెయ్యను"

"విక్కీ!" విస్ఫారిత నేత్రాలతో చూస్తూ అంది రేణుక.

ఆమె కళ్ళమీద మృదువుగా చుంబించి "నీకిష్టంలేని పనిచేసి నీ మనస్సు నొప్పించనని ఆనాడే మాటిచ్చాను. మరచిపోయావా?" అన్నాడు విక్టర్.

"మరి...మరి నన్నిక్కడికి ఎందుకు లాక్కువచ్చినట్లు?"

"ఉండు నీకే తెలుస్తుంది" అని ఆమెను తన ఒళ్ళోనుంచి లేపి మంచం మీద కూర్చోబెట్టి బీర్వా దగ్గరికి వెళ్లాడు విక్టర్.

అతడివంకే చూస్తున్నది రేణుక.

"రేణూ!"

"ఊఁ!"

"కళ్లు మూసుకో, నీకో మంచి బహుమతినిస్తాను."

"ఏమిటి?"

"అబ్బ, మూసుకుందూ. నీకే తెలుస్తుంది"

ఒకసారి విక్టర్‌వేపుచూసి కళ్ళు మూసుకుంది రేణుక.

హఠాత్తుగా ఆమె మెడమీద చల్లగా ఏదో తగిలింది. చప్పున కళ్ళు తెరచింది.

గుండెలు తాపుతూ పసుపుతాడుకి మంగళసూత్రాలు.

రేణుక నిశ్చేష్టురాలయింది!

"విక్కీ ... ఏం చేసావ్?" కలవర పాటుతో అంది.

"నిన్నింతెలా నాదాన్ని చేసుకోవాలో నాకర్థం కాలేదు. అన్నట్లు ఎన్ని ముళ్లు వేయాలి?"

"మూడు!"

అప్పటికి రెండుముళ్లు వేసిన విక్టర్ మరో ముడివేసి, "ఈ క్షణంనుండి నువ్వు నా అర్ధాంగివి. నీ జీవితం శాశ్వతంగా నాతో ముడిపడింది. ఇక నిన్ను నానుండి మృత్యువుతప్ప మరెవ్వరూ వేరు చేయలేరు" అన్నాడు.

మంగళసూత్రాలు చేతులలోకి తీసుకుంది రేణుక.

రెండుజీవితాలను ఏకంచేసే పవిత్ర బంధం...

వివాహబంధం!

ఎలా జరిగినప్పటికీ తన పెళ్ళి విక్టర్‌తో జరిగిపోయింది. అతడితో ఈ జన్మలో తెంచుకోలేని అనుబంధం ఏర్పడిపోయింది. ఆ అనుబంధానికి బంధితురాలయి అతడి ఇంటిదీపమయి అతడి కష్టసుఖాలు పంచుకుంటూ అతడికి తోడుగా నీడగా అతడే సర్వస్వంగా అతడిలో ఒక భాగమయి, నది సాగరంలోకలిసినట్లు తను అతడిలో ఐక్యమయిపోవాలి.

"పెళ్ళిపందిరి, బాజాబజంత్రీలు, వేద మంత్రాలు, అక్షింతలు, తల్లిదండ్రుల ఆశీర్వచనాలు ఏవీలేకుండా క్లుప్తంగా, రహస్యంగా నాలుగ్గోడలమధ్య పెళ్ళి జరిగిపోయిందని బాధపడుతున్నావా?" ఆమె చుబుకం పైకెత్తి కళ్ళలోకి చూస్తూ లాలనగా అడిగాడు విక్టర్.

అతడి చూపులతో చూపులు కలిపింది రేణుక.

'మాటే మంత్రము
మనసే బంధము
మమతే మంగళవాద్యము
ఇది కల్యాణం, కమనీయం, జీవితం'

పాట గుర్తొచ్చి మనస్సు పులకరించింది.

నిజం!

విక్టర్ మాటే వేదమంత్రంగా,

అనురాగపూర్ణమయిన అతడి మనస్సే వివాహవేదికగా,

అతడి మమతే మంగళవాద్యంగా,

అతడి ప్రణయవీక్షణాలే అక్షింతలుగా,

అతడి స్నిగ్ధదరహాసమే దీపాలంకరణగా—

అకస్మాత్తుగా, అతివిచిత్రంగా, గమ్మత్తుగా తనపెళ్ళి అతడితో జరిగిపోయింది.

అతడి సాహచర్యంలో జీవితం కమనీయంగా, శోభస్కరంగా, సుమధుర ప్రణయగీతంగానే సాగిపోతుంది.

అపూర్వకాంతితో వెలుగుతున్న కళ్ళతో అతడివేపు చూస్తూ మంత్రబద్ధమయిన నాగినిలా సర్వం మరచి అలాగే ఉండిపోయింది.

ఆమెను అలాగే మంచం మీదికి నెట్టి పక్కనచేరాడు విక్టర్.

ప్రకృతి పురుషుడితో సమైక్యం చెందుతున్న ఆ సమయం...

ఇద్దరిమధ్య కాలం స్తంభించిపోయింది.

"హనీ!" ఎంతోసేపటికి లాలనగా పిలిచాడు విక్టర్.

"ఊఁ" మత్తుగా అంది రేణుక.

"నువ్వింతపని చేస్తావని నేను కలలోనయినా అనుకోలేదు" అతడి పెదిమల

మీద చూపుడువేలితో మృదువుగా రాస్తూ అంది రేణుక.

"తెలిసుంటే అసలిక్కడికి వచ్చి ఉండేదానివే కాదుకదూ?" విక్టర్ అన్నాడు.

రేణుక అతడివేపు గోముగా చూసింది.

ఆమె వయిపు చూశాడు విక్టర్.

సృష్టిలో యావత్ సౌందర్యం, లావణ్యం, లాలిత్యం, కాంతి ఒక్క ఆమెలోనే నిక్షిప్తమైనట్లు మెరిసిపోతున్నది ఆమె నగ్న శరీరం!

విక్టర్‌లో ఆవేశం కట్టలు తెంచుకుంది.

ఫలితంగా ఆమె కుసుమకోమల శరీరం మరోసారి అతడి బిగికౌగిలిలో కంది పోయింది.

"నీకు తెలిసిన ప్రపంచంలో ఎందరో అందాల రాణులు. అందరిని వదిలి నా వెనక పడ్డావెందుకు?" అతడి క్రాఫు చెరుపుతూ అంది రేణుక.

"నేను నీలో కేవలం అందం మాత్రమే చూడలేదు"

"మరి?"

"నీలో యుగయుగాల నా ఆత్మ శాంతిని చూశాను"

"విక్టర్!" అతడిని ఆర్తిగా హృదయానికి హత్తుకుంది రేణుక. "జీవితం ఎంత తియ్యగా, హాయిగా ఉంది!"

"ఈ హాయి వద్దనుకున్నావ్" కించిత్ నిష్ఠూరంగా అన్నాడు విక్టర్.

రేణుక మాట్లాడలేదు.

"మాట్లాడవేం?" రెట్టించాడు విక్టర్.

"మన మధ్య ఎన్నో అడ్డుగోడలున్నాయి" మెల్లిగా అంది రేణుక.

ప్రశ్నార్థకంగా చూశాడు విక్టర్.

"జాతి, మతం, సంస్కృతి, సంస్కారం, దేశం, ఖండం....ఓహ్..ఏ ఒక్క విషయంలోనూ మన మధ్య సారూప్యంలేదు. అటువంటప్పుడు మన కలయిక దుస్సాధ్యమని భయపడ్డాను. అందుకే..."

"ఊ....అందుకే?"

"ఈనాడు ప్రాణాధికంగా ప్రేమిస్తున్న నిన్ను ఒకనాటికి ద్వేషించే దుస్థితి రాకూడదనీ, మనం స్వర్గం అనుకుంటున్నది నరకమయ్యేరోజు రాకూడదనీ..."

"శాశ్వతంగా నాకు దూరంగా ఉండిపోయి నా గుండెల్లో చిచ్చురగిలించాలని చూశావు. నా జీవితం నరకం చేయ సంకల్పించావు. అంతేనా?" రేణుక మాటల మధ్య అందుకుని విసురుగా అన్నాడు విక్టర్.

"అది కాదు...." అని ఏదో చెప్పబోయింది రేణుక.

"నువ్వింకేమీ సంజాయిషీలు చెప్పద్దు. నాకు ఒళ్ళు మండిపోతుంది" కోపంగా అన్నాడు.

రేణుక పెదిమలు కొరుక్కుంటూ మౌనంగా ఉండిపోయింది.

"నీకు వేపకాయంత వెర్రి ఉందేమోనని నాకనుమానంగా ఉంది" రేణుక వంక పరీక్షగా చూస్తూ అన్నాడు విక్టర్.

చ్రుమని చూసింది రేణుక.

"లేకుంటే ఈ వెర్రిమొర్రి ఆలోచనలేమిటి? నీకు, నాకు మధ్య ఉన్నవని నువ్వు చెబుతున్న అంతరాలన్నీ మా మమ్మీ డాడీల మధ్యకూడా ఉండేవి. ఇంకా చెబితే అంతకన్నా ఎక్కువే! వాళ్ళు పెళ్ళి చేసుకుని ముప్ఫయ్యేళ్లు దాటింది. ఈనాటికీ ఒకరిని విడిచి ఒకరు క్షణమైనా ఉండలేరనిపించేంత అన్యోన్యంగా ఉంటారు. అలా మనం ఉండలేమా? అసలు నీకు నిజంగా నేనంటే ప్రేమ

ఉంటే శుష్కమయిన జాతి మత విభేదా
లను ఇలా భూతద్దంపెట్టి చూడవు"-

"అంటే... నువ్వంటే నాకు నిజంగా

"రేణూ! నీ మీద నాకు పరిపూర్ణ
విశ్వాసం ఉంది. బాహ్యాలంకరణకు
ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వని స్త్రీలు
అంతఃసౌందర్యం పెంపొందించుకుంటా
రన్న నమ్మకం చాలా చిన్నప్పటినుండి
నాకుండేది. నిన్ను చూశాక నా నమ్మకం
బలపడింది. నీ అందంకన్న నీ నిరాడం
బరం, సౌమ్యత, చెక్కుచెదరని గాంభీ
ర్యమే నన్నమితంగా ఆకర్షించింది. నీ
మూలంగా మన సంసారంలో ఎటువంటి
కలతలు, వైషమ్యాలు ఏర్పడవు. ఆ



ప్రేమ లేదంటావా?" కోపం, ఆవేదన
సమ్మిళితమయిన కంఠంతో అంది రేణుక.

"అది నీ హృదయాన్ని అడగవలసిన
ప్రశ్న" రేణుక కళ్ళలోకి సూటిగా
చూస్తూ అన్నాడు విక్టర్.

రేణుక మాట్లాడలేదు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచి
పోయాయి.



నమ్మకం నాకుంది. పోతే నేను.. ఉదాత్త
చరితులయిన తల్లిదండ్రులకు పుట్టాను.
వాళ్ళ పెంపకంలో సుశిక్షితుడనయాను.
విషయలోలుడిని కాను. క్షణిక సుఖాలకు
ప్రాధాన్యతనివ్వక శాశ్వత సుఖం కోసం
అన్వేషణ సాగించే స్వభావం నాది.
స్త్రీలకే కాదు పురుషులకూ శీలం అత్యావ
సరం అని భావిస్తాను. జీవితాన్ని ఒక
పాఠంగా అధ్యయనం చేస్తున్నాను. ఎదుటి



మనిషిని లోపాలతో సహితంగా ప్రేమిం చడంలోనే మనిషి గొప్పదనం ఉందని నా అభిప్రాయం. ఇదంతా నేను స్తోత్ర్తగా చెప్పడంలేదు. అల్పమయిన విషయాలకు ప్రాధాన్యతనిచ్చి సంసారంలో కలతలు సృష్టించే దుర్బల మనస్కుడిని కాను అని చెప్పడానికే చెబుతున్నాను" రేణుక చేతివేళ్ళ అందం చూస్తూ అన్నాడు విక్టర్.

విస్ఫారిత నేత్రాలతో అతడి వంక చూడసాగింది రేణుక.

"ఏమ్...ఏమిటలా చూస్తున్నావ్?" ఆమె సంపంగి నాసిక పట్టి ఊపుతూ అన్నాడు విక్టర్.

రేణుక జవాబు చెప్పకుండా అతడి పయిపు నిర్నిమేషంగా చూడసాగింది.

హఠాత్తుగా ఏదో గుర్తొచ్చి "స్వీటీ! ఫ్రిజ్ లో స్వీటుంది పట్రా" అన్నాడు విక్టర్.

రేణుక కింద పడి ఉన్న చీర అందుకో బోయింది.

"చీర వద్దు" వారిస్తూ అన్నాడు విక్టర్.

రేణుక ప్రశ్నార్థకంగా చూసింది.

విక్టర్ లేచి మంచం కిందనుండి ఒక సూట్ కేసు బయటికి లాగాడు. సూట్ కేసు తెరచి అందులోంచి ఒక నైటీ తీసి ఆమెకిస్తూ, "కమాన్ డార్లింగ్! త్వరగా ధరించు చూడాలి" అన్నాడు.

రేణుక ఆసక్తిగా చూసింది.

కొద్దిగా పలుచగా ఉన్న బట్టతో కుట్టారు. మెత్తగా, మృదువుగా, అందంగా, ఫాషనబుల్‌గా ఉంది.

రేణుకకెంతో నచ్చింది. అందమయిన ఆ నైట్ గౌనులో ఆమె అందం ద్విగుణీకృతమయింది.

"మై ప్రెట్టీ డాల్ !"

ఆవేశంగా ఆమెను చేతుల్లోకి తీసుకుని ముద్దుల వర్షం కురిపించాడు విక్టర్. కాస్సేపు తర్వాత వెళ్ళి స్వీట్ తెచ్చింది రేణుక.

తను సగం తిని తక్కిన సగం ఆమెకు తినిపించాడు విక్టర్.

"మన దాంపత్య జీవితం ఇలాగే తియ్యగా, మధురంగా సాగిపోవాలి" అన్నాడు విక్టర్.

అతడి వయిపు అనురాగార్ద్ర నేత్రాలతో చూసింది రేణుక.

"సూట్‌కేసులో చీరలున్నాయి చూడు"

ఆశ్చర్యంగా సూట్‌కేసు తెరచి చూసింది రేణుక.

సూట్‌కేసునిండా చీరలు, నైటీలు, హవుస్‌కోట్లు, బ్రాలు...!

"ఇవన్నీ లండన్‌లో కొన్నావా?" సంభ్రమంగా అంది రేణుక.

"లండన్‌లో కొన్ని, పారిస్‌లో కొన్ని. చాలామటుకు మా చెల్లెలు సెలక్ట్ చేసినవే"

రేణుక చీరలు చూడసాగింది.

విదేశాల్లో తయారయిన చీరలు దాదాపు యాభయి చీరలు. ఇండియాలో కొంటే ఏ ఒక్కచీర అయిదువందలకు తక్కువ కాదు. లేతరంగుల్లో చక్కని డిజయిన్స్‌తో ఎంతో చక్కగా ఉన్నాయి చీరలు.

"చీరలు బాగున్నాయా? నీకు నచ్చాయా?" ఆతృతగా అడిగాడు విక్టర్.

రేణుక నవ్వింది.

"ఇందులో ఏదో ఒక చీరను మాత్రం ఎన్నిక చేసుకోమంటే తక్కిన చీరలు వదులుకోలేక నా ప్రాణాలు గిలగిల్లాడి పోయి ఉండేవి. ప్రతి చీర అంత బాగుంది. ఇంత మంచి చీరలు తెచ్చినందుకు థాంక్స్"

"ఊరికే నోటితో థాంక్స్ చెప్పేస్తే చాలదమ్మాయ్" చిలిపిగా అన్నాడు విక్టర్.

చప్పున అతడిని కావలించుకుని పెదవుల మీద గాఢంగా చుంబించింది రేణుక.

"పెదవుల్లో ఏందాచుకున్నావ్ మరీ అంత తియ్యగా ఉన్నాయ్" ఆమె పెదవులు మీద చూపుడు వేలుతో రాస్తూ అన్నాడు విక్టర్.

"నీ పట్ల నాకున్న అనురాగం!" ప్రేమగా అంది రేణుక.

"నిజంగా ఇప్పటికీ నా అదృష్టాన్ని నమ్మలేకపోతున్నాను. సౌందర్యాధి దేవతలాగున్న నువ్వు నాలో ఏం చూసి ఇంతగా ప్రేమిస్తున్నావు?"

"నువ్వు నాలో ఏం చూసావో నీలో నేనూ అదే చూసాను" నవ్వి అంది రేణుక.

టేబిల్ సొరుగులోంచి దంతంతో తయారుచేసిన నగల పెట్టె తీసాడు విక్టర్.

"నిన్న బాపాలాల్'లో కొన్నాను.... చూడు"

విస్ఫారిత నేత్రాలతో చూసింది రేణుక.

రవ్వలసెట్టు, కెంపులసెట్టు, పచ్చల సెట్టు, ముత్యాలసెట్టు, పగడాల సెట్టు

కాక దాదాపు యాభయి తులాల్లో మోడర్న్ డిజయిన్స్‌లో సాదా బంగారు నగలు...

"నీకు నిజంగా పిచ్చిపట్టింది"

"అవును..నీపిచ్చి పట్టింది" అన్నాడు విక్టర్.

అతడి మొహం రెండు చేతుల్లోకి తీసుకుని కళ్ళలోకి అనురాగంగా చూస్తూ – "నాకు నీ అనురాగం చాలు. బహుమానాలు, కానుకలు నేనాశించను" అంది ఆర్ద్రంగా.

"నువ్వాశించవు. ఆ సంగతి నాకు తెలుసు. కాని డాడీ ఆజ్ఞమేరకు ఈ నగలు కొన్నాను..."

"మీ డాడీ, మమ్మీ, ఇంట్లో తక్కిన అందరూ కులాసా?"

విక్టర్ నవ్వాడు. "ఇంత సేపటికి వాళ్ళ యోగక్షేమం అడగాలని తోచిందా?"

రేణుక మొహం ఎర్రబడింది.

"కులాసాగానే ఉన్నారు. బహుశా ఈ సంవత్సరం డాడీ ఇక్కడికి రావచ్చు"

మౌనంగా చూసింది రేణుక.

"డాడీ ఎందుకు వస్తున్నారో తెలుసా?"

"ఎందుకు వస్తున్నారు?"

నిన్ను చూట్టం కోసరమే వస్తున్నారు. నీ ఫొటో చూసి మా ఇంట్లో అందరూ ఎంతగా మురిసిపోయారో తెలుసా ? ముఖ్యంగా డాడీకి నువ్వు మరీ నచ్చావు. మెడికోవని తెలిసి ఆయనకు మరింత సంతోషం. పదే పదే నీగురించి వివరాలు అడుగుతూ ఉండేవాడు..."

"అంటే మీ ఇంట్లో నాకు ఘన స్వాగతం లభిస్తుందంటావ్?"

"నిస్సందేహంగా!"

"మీ ఫేమిలీ ఫొటో ఆల్బం ఉందా?"

బీర్వాలోంచి రెండు ఫొటో ఆల్బమ్స్ పట్టుకొచ్చాడు విక్టర్.

"ముందు వెళ్ళి తాగడానికేమయినా పట్రా. ఆకలేస్తోంది"

రేణుక కిచెన్‌కి వెళ్ళింది.

కాస్సేపు తర్వాత చేతిలో ట్రేతో తిరిగివచ్చింది. ట్రేలో కాఫీ కప్పులు, ముక్కలు చేసిన ఆపిల్‌పళ్ళు, ద్రాక్ష పళ్లు ఉన్నాయి.

పల్చని నైట్ గౌన్లోంచి స్పష్టా స్పష్టంగా కనిపిస్తున్న ఆమె అందాలను ఒళ్ళంతా కళ్లు చేసుకుని చూస్తున్నాడు విక్టర్.

అతడి ఒళ్ళో కూర్చుని కాఫీ కప్పు నోటికందించింది రేణుక.

ఇద్దరూ కాఫీ తాగాక, పళ్ళు తింటూ ఫొటో ఆల్బమ్ చూడసాగారు.

ఫొటోలు చూపిస్తూ తన తల్లిదండ్రులను గురించీ, తోబుట్టువులను గురించీ చెబుతున్నాడు విక్టర్.

రేణుక ఆసక్తిగా వింటున్నది.

రెండు ఆల్బమ్స్ పూర్తిగా చూసేటప్పటికి ఏడు గంటలయింది.

రేణుక లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంది.

ఆమె ఒళ్ళు విరుచుకునే అందం చూసి మతిపోయింది విక్టర్‌కి. ఆవేశంగా ఆమెను మంచం మీదికి తోసి మీద పడ్డాడు.

అరగంట తర్వాత స్నానం చేసి విక్టర్ తెచ్చిన చీరల్లో తనకు మరీ నచ్చిన తెల్ల ఫ్రెంచ్ షిఫాన్ చీర కట్టుకుంది.

"లవ్లీ!" పరవశంగా అన్నాడు విక్టర్.

అతడి వయిపు చూసి సమ్మోహ

నంగా నవ్వింది రేణుక. "లవ్లీగా ఉన్నది నేనా, చీరా?

"చీరలో నువ్వు!"

రేణుక డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరికి వెళ్ళింది.

టేబిల్ మీద ఓల్డ్‌స్పైస్ మెన్స్ టాల్కమ్ పౌడర్, క్రీమ్.... కేవలం మగాళ్ళకు సంబంధించిన టాయ్‌లెట్ సామగ్రి మాత్రమే ఉంది.

"ఈ పౌడర్ ఎలా వేసుకోను?" ఇబ్బందిగా చూస్తూ అంది రేణుక.

"సారీ, డార్లింగ్. రేపు నీక్కావలసిన పౌడరు అవీ తెచ్చుకుందాం. ఈపూటకు దాంతో సరిపెట్టుకో!" నవ్వి అన్నాడు విక్టర్.

మరో మార్గం లేక ఆ పౌడరే కొద్దిగా మొహానికి అద్దుకుని, "కుంకుమ?" అంది.

"బలేదానివి. నావద్ద కుంకుమ ఎందుకుంటుంది?" నవ్వి అన్నాడు విక్టర్.

"మరెలా? పెళ్ళయిన రోజు నుదుట కుంకుమ లేకుండా ఉండనా?" నొచ్చుకుంటూ అంది రేణుక.

"మా మతంలో అసలు కుంకుమ ప్రసక్తి ఉండదు"

చురుగ్గా చూసింది రేణుక. "నిన్ను పెళ్ళి చేసుకున్నాను కనక నేను మీ మతం స్వీకరించాలా? అదేనా నీ మాటల కర్థం?"

"నో...నో...నా అభిప్రాయం అది కాదు" కంగారుగా అన్నాడు విక్టర్. "పెళ్ళయిన రోజు నుదుట కుంకుమ లేకుండా ఎలా అని నువ్వు బాధపడుతుంటే చెప్పాను. నన్ను చేసుకున్నంత మాత్రాన నువ్వు మా మతం స్వీకరించాలని పట్టుబట్టేందుకు నేనంత సంకుచిత మనస్కుడిని కాను. నీకు పూర్తి మత స్వాతంత్ర్యం ఉంటుంది"

రేణుక నవ్వి అతడి పెదిమల మీద తేలిగ్గా ముద్దు పెట్టుకుంది.

"ఎందుకలా కంగారుపడ్తావ్. నీకంటే నాకు మతం...ఏదీ ముఖ్యం కాదు. అవసరమయితే నీకోసం నాదనుకుంటున్న ప్రతీది త్యాగం చేసేందుకు నేను సర్వసంసిద్ధురాలినే!"

"థాంక్యూ, డార్లింగ్!" అని ఆమెను హృదయంమీదికి లాక్కున్నాడు విక్టర్.

ఇద్దరూ బ్రెడ్, మటన్‌చాప్స్, ఫిష్ కట్లెట్స్‌తో భోంచేశారు.

"నేనిక వెళ్ళాలి. అమ్మ చూస్తూంటుంది" అంది రేణుక.

విక్టర్ ఆమెను గాఢంగా కౌగిలించుకున్నాడు "ఊహుఁ, నువ్వు వెళ్ళడానికి వీల్లేదు!"

అతడి తల నిమురుతూ, "అలా మారాం చేస్తే ఎలా డార్లింగ్? నేను మాత్రం నిన్ను విడిచి ఉండగలనా? కొన్నాళ్ళు ఓపిక పట్టాలి మరి!" అంది లాలనగా.

"పెళ్ళయినా మనకు ఎడబాటు తప్పదా?"

"నువ్వింత హడావుడిగా పెళ్ళి చేసుకుంటావని నేను కలగన్నానా?"

"నిన్ను వదిలి ఉండాలన్న ఊహే నన్ను ఛిద్రం చేసేస్తుంది. ఏం చేయను?" దిగులుగా అన్నాడు.

గోడ గడియారం ఎనిమిది గంటలు కొట్టింది.

"సారీ డార్లింగ్. నేను వెళ్లాలి!" అతడి కౌగిలినుండి విడివడుతూ అంది రేణుక.

"నేనూ వస్తాను"

"వద్దు. నేను బస్సులో వెళ్ళిపోతాను"

"రేపు గిండీ బస్‌స్టాప్ వద్ద ఎదురు చూస్తుంటాను" అన్నాడు విక్టర్.

"రేపు మాకు కాలేజీ ఉంది"

"మొదటిరోజు వెళ్ళకుంటే మరేం కొంప మునిగిపోదు" నిర్లక్ష్యంగా అన్నాడు విక్టర్.

"కాలేజికి వెళ్ళకుండా ఏం చేయాలి?"

"రేపంతా నువ్వు నాతోనే గడపాలి. మళ్ళీ నీకు వీలుపడదు"

ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయింది రేణుక.

"ఒక్కరోజు నాతో గడపాలంటే అంతగా ఆలోచించాలా? అంతేనన్న మాట నీకు నామీద ఉన్న ప్రేమ!" నిష్ఠూరంగా అన్నాడు.

గాయపడ్డట్లు చూసింది రేణుక.

"విక్టర్! నా ప్రేమను మాత్రం ఎన్నడూ శంకించకు. మనస్సు, ఆత్మ లను ఏకంచేసి నిన్ను ప్రేమిస్తున్నాను. నేను చచ్చిపోవచ్చును. కానీ నా ప్రేమ శాశ్వతంగా ఉంటుంది"

"రేణూ!"

ఆమెను హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు విక్టర్.

కాస్సేపు తర్వాత,

"అన్నట్లు రేపు మనం రిజిష్ట్రార్ ఆఫీసుకి వెళ్ళాలి."

"ఎందుకు?" ఆశ్చర్యంగా అంది రేణుక.

"ఎందుకేమిటి? ఈ నాలుగుగోడల మధ్య జరిగిపోయిన మన పెళ్ళిని చట్టబద్ధం చేసుకునేందుకు"

"నువ్వు మరీ తొందరపడుతున్నావు"

"లేదు. ఇప్పటికే చాలా ఆలస్యం చేశాను"

"చూడబోతే నువ్వు పెద్ద పథకం మీదే ఉన్నట్లున్నావు?"

"పథకాలు వేయకుంటే నీలాంటి అతి లోకసౌందర్యవతిని స్వంతం చేసుకోవడం సాధ్యమేనా?" నవ్వి అన్నాడు విక్టర్.

అతడి భుజంమీద చేతులువేసి కళ్ళ లోకి చూసింది రేణుక.

అతడి కళ్ళలోకిచూస్తే ఇహ చూపులు మళ్ళించుకోవడం ఆమెకు సాధ్యం కాదు.

అలాచూస్తూ తనను తాను మరచి పోయి ఎంతసేపయినా అలాగే ఉండి పోతుంది.

మళ్ళీ ఇద్దరిని ఏదో మైకం ఆవరించ సాగింది.

రేణుక తెప్పరిల్లి "ఓహ్, ఇలా గయితే నేనీరోజు వెళ్లినట్లే!" అని వెళ్ళిపో బోయింది.

"ఈ రాత్రిపూట నిన్నంత దూరం ఒంటరిగాపంపి నేను ఇంట్లో నిశ్చింతగా ఉండగలనా? ఉండు. నేనూ వస్తాను" అని డ్రెస్ చేసుకుని ఆమెవెంట బయలు దేరాడు విక్టర్.



మర్నాడు గిండీ బస్‌స్టాపువద్ద విక్టర్ని కలుసుకుంది రేణుక.

"హాయ్ స్వీటీ... గుడ్‌మార్నింగ్!" ఉత్సాహంగా గ్రీట్ చేసాడు విక్టర్.

"గుడ్‌మార్నింగ్"

అతడివెనక స్కూటర్ మీద కూర్చుంది రేణుక.

కొన్ని నిమిషాల తర్వాత స్కూటర్ యూనివర్సిటీ ముందాగింది.

ప్రశ్నార్థకంగా చూసింది రేణుక.

"కొంచెం పనుంది" అని యూనివర్సిటీ ఆఫీసుకేసి వెళ్లాడు విక్టర్.

అతడు వెళుతున్నవేపు అపేక్షగా చూస్తూ ఒకచెట్టుకింద కూర్చుంది రేణుక.

గంటన్నర తర్వాత వచ్చాడు విక్టర్.

"సారీ డార్లింగ్. లేటయింది."

"ఫర్వాలేదు" అని లేచి చీర దులుపుకుంది రేణుక.

రిజిస్ట్రారు ఆఫీసులో పని పూర్తిచేసుకుని స్టేట్ బేంక్ కి వెళ్ళారు. రేణుక వద్దంటున్నా వినక ఆమెపేర పాతిక వేలతో అకౌంట్ ఓపెన్ చేసాడు విక్టర్. అక్కడ పని పూర్తయి హోటల్లో భోంచేసి ఇంటికి చేరేటప్పటికి రెండు గంటలయింది.

ఫాన్ ఫుల్ స్పీడులో పెట్టి మంచంమీద వాలిపోయాడు విక్టర్.

రేణుక రెండుగ్లాసుల్లో నారింజరసం కలిపి తెచ్చింది.

విక్టర్ లేచి గ్లాసందుకుంటూ, "అందుకే ఇంట్లో ఇల్లాలు ఉండాలన్నారు. నాకు దాహంతో నాలిక పిడచకట్టుకుపోతున్నా వంటింటిలోకి వెళ్లి నీళ్లుతాగేందుకు బద్ధకం వేసి అలాగే పడుకున్నాను" అన్నాడు.

"ఈరోజు ఎండ మరీ నిప్పులు చెరుగుతున్నట్లుంది" అతడిపక్కనే కూర్చుని పళ్ళరసం సిప్ చేస్తూ అంది రేణుక.

గ్లాసు టేబిల్ మీద ఉంచి అలాగే వెనక్కి వాలి ఆమెను తనమీదికి లాక్కున్నాడు విక్టర్.

"ఇప్పుడు చెప్పు!" అన్నాడు విక్టర్.

"ఏమిటి?" అతడి కౌగిలిలోకి వెళ్ళిపోనిస్తూ అంది రేణుక.

"నువ్వు నాదగ్గరికి వచ్చే యత్నం ఉంటుందా? లేక పెళ్ళిచేసుకుని కూడా నేనిక్కడా, నువ్వు నీ పుట్టింట్లో విరహగీతాలు పాడుకుంటూ ఉండాలా?"

"నువ్వింత హడావుడిగా పెళ్ళి చేసుకుంటే నేనేం చేయను?"

"నేనొచ్చి మీ డాడీతో మాట్లాడనా?"

"అమ్మో! అంతపనిచేసేవు"

"మరెలా? నీకు దూరంగా నేనుండలేను. ఇరవైనాలుగ్గంటలూ నువ్వు నా కనుసన్నలలోనే ఉండాలనేగా నీ మెళ్లో పుస్తెకట్టి నాదాన్ని చేసుకున్నాను! అసలు మీ డాడీ అంటే నీకంత భయమెందుకు? మెడిసిన్ చదువుతున్నావు. నీ ఇష్టాయిష్టాలకు ఆమాత్రం విలువ ఇవ్వరా మీ డాడీ?"

"ఈ దేశంలో పెళ్ళిదగ్గరికొచ్చేటప్పటికి మెడిసిన్ చదివే అమ్మాయి కూడా అక్షరజ్ఞానం లేని అమ్మాయితో సమానమే. పెద్దలు చూసిన సంబంధం చేసుకోవలసిందే తప్ప జీవిత భాగస్వామిని స్వయంగా ఎన్నుకునే అదృష్టానికి నోచుకోలేరు. ఆమాటకొస్తే ఆ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మగాడికే లేవేమో! ఇక్కడ వధూవరుల ఇష్టాయిష్టాలకన్నా కులం, గోత్రం, జాతకం – వీటికే ప్రాధాన్యత హెచ్చు. ఆఫ్ కోర్స్! నేడు పెళ్ళిళ్ళలో ప్రముఖ పాత్ర వహిస్తున్నది వరకట్నం అనుకో..."

"ఇంతకీ మీ డాడీ ఒప్పుకోరంటావ్" ఆమె మాటల మధ్య అందుకుని కించిత్ విసుగ్గా అన్నాడు విక్టర్.

"ఊహుఁ. ఒప్పుకోరు!" ఖచ్చితంగా చెప్పేసింది.

'మీ డాడికి నువ్వంటే ఇష్టం లేదా?"

"మా డాడీకి నేను ఆరో ప్రాణం" గర్వంగా అంది రేణుక.

"మరి నీ సుఖసంతోషాల దృష్ట్యా నన్ను అల్లుడుగా అంగీకరించలేరా?"

"ఊహుఁ...అంగీకరించరు"

"అంత ఖచ్చితంగా చెప్పేస్తున్నావ్"

"డాడీ కులాంతర వివాహం ఇష్ట పడరని నాకు ఖచ్చితంగా తెలుసు"

"ఎలా?"

రేణుక సుందర వదనంలో నీలినీడలు పట్టంగా పరుచుకున్నాయి.

"పదేళ్ళక్రితం... అప్పుడు నేను స్కూలులో చదువుతుండేదాన్ని. మా పెద్దక్క శ్యామల ఎమ్.ఎస్సి. చదువు తుండేది. అక్క నాలాగే అందంగా ఉండేది. తనతోబాటు చదివే ఓ తమిళ యువకుడితో ప్రేమలో పడింది. ఇద్దరూ బీచ్‌లు, సినిమాలు, షికారులు అంటూ తిరిగేవారు. ఇంట్లో ఈ సంగతి తెలిసేటప్పటికి అక్కకు నెలతప్పింది. ఆరోజు చూసాను డాడీలోని మరోవ్యక్తిని. కోపం మనిషి యొక్క విచక్షణా జ్ఞానాన్నే కాదు మమతార్ద్రతలను కూడా చంపేస్తుందని ఆనాడే తెలిసింది. అక్క ఒంటిమీద డాడీ బెల్ట్ ఎంత కర్కశంగా నర్తించిందో గుర్తొస్తే ఇప్పటికీ ఒళ్ళు జలదరిస్తుంది. మామూలుగా ఎంతో సౌమ్యంగా, సరళంగా ఉండే డాడీ ఆరోజు ఆగ్రహావేశాలతో ధుమధుమ లాడుతుంటే ఇంట్లో ఉండబుద్ధి కాలేదు. 'నీకు నువ్వే మొగుణ్ని వెతుక్కునేంత జాణవయిపోయావా' అంటూ అక్కను శాపనార్థాలు పెడుతూనే వున్నారు. ఈ దేశంలో... కనీసం మా ఇంట్లో పుట్టిన ఆడపిల్లకు తన జీవిత భాగస్వామిని ఎన్నుకునే స్వేచ్ఛ లేదన్న నిజం ఆరోజే తెలుసుకున్నాను. అసలు డాడీది వింత మనస్తత్వం. తన మాటే వేదవాక్యంగా ఇంట్లో అందరూ శిరసావహించాలని డాడీ ఎప్పుడూ శాసించలేదు. ఇంట్లో ప్రతిపనీ తన ఇష్టప్రకారమే జరగాలనీ, ఇంట్లో అందరూ తన మనోభీష్టాను సారమే నడచుకోవాలనీ ఆయన నోరు తెరచి ఎన్నడూ చెప్పలేదు. అయితే డాడీ ఆశయం మాత్రం అదే! ఆయన ఇష్టానికి విరుద్ధంగా ఇంట్లో ఏదయినా జరిగితే ఆయనకెంత చిరాకో! ఇంట్లో చిన్నా పెద్దా అందరూ తన ఇష్టాయిష్టాలకే ప్రాధాన్యతనిస్తూ, తన మాటకే విలువ ఇస్తూ, తన పెద్దరికానికి గొడుగు పడుతూ విధేయులయి ఉన్నంతవరకు ఇల్లు స్వర్గసీమగా భాసిల్లుతుంది. ఆయ నకు జన్మించిన మేము ప్రపంచంలో తక్కిన అందరికన్నా అదృష్టవంతులమని మురిసిపోవడం జరుగుతుంది. తనమాట కెదురు చెప్పకుండా చెప్పినట్లు చేస్తే ఆయనకెంత సంతోషమో ఎదురు తిరిగితే అంత చిరాకు, కోపమూను. ఆయన ఇష్టానికి విరుద్ధంగా ఏదయినా జరిగిన రోజు ఇల్లు నరకమే అవుతుంది. అందుకే అమ్మతో సహా ఇంట్లో అందరూ డాడీ మాటే తమమాటగా,ఆయన ఇష్టాయిష్టాలే మాఇష్టాయిష్టాలుగా ఆయన కనుగుణంగా మమ్మల్ని, మా వ్యక్తిత్వాలను తీర్చి దిద్దుకున్నాము. ఉన్నతోద్యోగులయిన అన్నయ్యలు సైతం ఈనాటికీ డాడీ మాటకెదురు చెప్పరు. అలా అని డాడీ కర్కోటకుడని నువ్వపార్థం చేసుకునేవు! డాడీ మమ్మల్ని ప్రేమించేంతగా ప్రపంచంలో మరో తండ్రి తన బిడ్డలను ప్రేమిస్తాడంటే నా కనుమానమే!

ముఖ్యంగా డాడీకి నేనంటే ఎంత అపురూపమో చెప్పలేను..."

వరుడిచేత మూడు ముళ్లు వేయించుకోక తప్పదు. అలా ఇష్టంలేని పెళ్ళి చేసుకోలేనివారు ప్రాణత్యాగం చేసుకున్న సంఘటనలు కోకొల్లలు. మా శ్యామల



"అటువంటప్పుడు జీవిత ప్రధాన సమస్య అయిన వివాహ విషయంలో నీ ఇష్టం కాదంటారా?" ఆర్ద్రోక్తిలో అన్నాడు విక్టర్.

"అదే మా సమాజంలోని ప్రత్యేకత" విషాదంగా అంది రేణుక. "తక్కిన అన్ని విషయాలలో ఎంత స్వేచ్ఛ నిచ్చినప్పటికీ వివాహం విషయంలో స్త్రీల ఇష్టాయిష్టాలకు ఈషణ్మాత్రం విలువ ఉండదు. తల్లిదండ్రులు నిర్ణయించిన

అక్క కూడా అలాగే పోయింది" బాష్పరుద్ధ కంఠంతో అంది రేణుక.

"మీ అక్క పోయారా?" ఆందోళనగా అన్నాడు విక్టర్.

"అవును. అక్క మట్టిలో కలిసి పోయి పదేళ్ళయింది"

రేణుక కనులు అశ్రుతప్తాలయాయి.

"ఎలా?"

రేణుక కళ్ళు తుడుచుకుంది.

"అక్కను నెలతప్పిందని చెప్పానుకదా. మూడోకంటికి తెలియకుండా అబార్షన్ చేయించాలని ప్రయత్నించారు. అయితే

అప్పటికే నాలుగో నెల దాటింది. అబార్షన్‌కి ప్రయత్నిస్తే తల్లి ప్రాణాలకే ముప్పు అని డాక్టరు హెచ్చరించడంతో ఊరుకోవాల్సి వచ్చింది. పెళ్ళయిన కూతురికి నెలతప్పితే



ఇంట్లో అందరికీ సంతోషం. అయితే కన్నెపిల్లకు కడుపొస్తే అది వంశానికే అప్రతిష్ట. ఈ సమాజంయొక్క నీతి, న్యాయం అది! అక్క కడుపులో పెరుగుతున్న పాప భారాన్ని ఎలా దించుకోవడమా అని డాడీ, అమ్మ సతమతమవుతున్న తరుణంలో మా ఇంటికి గణపతి వచ్చాడు. గణపతి అమ్మకు దూరపు బంధువు. తమ్ముడి వరస. నా అన్నవాళ్ళు లేని అనాథ. తెలివితేటలు అంతంత మాత్రం. రూపంచూస్తే పరమ వికారి. ఏమి చదువుకున్నాడో ఏమిటో... ఏదో స్టూడియోలో పనిచేసేవాడు.

సమాజంయొక్క అట్టడుగు పొరల్లో నివసిస్తున్న అతడిలో అక్క సమస్యకు పరిష్కారం చూసారనుకుంటాను డాడీ. అక్క పెళ్ళి అతడితో నిశ్చయం చేసేసారు. అక్క ఏడ్చింది... మొత్తుకుంది. ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించింది. కాని డాడీ మనస్సు కరగలేదు. మరో కులానికి, సాంప్రదాయానికి చెందిన వ్యక్తిని ప్రేమించినందుకు శిక్షగా అక్క పక్కన నిలబడేందుకయినా యోగ్యత లేని గణపతితో ఆమె పెళ్ళి నిశ్చయం చేసారు. ఆ పెళ్ళి చేసుకోలేక, మరో దారి లేక అక్క ఒంటిమీద కిరోసిన్ పోసు

కుని కాల్చుకుచచ్చిపోయింది. ముట్టుకుంటే కందిపోతుందేమో అన్నంత సుకుమారంగా ఉండే అక్క, అతిలోక సౌందర్యవతి అయిన అక్క శరీరమంతా కాలిపోయి వికృతంగా, భయంకరంగా తయారయింది. రెండు రోజులు నరకయాతన అనుభవించి తన ప్రియుడితో కలిసి బతకే అవకాశం ఇవ్వని ఈ ప్రపంచానికి శాశ్వతంగా వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయింది" వెక్కిళ్ళమధ్య అంది రేణుక.

"రేణూ!"

ఆమెను మరింత దగ్గరికి లాక్కున్నాడు విక్టర్.

అతడి వక్షస్థలం ఆమె కన్నీళ్ళతో తడిసిపోయింది.

కొన్ని నిమిషాల తర్వాత రేణుక దుఃఖం ఉపశమించింది.

చల్లటి నీళ్ళతో మొహం కడుక్కుని మంచినీళ్ళు తాగివచ్చింది.

"నాకు దూరంగా ఉండాలని నువ్వెంతగా ఎందుకు ప్రయత్నించావో నాకిప్పుడర్థమవుతున్నది" ఆర్ద్రస్వరాన అన్నాడు విక్టర్.

"నిజం డార్లింగ్! నువ్వు గుర్తొచ్చిన ప్రతిసారీ అక్క గుర్తుకు వచ్చేది. ఈ సమాజంలో స్త్రీప్రేమిస్తేఫలితం దారుణంగా ఉంటుంది. నిండుజీవితం నాశనమవుతుంది. తియ్యటి తేనియలు కురియవలసిన జీవితంలో హాలాహలం వర్షిస్తుంది. సంతోషం మృగ్యమవుతుంది. మనశ్శాంతి కరవవుతుంది. జీవితాన్ని చీకటి చుట్టుముడుతుంది అని మా శ్యామలక్క హెచ్చరిస్తున్నట్లే అనిపించేది. ప్రేమ అన్న రెండక్షరాల మాటకు నా జీవితంలో చోటే ఇవ్వకూడదనుకున్నాను. అందుకే ఎందరినో కాదన్నాను. మగవాళ్ళను శత్రువుల్లాగే చూసాను. కాని నువ్వు ... నువ్వు నా జీవితగతినే మార్చేసావు. నా ఆలోచనా సరళినే మార్చావు.

నిన్ను గూర్చి ఆలోచించకూడదని ఎంతగా ప్రయత్నించానో ఆ భగవంతుడికే తెలియాలి. నువ్వేమో చూపులతో కవ్విస్తూ, రెచ్చగొడ్తూ నన్ను పిచ్చిదాన్ని చేసావు. నీ బానిసను చేసుకున్నావు. ఇప్పుడేమో తాళిగట్టి నీ వద్దకు వచ్చెయ్యడం తప్ప మరో మార్గం లేకుండా చేసావు"

"మరి వచ్చెయ్యరాదూ? ఆలశ్యం ఎందుకు?" ఆశగా అన్నాడు విక్టర్.

"వస్తాను. రాకుండా ఉండలేను. అయితే ఇప్పుడేరాను!"

"ఏం....ఎందుకని?"

"ఇప్పుడు నేను నీ వద్దకు వస్తే నాకొచ్చే పేరేమిటో తెలుసా?"

"ఏమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు విక్టర్.

"లేచిపోయిందన్న పేరు. అలా అప్రతిష్ట పాలవడంకన్నా నా దృష్టిలో చచ్చిపోవడం మేలు. విక్కీ...నేను నీ వద్దకు ఎప్పుడు వచ్చినా నా కన్నవాళ్ళ అనుమతి, ఆశీర్వాదాలు పొంది సగౌరవంగా వస్తాను. అంతేతప్ప వాళ్ళకు తెలీకుండా లేచొచ్చి వాళ్ళ మనస్సు నొప్పించి నన్ను నేను అగౌరవపరచుకోను. నువ్వు నా ప్రాణం. నా సర్వస్వం. నా సుఖం, సంతోషం నువ్వే! నువ్వు లేకుండా నేనుండలేను. నువ్వు నాకు కావాలి. అలా అని నా వాళ్ళకు దూరంకాలేను. నీతో అనుబంధం శాశ్వతం చేసుకునే ప్రయత్నంలో నా వాళ్ళతో అనుబంధం తెంచుకోలేను. నన్ను కని అల్లారుముద్దుగా పెంచి ఇంత దాన్ని చేసిన తల్లిదండ్రుల గుండెల్లో చిచ్చు రగిలించలేను. వాళ్ళను ఎలా

గయినా ఒప్పించి సగౌరవంగా, బహిరంగంగా నీ వద్దకు వస్తాను. అది నా ఆకాంక్ష. మా ఇంట్లో బావ అల్లుడుగా ఎటువంటి మర్యాదలు పొందుతారో నువ్వూ ఆ ఇంటి అల్లుడిగా అంతే మర్యాదలు పొందాలి. అది నా కోరిక. ఈ నా కోరిక నెరవేరేందుకు కొన్నాళ్ళు పట్టవచ్చు. అంతవరకు మనం ఓపికపట్టాలి. తప్పదు" అంది రేణుక దృఢనిశ్చయ కంఠంతో.

ఆమెను ముద్దుపెట్టుకున్నాడు విక్టర్. "అందుకే నువ్వంటే నాకిష్టం!"

* * *

రిజిష్ట్రార్ ఆఫీసులో పెళ్ళితంతు పూర్తిచేసుకుని రేణుక, విక్టర్ స్నేహితులతో బాటు అపుడే ఇంటికి వచ్చారు. హోటల్‌నుండి రప్పించిన విందుభోజనం టేబిల్ మీద రెడీగా ఉంది. అందరూ డైనింగ్ టేబిల్ చుట్టూ సర్దుకు కూర్చున్నారు.

విక్టర్ స్నేహితులు ఆరుగురు.

రేణుక స్నేహితులు ఇద్దరు ..విద్య, మహాదేవన్.

యవ్వనం ఉరకలువేస్తున్న పదిమంది ఒక్కచోట చేరితే సందడికేం తక్కువ?

నవ్వులతో, కేరింతలతో ఇల్లు దద్దరిల్లిపోతున్నది.

మధ్యమధ్య నూతన దంపతులకు [illegible] పట్టిస్తున్నారు.

తెల్లచీర, [illegible], రవ్వల సెట్టు.

రేణుక మెరుపు తీగలా మెరిసిపోతున్నది.

విక్టర్ స్నేహితులయితే ఆమె మీద నుండి దృష్టి మళ్ళించుకోలేకపోతున్నారు.

"ఇక్కడే ఉన్నా. మా కంటికి కనిపించలేని అందాల దేవత. ఎక్కడ నుంచో వచ్చిన నువ్వు ఎగరేసుకుపోతున్నావు. అదృష్టవంతుడివి" అని స్నేహితుడిని అభినందనలతో ముంచెత్తారు. వాళ్ళ మాటల్లో ఈర్ష్యాసూయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

భార్య వంక గర్వంతో మెరుస్తున్న కళ్ళతో చూసాడు విక్టర్.

అప్పుడే అతడివయిపు చూసినరేణుక స్నిగ్ధదరహాసం చేసింది.

భోజనాలయాక అందరూ మరోసారి కొత్త దంపతులకు అభినందనలు తెలిపి వెళ్ళిపోయారు.

విద్య ఆఖరున వెళ్ళింది.

ఆమెను సాగనంపేందుకు గేటుదాకా వెళ్ళిన రేణుక "విద్యా! నాకో సాయం చేస్తావా?" అంది చిన్నగా.

"ఏమిటి?"

రేణుక మొహం కెంపుదాల్చింది.

"తను....రాత్రికి ఇక్కడే ఉండమని గొడవ చేస్తున్నాడు"

"లేకుంటే పెళ్ళయిన రోజు రాత్రి అతడితో గడపక డిస్సాపాయింట్ చేస్తావా?" ఆశ్చర్యంగా అంది విద్య.

"అందుకే.... ఈరోజు రాత్రి మీ ఇంట్లో పడుకుంటానని మా ఇంటికి ఫోన్ చేసి చెప్తావా?"

"ఇలా అబద్ధాలు చెప్పి ఎన్నాళ్ల గడుపుతావ్?"

"అబద్ధమా?''

"లేకుంటే నువ్వీరాత్రి మా ఇంట్లో పడుకోవడం నిజమా?"

విద్యకేసి మౌనంగా చూసింది రేణుక.

"తరచుగా నువ్వు మా ఇంట్లో పడుకోవడం, నేను మీ ఇంట్లో పడుకోవడం చిన్నప్పటినుండి మనకలవాటే. అది

ఆధారంగా ఇప్పుడు నువ్వు నీ తల్లి దండ్రులను మోసం చేయాలని చూస్తావా?"

"విద్యా!"

"మంచో చెడో నువ్వు విక్టర్ని పెళ్ళి చేసుకున్నావు. ఇక అతడితో జీవించడమే ధర్మం. అలాకాక పెళ్ళి విషయం దాచిపెట్టి తల్లిదండ్రులతోనే మామూలుగా ఉండాలనుకోవడం..ఉహు, నాకు నచ్చలేదు. పైగా అతడిని రోజూ కలుసుకోవడం, కాపరం చెయ్యడం... నీ మీద పూర్తి విశ్వాసం ఉంచిన తల్లి దండ్రులను మోసం చెయ్యడమే అవుతుంది. ఆలోచించు. పైగా నువ్వు మీ ఇంట్లోనే ఉండాలని పంతం పట్టడం విక్టర్కి కోపం తెప్పిస్తుందేమో. ఇప్పుడూరుకున్నా పోను పోను గొడవ చేయడూ?"

"పుస్తకాలు అవీ తెచ్చుకుని ఇక్కడే ఉండిపొమ్మని ఇప్పుడే సతాయిస్తున్నాడు. అతడికి నచ్చజెప్పలేక నాతల ప్రాణం తోక కొస్తున్నది. కాని డాడీ..."

"నిజమే. నువ్వు అన్యమతస్తుడిని, పైగా విదేశీయుడిని పెళ్ళి చేసుకొన్నావని తెలిస్తే అంకుల్ మండి పడవచ్చు. నీతో తెగతెంపులు చేసుకోవచ్చు. అయితే నిజం ఎన్నాళ్ళు దాచిపెడతావ్? నేడు కాకుంటే, రేపు, రేపు కాకుంటే ఎల్లుండి ఎప్పుడో ఒకప్పుడు అసలు సంగతి తెలుస్తుంది. అప్పుడేం చేస్తావు? అందుకే నేను చెప్పడం, ఈరోజే విక్టర్ని పిలుచుకు వెళ్ళి పరిచయం చెయ్యి. ఆదరిస్తే అదృష్టవంతురాలివి. లేకుంటే నీకు తోడు నీడగా చివరిదాకా ఈ జీవిత పథంలో నీతోబాటు పయనించే భర్తలోనే తల్లి, దండ్రులను, తోబుట్టువులను చూసుకుంటూ ఆదర్శ ప్రేమికురాలిగా ఖ్యాతి గడించు"

"విద్యా! నీకు హేళనగా ఉందా?" బాధగా అంది రేణుక.

"లేదు ఈ పరిస్థితుల్లో నీకు ధైర్యం, తెగింపు ఉండాలంటున్నాను"

కనీ, పెంచి ఇంతదాన్ని చేసిన వాళ్ళ "కన్న గుండె గాయం చేసే ధైర్యం నాకీ జన్మకు రాదు"

"అయితే ఏం చేస్తావు? పోనీ నేను వెళ్ళి చెప్పనా?"

"వద్దు, వద్దు నెమ్మదిగా నేనే చెప్పేస్తాను" కంగారుగా అంది రేణుక.

"ప్రస్తుతం నీ కార్యక్రమం ఏమిటి"?

రేణుక నవ్వి "ఏముంది ఈరోజంతా ఇక్కడే గడపడం. రేపట్నుంచి మామూలుగా మా ఇంట్లోనే ఉండడం" అంది.

"అలా ఎన్నాళ్ళు?"

"చూద్దాం. ఈ సమస్యకు కాలమే ఏదో పరిష్కారం చూపాలి. ఆలోగా డాడీ మనస్సు నొప్పించడం నాకిష్టం లేదు"

పక్కనే ఉన్న గులాబి మొక్కనుండి ఒక పువ్వు తుంచి స్నేహితురాలి జడలో పెడ్తూ అంది రేణుక.

"నీ ఇష్టం?" అని వెళ్ళిపోయింది విద్య.

తలుపుమూసి గడియపెట్టి వచ్చింది రేణుక.

ఆమెను ఆత్రంగా చేతుల్లోకి తీసుకున్నాడు విక్టర్. "నీకోసం నేను క్షణాలు యుగాలుగా ఎదురుచూస్తుంటే నీ ఫ్రెండుని సాగనంపిరావడం ఇంత సేపా?"

"అనుక్షణం నీ సమక్షంలోనే

ఉండాలా?"

"అవును. నువ్వు కనుమరుగయితే నాకు జీవితమే చీకటవుతుంది" అంటూ ఆమెను ఆక్రమించుకోసాగాడు విక్టర్.

కాలపురుషుడు ప్రణయరాగాన్ని తియ్యగా ఆలాపనచేస్తూ నింపాదిగా సాగిపోతున్నాడు.

చాలా సేపు తర్వాత, "హనీ!" లాలనగా పిలిచాడు విక్టర్.

"ఊఁ"

"రాత్రికి ఇక్కడే....''

"ఉంటాను" అని విక్టర్ మాటలు పూర్తిచేసేసింది రేణుక.

"థాంక్యూ డార్లింగ్" అని ముద్దుపెట్టుకున్నాడు విక్టర్. అంతలోనే నిట్టూర్చి "నీ కౌగిలిలో నిద్రపోయి, నీ కౌగిలిలో నిద్రలేవాలన్న నా కోరిక ఎప్పుడు నెరవేరుతుందో!" అన్నాడు.

రేణుక నవ్వి, "ఈరోజు నెరవేరుతుంది. దిగులుపడకు" అంది.

"ఈ ఒక్కరోజేనా? అందుకేనా నిన్ను పెళ్ళిచేసుకుంది?" కోపంగా అన్నాడు విక్టర్.

"కొన్నాళ్ళు ఓపిక పట్టు డియర్'' అతడి తల నిమురుతూ లాలనగా అంది రేణుక.

"అసలు మీ డాడీ ఒప్పుకోరేమోనన్న అనుమానం ఉండనే ఉంది"

రేణుక మాటలాడలేదు.

''మీ డాడీతో నేను మాట్లాడనా?"

భయంగా చూసింది రేణుక. "మైగాడ్...వద్దు!"

"మరెలా?"

"కొన్నాళ్ళు ఓపికపట్టు" మళ్ళీ అంది రేణుక.

"ఎన్నాళ్ళు?"

రేణుక నిస్సహాయంగా చూసింది.

"నీ వరస నాకసలు నచ్చలేదు. మీ డాడీ ఒప్పుకోరని తెలిసీ అనవసరంగా ఇంకొన్నాళ్ళు ఎందుకు వేచిఉండాలి? మన పెళ్ళిసంగతి ఎప్పుడు తెలిసినా మండిపడతారు. అటువంటప్పుడు ఆ జరిగే గొడవేదో ఈరోజే జరిగిపోనీ. పద, మీ ఇంటికి వెళదాం"

"విక్కీ, ప్లీజ్!"

''అసలు నేనంటే నీకిష్టంలేదు. అందుకే ఇలా కుంటిసాకులు చెబుతున్నావు" నిష్ఠూరంగా అన్నాడు విక్టర్.

''నువ్వంటే నాకిష్టం లేకుంటే నా నీడనయినా సమీపించి ఉండలేవుతెలుసా?"

"మరెందుకలా సతాయిస్తున్నావు?'' విసుగ్గా అన్నాడు విక్టర్.

అతడి ఛాతీమీద తల పెట్టుకుని పడుకుంది రేణుక.

''చెప్పాను కద. డాడీ మనస్సు గాయపడకుండా నెమ్మదిగా ఆయనకు నచ్చజెప్పి ఆయన చల్లని దీవెనలు పొందాకే నీవద్దకు వస్తాను.

ఆమెకు తండ్రిమీద ఉన్న ప్రేమానురాగాలు విక్టర్ని ముగ్ధుడ్ని చేశాయి.

"అది జరిగే పనేనా?" శాంతంగా అన్నాడు.

"నేనేదో మార్గం ఆలోచిస్తాను"

''అంతవరకు నేను బతికేదెలా? రేణూ డార్లింగ్....నీకు దూరంగా ఉండలేకపోతున్నాను. నువ్వు వెళ్ళిపోతే శరీరాన్ని రంపంతో నిలువునా కోస్తున్నంత బాధగా ఉంటుంది"

''నీకు దూరంగా వెళ్ళాలంటే నాకంత కన్న బాధగానే ఉంటుంది.'' మళ్ళీ నీ కౌగిలిలో వాలిపోయేంత వరకు నేననుభవించే వ్యధ చెప్పడానికి మాటలుచాలవు.

నీ గుండెలమీద పడుకుంటేనే నాకు శాంతి. ఈ శాంతిని, సుఖాన్ని, సంతోషాన్ని దూరం చేసుకుని బతగ్గలనా? కాని కొన్నాళ్లు ఈ వియోగబాధను సహించక తప్పదు."

"నీ ఇష్టం ఎలాగో అలాగే కానీ'' అంటూ ఆమెను మరింతగా తనలోకి లాక్కున్నాడు.

మరికొన్ని రోజులు కాలగర్భంలో కలిసిపోయాయి.

ప్రతిరోజు సాయంత్రం విక్టర్ హాస్పిటల్ వద్ద భార్యకోసం ఎదురుచూట్టం, ఆమె రాగానే ఇద్దరూకలిసి హోటల్లో కాఫీలాగి ఇంటికి వెళ్లిపోవ్వడం, అక్కడ కాస్సేపు గడిపాక రేణుకను గిండీ బస్ స్టాపువద్ద డ్రాప్‌చేసి వెళ్లిపోవడం-మొత్తానికి వాళ్ళ వైవాహిక జీవితం సాఫీగానే సాగిపోతున్నది.

* * *

.. ఆ రోజు రేణుక హాస్పిటల్‌నుండి బయటికి వచ్చేటప్పటికి బాగా ఆలస్యమయింది. క్షణంక్షణం చేతిగడియారంలో టైం చూసుకుంటూ అసహనంగా నిరీక్షిస్తున్నాడు విక్టర్. ''ఏమిటింత ఆలస్యం?'' భార్యకు ఎదురువెళ్తూ అన్నాడు.

అలసటగా నవ్వి, "ఈరోజు పని కాస్త ఎక్కువయింది'' అంది రేణుక.

ఇద్దరూవెళ్లి హోటల్లో కూర్చున్నారు.

''చాలా ఆకలిగా ఉంది''

"భోంచేస్తావా?"

"ఊం."

డిన్నర్‌కి ఆర్డరిచ్చి భార్య ముఖం లోకి చూసాడు.

అలసటగా, వాడిపోయి ఎలాగో ఉంది.

ఆక్షణం ఆమెను హృదయం మీదికి చేర్చుకుని సేదతీర్చాలన్న కోరిక సతికష్టంమీద అణచుకుంటూ, "మొహం చూడు ఎలా వాడిపోయిందో. పిట్ట తిండి తింటూ ఇరవయినాలుగ్గంటలూ చదువు, హాస్పిటల్ అంటూ తెగ హైరానా పడిపోతావు. పువ్వులా, పదిలంగా ఇంట్లో ఉండవలసిన నువ్విలా హాస్పిటల్ చాకిరితో నలిగిపోవడం నేను చూడలేకున్నాను" విసుగ్గా అన్నాడు విక్టర్.

రేణుక చిన్నగానవ్వి, "నీ పనులతో నువ్వలసిపోవూ? నేనూ అంతే! అయినా చెప్పాను కద! అయిదు నిమిషాలపాటు నీ గుండెలమీద విశ్రాంతి తీసుకుంటే చాలు-రోజంతాపడ్డ శ్రమ ఇట్టే మరచిపోతాను" అని వెళ్ళి మొహం కడుక్కొని వచ్చింది. నాప్‌కిన్‌తో మొహం తుడుచుకుని తేలిగ్గా పౌడరు అద్దుకుని కుంకుమ దిద్దుకుంది. ఆమె వయిపు నిర్నిమేషంగా చూస్తున్నాడు విక్టర్.

ఇద్దరూ పెళ్ళి చేసుకుని దాదాపు అయిదు నెలలయింది. విక్టర్‌కి భార్య అంటే వెయ్యింతలు అనురాగం ఎక్కువయిందే తప్ప ఈషణ్మాత్రం తగ్గలేదు. అందుక్కారణం కేవలం ఆమె అందం మాత్రమే కాదు- శరీర సౌందర్యాన్ని మించిన ఆమె తెలివితేటలు, సంస్కారం, సౌమ్యత, సహనసౌశీల్యం, అనురాగ పూర్ణ హృదయం, నిరాడంబరత, సేవా తత్పరతలే. ఈ ఆణిముత్యాన్ని తన జీవన సహచరిగా ఎన్నుకుని తనకు తానెంతో మేలు చేసుకున్నానని విక్టర్ మురిసిపోని క్షణం లేదు.

"ఏయ్... ఏమిటలా చూస్తున్నావ్?" అంది రేణుక.

విక్టర్ దృష్టి ఆమె నుదుట ధగధగ మెరిసిపోతున్న కుంకుమమీద నిలిచింది.

"స్త్రీ వదనానికి కుంకుమ ఎంత

శోభస్కరంగా ఉంటుందో నిజంగా నిన్ను చూసాకే నాకర్థమయింది"

డిన్నరు వచ్చింది.

భోజనం మధ్యలో-

"రెండు రోజులు నేను నీతోబాటే ఉంటాను" అంది రేణుక.

ప్రశ్నార్థకంగా చూసాడు విక్టర్.

"అమ్మ, డాడీ ఊరెళ్ళారు"

విక్టర్ మొహంలోకి సంతోషం వరదలా వచ్చేసింది. "హాయ్... మై గుడ్ ఫార్చ్యూన్!"

"ఇదిగో...ముందే చెప్తున్నాను. నాకు చదువుకునేందుకు బోలెడుంది. నువ్వల్లరి చేయకుండా చదువుకోనిస్తేనే నీతోబాటు ఇంటికి వస్తాను. లేకుంటే విద్య వాళ్ళింటికి వెళ్ళిపోతాను" బెదిరిస్తున్నట్లు అంది రేణుక.

"ఊహుం. నేనల్లరి చేయనుగా!"

అతడు చెప్పినతీరు చూసి నవ్వు వచ్చేసింది రేణుకకు. "యూ నాటీ!"

ఇంటికి వెళ్ళగానే పుస్తకాలు తీసుకుని ముందు గదిలోకి వెళ్ళిపోయింది రేణుక.

చదవడం ప్రారంభిస్తే కాలజ్ఞానమే మరచిపోతుంది రేణుక.

క్షణాలు, నిమిషాలు, గంటలు నిశ్శబ్దంగా గడిచిపోతున్నాయి.

"రేణూ!"

ఉలిక్కిపడి చూసింది రేణుక.

ఎదురుగా విక్టర్ని చూసి, "సారీ డార్లింగ్. నువ్వు ఎదురు చూస్తుంటావన్న సంగతే మరచిపోయాను" అని లేచి అతడి మెడచుట్టూ చేతులు వేసింది.

చిన్నబిడ్డను ఎత్తుకున్నట్లు ఎత్తుకు వెళ్ళి మంచం మీద దించాడు విక్టర్.

అప్పుడే గోడగడియారం రెండు గంటలు కొట్టింది.

పొద్దున రేణుక లేచేటప్పటికి బాగా పొద్దెక్కింది.

తనను చేతులు, కాళ్ళతో చుట్టేసి పడుకుని ఉన్న భర్తను ఆపేక్షగా చూసింది. నొసట చుంబించి అతడికి నిద్రాభంగం కాకుండా నెమ్మదిగా లేచింది

అప్పటికే పాలు తెచ్చి కాచాడు నౌఖరు జాన్.

రేణుకను చూసి కాఫీకి నీళ్ళు పెట్టాడు.

స్నానం చేసి కుంకుమ రంగు పాలియెస్టర్ చీర కట్టుకుంది. తల దువ్వుకుంటుండగా జాన్ కాఫీ తెచ్చాడు.

కాఫీ సిప్ చేస్తూ వెళ్ళి విక్టర్ని లేపింది.

ఆమెనలాగే మీదికి లాక్కున్నాడు విక్టర్.

"పొద్దున్నే ఏమిటీ సరసం. నాకు టైమయింది... వెళ్ళాలి. లేమరి!"

"ఈరోజు మానేద్దూ"

"అలాగే. ముందు తమరు లేవండి"

"నిజంగా మానేస్తావా?" ఆశగా అన్నాడు.

రేణుక సీరియస్‌గా చూసింది "విక్కీ! నేను నిన్ననే చెప్పాను. నువ్విలా అల్లరి చేస్తే నేను విద్యవాళ్ళ ఇంటికి వెళ్ళిపోతాను"

"బాబోయ్. ఆపని మాత్రం చేయకు" అని లేచి కూర్చున్నాడు.

రేణుక నవ్వుకుని "ముందు వెళ్ళి స్నానం చేసిరా" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది.

"జీ హుజూర్" అని విక్టర్ బాత్ రూంలో దూరాడు.

అతడు స్నానం చేసి వచ్చేలోగా

బ్రేక్‌ఫాస్ట్ సిద్ధంచేసింది రేణుక. ఇద్దరూ తిన్నారు.

"అన్నట్లు నువ్వు లంచ్‌కి ఏం తీసుకుంటున్నావు?" నాప్‌కిన్‌కి చేతులు తుడుచుకుంటూ అడిగాడు విక్టర్.

''రోజులాగే సాండ్‌విచెస్'' అని గోడ గడియారంలో టైం చూసి "బాబోయ్ ... సెవెన్ ట్వెంటీ! ప్లీజ్ విక్కూ! త్వరగా బయలుదేరు" అంది



రేణుక.

విక్టర్ డ్రెస్ చేసుకుని తల దువ్వుకుంటుండగా—

"నేను దువ్వనా?" అంది రేణుక.

జవాబుగా ఆమె చేతికి దువ్వెన ఇచ్చి చెయిర్‌లో కూర్చున్నాడు విక్టర్.

"అబ్బ... నీలాగే నీ వెంట్రుకలకు పొగరెక్కువ. ఎంతసేపు దువ్వినా అణగవు"

"ఏయ్! నాకు పొగరెక్కువా?"

"లేకుంటే ఆరోజు...బస్సులో అలా అల్లరి చేస్తావా?"

"ఏరోజు?" అమాయకంగా అడిగాడు విక్టర్.

"జనవరి ఫస్టునాడు"

విక్టర్ నవ్వేశాడు "నీకింకా గుర్తుందా?"

"నీకు తెలీదేమో నాకు జ్ఞాపకశక్తి మరీ ఎక్కువ. అవునూ..ఎప్పుడూ నన్ను పలకరించేందుకయినా ప్రయత్నించలేదు. దూరంగా నిలబడి మూగగా చూస్తూ ఊరుకునేవాడివి. ఆ రోజు ఎందుకలా అల్లరిచేసావు?" చిన్నగా నవ్వి అంది రేణుక.

"ఆరోజు ఆ చీరలో మరీ సమ్మోహనంగా ఉన్నావు. నిజంగా నాకు మతి పోయింది. ఎత్తుకుని ఎక్కడికయినా పారిపోవాలని వెర్రి ఆవేశం కలిగించింది"

"పారిపోలేకపోయావా?"

"నువ్వుకాదని ఉంటే ఆపనే చేసి ఉండేవాడినేమో"





తలెత్తి అతడి పరుపు చూసింది రేణుక.

ఆమె కళ్ళలో అనురాగం, ఆరాధన!

"విక్కీ! స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ అసలెందుకేర్పడుతుంది?"

"మనిషికర్థంకాని సృష్టి రహస్యాల్లో అదొకటి" అని లేచి రేణుకను చేతుల్లోకి తీసుకుని పెదవుల మీద గాఢంగా చుంబించాడు విక్టర్.

ఇల్లు లాక్ చేసి బయటపడ్డారు.

"సాయంత్రం డిన్నర్‌కి హోటల్ బ్లూమూన్ వెడదాం" దోవలో అన్నాడు విక్టర్.

"ఏం...ఈరోజు అక్కడ కాబరే ఉందా?"

"అవును. బొంబాయిలో లీడింగ్ కాబరే డాన్సర్ మిస్ జూలీ ప్రోగ్రాం ఉంది" ఉత్సాహంగా అన్నాడు విక్టర్.

ఒక్కక్షణం మౌనంగా ఉండి — "సారీ...నేనురాను" అంది రేణుక.

"హనీ?"

"మనిషిలో పశు ప్రవృత్తిని రెచ్చగొట్టే ఈ కాబరే డాన్సుల్లాంటివి చూసి ఆనందించే సంస్కారం నాకులేదు. అలాంటి స్త్రీలంటే నాకెంత అసహ్యమో నీకు తెలీదు. నిన్ను చిన్నబుచ్చడం ఇష్టంలేక ఇన్నాళ్ళూ వచ్చాను. ముళ్ళ మీద ఉన్నట్లే ఉన్నాను. ఇకనుండి అటువంటి నీతిబాహ్యమయిన స్థలాలకు నేను రాను. నీకిష్టమయితే నువ్వు వెళ్ళు. నీ ఇష్టాలను, సరదాలను నేను శాసించను. దయ ఉంచి నన్ను మాత్రం పిలవకు'' నిష్కర్షగా చెప్పేసింది రేణుక.

"నా ప్రాణంలో ప్రాణమయిన నీకిష్టంలేని పని చేయను. నీకిష్టం లేని చోటుకి వెళ్ళను. నీ మనస్సుకి క్లేశం కలిగించేలా ప్రవర్తించను" ప్రమాణం చేస్తున్నట్లుగా అన్నాడు విక్టర్.

రేణుక కళ్ళలోకి అపూర్వమయిన కాంతి వచ్చింది.

భార్య తృప్తికోసం భర్త తన సరదాలు త్యాగంచేయడంకన్నా భార్యకు సంతోషం కలిగించే విషయం మరొకటుంటుందా?

"విక్కీ, డార్లింగ్!"

విక్టర్ వీపుమీద తల వాల్చి తృప్తిగా కళ్ళుమూసుకుంది.

* * *

"రేణూ !"

ద్రాక్షపళ్ళు తింటూ ఏదో పుస్తకం చదువుతున్న రేణుక పుస్తకం మించి తలెత్తి చూసింది "ఏమ్మా ?"

"పొద్దున్నే ద్రాక్షపళ్లు తింటున్నావు. ఆకలి లేదంటూ బొత్తిగా అన్నం తగ్గించేశావు. మందకొడిగా,పరధ్యానంగా ఉంటున్నావు. ఒంట్లో కులాసాగాలేదా?"

తల్లివైపు చూసింది రేణుక.

తన పెళ్ళి విషయం ఇన్నాళ్ళూ అందరినుండి దాచింది. తల్లిదండ్రులు సైతం కనిపెట్టలేకపోయారు. కాని ఇప్పుడు... ఇక దాచడం కష్టం. కనీసం అమ్మతోనయినా చెప్పెయ్యాలి.

"అమ్మా! నాకిప్పుడు మూడో నెల" నేల చూపులు చూస్తూ మెల్లిగా అంది.

తన అనుమానం నిజమేనని తెలిసేటప్పటికి వెన్నుపోటుతిన్న మనిషిలా అయింది విమలమ్మ. చాలా సేపు స్తబ్దంగా శిలావిగ్రహంలా ఉండిపోయింది.

పెళ్ళి కాకుండా కడుపు తెచ్చుకోవడం—

ఆనాడు శ్యామల.

ఈనాడు రేణుక.

ఛ..తన కడుపున ఇలాంటి పిల్లలు పుట్టారేం ?

లేక తన పెంపకంలో లోపమా?

లోకంలో ఎంతమంది ఆడపిల్లలు అందంగా లేరు ? ఎందరు కాలేజీలలో చదవడం లేదు ? అందరూ ఇలాగే ప్రేమాయణం కొనసాగిస్తున్నారా? పెళ్ళి కాకముందే కడుపు తెచ్చుకుంటున్నారా? తమ కర్మ మాత్రమే ఇలా కాలిపోతోందేమిటి? ఛీ, ఛీ. ఈ పిల్లలు తమను తలలు పైకెత్తుకు తిరగనిచ్చేలా లేరు. ఈనాటికి తనను చూస్తే పెద్దమ్మాయి ఆత్మహత్య సంగతి, ఆ ఆత్మహత్యకు దారితీసిన సంఘటనలు గుర్తుకు తెచ్చుకునే ప్రబుద్ధులున్నారు. ఇప్పుడిహ దీనికి నెలతప్పిన సంగతి బయటికి పొక్కితే ముందు తను ఆత్మహత్య చేసుకోవాలి.

తల్లి ఎంతసేపటికీ అలా మాట్లాడకుండా మౌనంగా ఉండిపోవడం చూసి

రేణుక భయపడుతూనే "అమ్మా!" అంది.

కోపంతో జ్వలిస్తున్న కళ్లతో చూసింది విమలమ్మ. "పాపిష్టిదానా! ఎంతపని చేశావు? బుద్ధిమంతురాలివని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఇచ్చినందుకు మంచి గుణపాఠమే నేర్పుతున్నావు. రేపు నలుగురి మొహం ఎలా చూట్టం? మీ డాడీకి తెలిస్తే ఏమవుతుంది?

"ఎవరు ఆ నీగ్రో పుత్రాడేనా?"

ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూసింది రేణుక. "అమ్మా! నువ్వు విక్టర్ని ఎరుగుదువా?"

శుష్కహాసం చేసింది విమలమ్మ. నువ్వు రోజూ సాయంత్రాలు ఆలస్యంగా ఎందుకు వస్తున్నావో నాకు తెలుసు. ఆదివారాలు సినిమాకుపోతున్నాననిచెప్పి నువ్వు ఎక్కడికివెళ్తున్నావో అదీతెలుసు. నిన్ను మందలించాలని ఎన్నోసార్లనుకున్నాను. కాని నువ్వు విద్యాధికురాలివి. విచక్షణా జ్ఞానం ఉన్నదానివి. శీలం విషయంలో నీకున్న నిర్దిష్టమయిన అభిప్రాయాలు నాకు తెలుసు. పైగా నాకన్న నీ మంచిచెడ్డలు నీకే బాగా తెలుసునన్న నమ్మకం ఉంది. అటువంటప్పుడు నిన్ను నేనేమని మందలించగలను? మన కులం, మతం కాని వ్యక్తికేసి నువ్వాకర్షింపబడ్డావని ఎప్పుడో గ్రహించాను. భయపడ్డాను. ఇప్పుడేమో అతడిని పెళ్ళి చేసుకున్నానని చల్లగా చెబ్తున్నావు"

రేణుక తల్లి గుండెల్లో మొహం దాచుకుంది. "అమ్మా! విక్టర్ నా ప్రాణం. నా జీవిత సర్వస్వం. అతడికి దూరమై నేను బతకలేనమ్మా. అతడు లేనినాడు నా జీవితానికర్థమేలేదు. విక్టర్‌కి నేనంతకన్న ఎక్కువ. నేనే ప్రాణంగా బతుకుతున్నాడు. ఒకరిని విడిచి ఒకరు బతకలేని మేము..అందుకే మీ అనుమతి కెదురుచూడకుండా పెళ్లి చేసుకుని మా మధ్య అనుబంధాన్ని శాశ్వతం చేసుకున్నాము"

"అతడికి దూరమై బతకలేనిదానివి అతడితో వెళ్ళిపోక ఇక్కడే ఎందుకు ఉన్నావ్?" ఆశ్చర్యంగా అడిగింది విమలమ్మ.

"నా జీవితం అతడితో పెనవేసుకుపోయింది కనక విక్టర్ని [illegible] చేసుకున్నాను.కాని మీకు తెలీకుండా దొడ్డిదారిన అతడినిచేరుకుని మీ మనస్సు నొప్పించడం నాకిష్టంలేదు. అందుకే ఇరవైనాలుగ్గంటలూ అతడి సమక్షంలోనే ఉండాలని మనస్సెంతగా కోరుకుంటున్నప్పటికీ ఇక్కడే ఉంటున్నాను. మన సమాజంలో తల్లిదండ్రులకు తెలీకుండా కూతురు పెళ్ళిచేసుకుంటే ఆ కుటుంబం ఎంత అప్రతిష్టపాలవుతుందో నాకు తెలుసు. అందుకే నేను విక్టర్ని పెళ్ళిచేసుకున్న విషయం ఇప్పటిదాకా రహస్యంగానే ఉంచాను. నా కారణంగా మీ కన్నహృదయాలు గాయపడ్డం నాకిష్టంలేదు. అందుకే విక్టర్ వద్దకు వెళ్ళేందుకు సాహసించలేకపోతున్నాను. పైగా లేచిపోయిందన్న అపప్రథ తలకు చుట్టుకునే ప్రమాదముంది. అలా అపఖ్యాతి పాలవడం నాకిష్టంలేదు. ఏనాటికయినా మిమ్మల్ని ఒప్పించి మీ చల్లని దీవెనలు పొందాకే నా ఇంటికి వెళ్లాలన్నది నా ఆకాంక్ష. విక్టర్ అల్లుడుగా ఈ ఇంట పొందవలసిన గౌరవ మర్యాదలు పొందాలి. అది నా జీవితాశయం. నా కోరిక నెరవేరేందుకు కొన్నాళ్లు పట్టవచ్చు. అంతవరకు ఓపిగ్గా కాచుకుని

ఉంటాను"

"నా తల్లీ!" రేణుక తలమీద ముద్దు పెట్టుకుంది విమలమ్మ. "కన్నవాళ్ళ మనస్సు నొప్పించకూడదని ప్రేమించి పెళ్ళి చేసుకున్న భర్తకు దూరంగా ఉంటున్నావా? స్వార్థం పెచ్చుపెరిగి పోయి కన్న తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా కడగండ్లపాల్జేసే స్వార్థపరులతో సమాజం నిండిపోతున్న ఈ కాలంలో నీలాటి కూతురికి జన్మనివ్వడం నిజంగా మా పూర్వజన్మ సుకృతం తల్లీ!"

"అమ్మా! నీకు కోపంలేదా?"

"ఎందుకమ్మా కోపం?"

"నేను చేపట్టిన వ్యక్తిది మన జాతి కాదు. మతంకాదు. ఆఖరికి దేశంకూడా వేరయింది..."

"జాతి, మతం, దేశం వేరయితేనేం! అతడికి నువ్వు నచ్చావు. నీకతను నచ్చాడు. పెళ్ళి చేసుకున్నారు. పెళ్ళయాక స్త్రీ పురుషులు ఒకరికొకరు తోడు నీడగా కష్టసుఖాలు పంచుకుంటూ జీవిత పర్యంతం కలసి జీవించడం మన సాంఘిక ధర్మం. నీ జీవితం ఆ అబ్బాయితో ముడివడింది. ఆ ముడి తెంచుకోమని ఇప్పుడు చెప్పడం భావ్యంకాదు. వివాహం దైవనిర్ణయం అంటారు. నీ పెళ్ళి అతడితో జరగాలని రాసిపెట్టి ఉంది కాబోలు.... జరిగిపోయింది. ఇక మీ అనుబంధాన్ని అంగీకరించి ఆశీర్వదించడం కన్న మాకు వేరే మార్గంలేదు. పైగా నువ్వతడి బిడ్డకు తల్లివి కాబోతున్నావు"

"నీ అంత సులభంగా డాడీ ఒప్పుకుంటారా?"

"ఏమో" సందిగ్ధంగా అంది విమలమ్మ. "అయినా నీ చర్యను నేనూ సమర్థించలేకపోతున్నాను. పెళ్ళిచేసుకునిపుట్టింట్లోనే ఉండిపోవాలనుకోవడం ఏమంత మంచిదికాదు. భార్య పక్కన లేకుంటే మగాడిబుద్ధి పెడదోవలుపట్టే ప్రమాదం ఉంది. పైగా నువ్వు రోజూ నీ భర్తను కలుసుకోవడం, అతడితోషికార్లు తిరగడం చూసినవాళ్ళేమనుకుంటారు. మీరు పెళ్ళి చేసుకున్న సంగతి ఎందరికి తెలుసు? నీ గురించి పదిమంది చెడుగా అనుకునేందుకు నువ్వే అవకాశం కల్పిస్తున్నావు. ఎంతో తెలివయినదానివి. ఈ విషయంలో ఇంత తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నావెందుకు? మా దీవెనలుపొంది సగౌరవంగా భర్త వద్దకు వెళ్ళాలనుకుంటున్న నీ ఉద్దేశం శ్లాఘనీయమయినదే. అయితే నువ్వు చెప్పందే నువ్వు పెళ్ళిచేసుకున్న విషయం మాకెలా తెలుస్తుంది? మీ డాడీ మీ అనుబంధం అంగీకరించడం, అంగీకరించకపోవడం అటుంచి అసలు విషయం ఆయనకు చెప్పే ప్రయత్నం చేయాలి కద..."

"శ్యామలక్క మరణం నా గుండెల్లో ఇంకా పచ్చిగానే ఉందమ్మా! అందుకే నేను పెళ్ళిచేసుకున్న విషయం డాడీతో చెప్పేందుకు సాహసించలేకపోతున్నాను" పిరికిగా అంది రేణుక.

"శ్యామలకు లేని చనువు మీ డాడీ వద్ద నీకుంది. పైగా అందర్లోకి నువ్వంటే ఆయనకు ఎక్కువ గారాబం. నువ్వు నెమ్మదిగా నచ్చచెప్పితే ఆయన ఒప్పుకోవచ్చుననే నాకనిపిస్తోంది. అయినా బండ ముక్కు, ఇంతలా పెదవులు, బిరుసు వెంట్రుకలు - అడవి మనిషిలాగున్న అతడిలో ఏంచూసి మనస్సుపారేసుకున్నావు?''

"ఏమోనమ్మా. అతడిని మొట్టమొదటి

సారి చూసినప్పుడు, జన్మజన్మల నా ప్రియబాంధవుడిని చూసినట్లనిపించింది. అతడిని చేరుకునేదాకా నేననుభవించిన అశాంతి, ఆరాటం, ఆవేదన మాటలతో చెప్పలేను. అమ్మా... విక్టర్‌కి దూరమయి నేను బతకలేను. అతడి నీడలోనే నేను శాంతిగా, సుఖంగా బతగ్గలను"

"ఆమాట మీ డాడీతో చెప్పు"

"అమ్మో, నాకు భయం!"

"సరే, ఆ విషయం తీరిగ్గా ఆలోచిద్దాం. ముందు నువ్వు చేయాల్సినపని ఒకటుంది"

"ఏమిటమ్మా!?"

"ఆ అబ్బాయిని ఈపూట భోజనానికి పిలువ్"

"అమ్మా!?"

"అతడు నీ భర్త అని తెలిసాక అతడిని గౌరవించి ఆదరించడం నా బాధ్యత. మీ డాడీ ఊళ్ళోలేరుగా. పిలువ్. రెండురోజులు ఇక్కడే గడిపి వెళ్తాడు"

రేణుక మనస్సు విహంగమై విహరించింది. నెమలిఅయి పురివిప్పి నాట్యం చేస్తోంది.

తన పుట్టింటిలో భర్త అల్లుడుగా గౌరవమర్యాదలు అందుకునే శుభసమయం ఆసన్నమయింది. తన కోరిక కొంతవరకు నెరవేరింది. డాడీ విక్టర్ని అల్లుడుగా అంగీకరిస్తే..ఓహ్... ప్రపంచంలోనే తన కన్న అదృష్టవంతురాలు మరొక్కరు ఉండరు!

మనస్సు దూదిపింజెలా తేలిపోతుంటే వెళ్ళి విక్టర్‌కి ఫోన్‌చేసింది.

అరగంట ఆరు యుగాలుగా గడిచాక విక్టర్ వచ్చాడు. అతడి కళ్ళలో అంతులేని ఆశ్చర్యం!

"రేణూ"

"ముందు నువ్వు లోపలికి రా!" అని అతడిని తన గదికి లాక్కెళ్ళింది రేణుక.

రెండుచేతులతో చుట్టేసి ముద్దులతో ముంచెత్తింది. కట్టుదప్పిన ఆవేశంతో అతణ్ని ఉక్కిరిబిక్కిరి చేసేసింది.

"ఇంట్లో ఎవరూలేరా?" రేణుకఆవేశం కొద్దిగా తగ్గాక చిన్నగా అడిగాడు విక్టర్.

"అమ్మ ఉంది" అతడి ఛాతీమీద మొహం దుద్దుకుంటూ అంది రేణుక.

"మీ అమ్మగారికి తెలుసా?"

"ఇంతక్రితమే చెప్పాను"

"ఏమన్నారు?" ఆదుర్దాగా అడిగాడు విక్టర్.

"నిన్ను అల్లుడుగా మనస్ఫూర్తిగా అంగీకరించింది. నిన్నీపూట భోజనానికి పిలవమని అమ్మే చెప్పింది. అమ్మ నా మనస్సునర్థం చేసుకుంది. కులం, మతం, తక్కిన సంప్రదాయాలకన్నా కన్నబిడ్డ సుఖసంతోషాలే ప్రధానమని గుర్తించింది కనక నీతో నా వివాహాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించింది"

"అయితే సగం విజయం లభించినట్టన్నమాట" సంతోషంగా అన్నాడు విక్టర్.

"ఆఁ..మిగిలిన సగం విజయం సాధించడం ఏమంత సులభం కాదు" అతడి క్రాపు చెరిపేస్తూ అంది రేణుక.

"మీ డాడీ లేరా?"

"ఊహుఁ....ఊరెళ్లారు."

"అందుకేనా ధైర్యంగా ఇంటికి పిలిచావు?" నవ్వి అన్నాడు విక్టర్.

"అసలు నిన్ను రమ్మన్నది ఒక తియ్యని కబురు చెప్పడానికి" ఊరిస్తున్నట్లు అంది రేణుక.

"ఏమిటదీ ?" ఆత్రంగా అడిగాడు.

"చెబితే ఏమిస్తావు?"

"నువ్వేంకోరితే అదిస్తాను. సస్పెన్స్‌తో నన్ను చంపక ముందు విషయమేమిటో చెప్పు" ఆరాటంగా అన్నాడు విక్టర్.

"నువ్వు...నువ్వు డాడీ కాబోతున్నావు" నునుసిగ్గుతో అంది రేణుక.

"నిజంగానా?" సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు విక్టర్.

"నిజమే డియర్! ఈసారి కాస్త ఉపేక్షించాను. ఫలితంగా మనం జీవితంలో తల్లిదండ్రులుగా ప్రమోషన్ పొందనున్నాము" అని నవ్వింది రేణుక.

"థాంక్ గాడ్! ఈ శుభవార్త వినడంకోసం నేనెంతగా ఎదురుచూస్తున్నానో తెలుసా?" అని ఆమెను ముద్దులతో ముంచెత్తాడు విక్టర్.

"బిడ్డలంటే నీకంత ఇష్టమా?" అతడిలోకి ఒదిగిపోతూ అంది రేణుక.

"భార్యాభర్తల మధ్య అనుబంధాన్ని పటిష్టంచేసే బిడ్డలను ఇష్టపడనివాళ్లుంటారా?"

"నాకు ఇప్పుడే మాతృత్వం పొందడం ఇష్టంలేదు" చిన్నగా అంది రేణుక.

"ఎందుకని?"

"పెళ్ళిచేసుకుని ఇప్పటికే చదువులో వెనకపడ్డాను. ఇక బిడ్డపుడితే చదువుకి స్వస్తి చెప్పవలసి వస్తుందేమో" దిగులుగా అంది రేణుక.

"పాపాయిని కనడం వరకు నీవంతు. తర్వాత పాప సంరక్షణ నేను చూసుకుంటాను. నువ్వు నిశ్చింతగా చదువుకో"

"ఏయ్... పాప అంటున్నావేమిటి? నాకు అచ్చం నీలాగే ఉండే బాబు కావాలి" గారాబంగా అంది రేణుక.

"ఉహుఁ.... నాకు నీలాగే అందంగా ఉండే పాప కావాలి" అంతకన్నా గారాబంగా అన్నాడు విక్టర్.

"నాకు బాబు కావాలంటుంటే"

"పోనీ ఇద్దర్నీ కనేయ్" రేణుక మాటలమధ్య అందుకుని చిలిపిగా అన్నాడు విక్టర్.

"నీకేం...పదిమందినికన్నా కాదనవు"

"నిజమే. ఇంటినిండా బిడ్డలుంటే కళకళ్ళాడుతూ చక్కగా ఉంటుంది" అని రేణుకను మరింతగా తనలోకి లాక్కున్నాడు.

కొన్ని నిమిషాలు తియ్యగా...మత్తుగా గడిచిపోయాయి!

"రేణూ!"

తల్లి పిలుపువిని ఉలిక్కిపడింది రేణుక.

"వస్తున్నానమ్మా" అని లేచి బట్టలు సవరించుకుంది.

రేణుక తలుపు తెరచి "రా అమ్మా" అంది.

విమలమ్మ లోపలికి వచ్చింది.

విక్టర్ మర్యాదగా లేచి నిలబడ్డాడు.

"విక్కీ...మీ అత్తగారు. అమ్మా... నీ అల్లుడు" అని చిలిపిగా పరిచయం చేసింది రేణుక.

"నమస్కారమండి!" స్వచ్ఛమైన తెలుగులో అన్నాడు విక్టర్.

విదేశీయుడయిన అతడి నోటంట తెలుగు విని ఆశ్చర్యచకిత అయింది విమలమ్మ.

"కూర్చో నాయనా!" ఆదరంగా అంది.

"మీరూ కూర్చోండి" సోఫాలో కూర్చుంటూ అన్నాడు విక్టర్.

అతడి చేతికి నిమ్మరసం ఇచ్చి ఓ కుర్చీలో కూర్చుంది విమలమ్మ.

"మీ అనుమతి లేకుండా మీ

అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను. నన్ను క్షమించండి" తల వంచుకుని అన్నాడు విక్టర్.

"మీకిద్దరికి ఇష్టమయింది. చేసుకున్నారు. చేసుకున్నందుకు జీవిత పర్యంతం ఈనాడు మీ మధ్య ఉన్న అనురాగానోన్యతలు చెక్కుచెదర కుండా జీవిస్తే మాకంతే చాలు" అల్లుడి వంక అపేక్షగా చూస్తూ అంది విమలమ్మ.

విక్టర్ రేణుక వంక చూశాడు.

ఆమె అతడికేసి ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నది. విక్టర్‌కి తెలుగు వచ్చునని ఆమె కల్లోనయినా ఊహించ లేదు. అతడు తెలుగులో మాట్లాడుతుంటే ఆమెకు పట్టరాని సంతోషంగా ఉంది.

విమలమ్మ విక్టర్ తల్లిదండ్రులను గురించి, అతడి తోబుట్టువులను గురించి వివరాలు అడిగింది.

విక్టర్ సవినమ్రతగా జవాబులిచ్చాడు.

కూతురు ప్రేమించి పెళ్లి చేసుకున్న ఆ నీగ్రో యువకుడంటే విమలమ్మకు సదభిప్రాయమే కలిగింది.

చూడచక్కగా ఉన్నాడు. అమ్మాయితో సమానంగా చదువుకుంటున్నాడు. ఆస్థి అంతస్థుంది. అన్నిటిని మించి కూతురుమీద కొండంత అనురాగం ఉంది. ఇతడి సాహచర్యంలో కూతురు సుఖపడుతుందన్న నమ్మకం ఏర్పడింది. జాతి, కులమత విచక్షణ పేరిట కూతురిని ఇతడి నుండి విడదియ్యాలనుకోవడం అనుచితమనిపించింది. ఎలాగయినా భర్తకు నచ్చజెప్పి రేణుతల్లిని సగౌరవంగా భర్త వద్దకు సాగనంపాలని స్థిర నిశ్చయానికి వచ్చిందామె.

అల్లుడితో మరి కాస్సేపు మాట్లాడి వెళిపోయింది విమలమ్మ.

తల్లి వెళ్ళాక విక్టర్ మెడ చేతులతో చుట్టేస్తూ "ఏయ్! నీకు తెలుగువచ్చునని చెప్పనేలేదు'' అంది రేణుక.

"నువ్వు అడగలేదు, నేను చెప్పలేదు" తెలుగులోనే జవాబిచ్చాడు విక్టర్.

"ఎప్పుడు నేర్చుకున్నావ్? నిజంగా చాలా చక్కగా మాట్లాడుతున్నావు" ప్రశంసగా అంది రేణుక.

"నీ మాతృభాష తెలుగు అని తెలిసినరోజే ఆ భాష నేర్చుకోవడం ప్రారంభించాను"

"ఏం, నా మాతృభాషమీద అంత మక్కువ ఏర్పడిందా?''

''నీకు సంబంధించిన ప్రతి విషయం పట్ల నాకు మక్కువ ఎక్కువగానే ఉంటుంది.''

మరోసారి ఆమె హృదయం నుండి వెల్లువలా ఉరుకుతూవచ్చిన అనురాగ వాహినిలో అతడు ఉక్కిరిబిక్కిరయాడు.

ఎంతోసేపు తర్వాత రేణుక విక్టర్ మొహాన్ని ఆప్యాయంగా స్పృశిస్తూ, "నిజంగా ప్రేమింపబడటం ఎంత మహత్తరమయిన అదృష్టం" అంది.

"నిజం. ప్రేమించడంకన్న ప్రేమింపబడటమే అదృష్టం. అందునా నీలాంటి అపురూప సౌందర్యవతిచేత ఆరాధింపబడటం ఎన్నోజన్మల పుణ్యఫలమేతప్ప మరొకటి కాదు''

అంతలో రేణుకను విమలమ్మ పిలిచింది.

రేణుక వంటింట్లోకి వెళ్ళింది.

"ఒంటిగంటదాటింది. భోంచెయ్యండి'' అంది విమలమ్మ.

రేణుక డైనింగ్ టేబిల్ మీద నీట్‌గా సర్ది ఉన్న గిన్నెలమీద మూతలుతీసి

చూసింది.

మల్లెపువ్వులాంటి తెల్లని అన్నం, చికెన్ బిరియాని, మాంసం వేపుడు, ఫిష్ కట్లెట్స్, పొటాటో చిప్స్, ముద్దపప్పు, పప్పుచారు, పెరుగుగారెలు, పెరుగు పచ్చడి, బొబ్బట్లు, సేమియాపాయసం. ఆంధ్రులకు ప్రత్యేకత సంతరించిపెట్టిన గోంగూరపచ్చడి, ఆవకాయ, ఘుమఘుమ సువాసనలు వెదజల్లుతున్న ఆవునెయ్యి, మీగడ పెరుగు.

"ఓహ్....ఒక్కపూటలో ఇన్ని పదార్థాలు ఎలా చేయగలిగావు?" సంభ్రమంగా అంది రేణుక.

"మంగమ్మ సాయంచేసింది"

రేణుక తన గదిలోకి వెళ్ళింది.

ఏదో మేగజైన్ పేజీలు తిరగేస్తున్న విక్టర్ ఆమెనుచూసి చిరునవ్వు నవ్వాడు.

"భోంచేద్దాం, రా!"

"ముందు స్నానంచేయాలి" మంచం మీదనుండి లేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ అన్నాడు విక్టర్.

బీర్వానుండి ఇస్త్రీటవల్ తీసి ఇస్తూ, "అదిగో బాత్‌రూం. వెళ్ళి త్వరగా స్నానం చేసిరా. నాకాకలి మండిపోతున్నది" అంది రేణుక.

"నువ్వూరా"

"ఎక్కడికి ?"



"ఇద్దరం కలిసి స్నానం చేద్దాం..."

"ఏయ్!"

"డార్లింగ్...ప్లీజ్! నీతో కలసి స్నానం చేయాలని నాకెంత కోరికో తెలుసా?"

"నాకటువంటి సరసాలు నచ్చవు కాని నువ్వెళ్లు"

"నీ అణువణువు నాకు తెలుసు. నా అణువణువు నీకు తెలుసు. అటువం టప్పుడు కలిసి స్నానం చేస్తే తప్పేమిటి" లాలనగా అన్నాడు విక్టర్.

"నాకు నచ్చదన్నానా?" అని అతడిని బాత్‌రూంలోకి నెట్టి తలుపు మూసింది రేణుక. ఆమె సుందర వదనంలో సంతృప్తితో కూడుకున్న చిరునవ్వు!

తన జీవిత భాగస్వామిగా విక్టర్ని ఎన్నుకుని తను పొరబాటు చేయలేదు. నిష్కల్మష హృదయం. జీవితం పట్ల నిర్దిష్టమైన అభిప్రాయాలు. తన లాగే నైతిక విలువలకు అధిక ప్రాధా న్యతనిచ్చే వ్యక్తిత్వం. తనంటే అతడి కున్న ప్రేమానురాగాలు. అన్నిటిని మించి అతడి రసికత .

పక్కన చేరి అతడు చేసే చిలిపి చేష్ట అల్లరి గుర్తొచ్చి ఆమె మొహం ఎర్రబడింది.

'డార్లింగ్, ఐ లవ్‌యూ!' తమకంగా అనుకుంది.

విక్టర్ స్నానంచేసి వచ్చాక ఇద్దరూ భోంచేసారు.

"రేణూ! మధ్యాహ్నం టిఫిన్‌కి ఏం చేయమంటావ్?"

డైనింగ్ టేబిల్ శుభ్రం చేస్తున్న



రేణుక తల్లి వయిపు అభిమానంగా చూసింది.

"నిన్న చేసిన మైసూరుపాకుందిగా! దాంతోబాటు బిస్కట్లు, కేకులు చాలు. నువ్వింకేమీ చేయకు. పొద్దున్న పంటకే అలసిపోయావు. వెళ్లి కాస్సేపు విశ్రాంతిగా పడుకో"

"అతడు మోసం చేయడన్న నమ్మకం నీకుందా ?" మనస్సులో అనుమానం బయటపెట్టింది విమలమ్మ.

"విక్టర్ నన్ను మోసం చేస్తాడా?" నవ్వింది రేణుక. "విక్టర్ చాలా మంచి వాడమ్మా! నేనంటే ప్రాణం. ఒకవేళ మిమ్మల్ని, స్వదేశాన్ని వదిలి అతడితో బాటు వాళ్ళ దేశం వెళ్ళేందుకు నేను వెనుకంజ వేయవచ్చు. అతను మాత్రం నన్ని జన్మలో విడిచిపెట్టడు. ఆ విషయమయి నువ్వు నిశ్చింతగా ఉండు"

"ఏ దేశం అతడిది?"

"కెన్యా!"

"చదువు పూర్తయాక నువ్వాదేశం వెళ్ళిపోతావేమో!" దిగులుగా అంది విమలమ్మ.

"వెళ్ళక తప్పుతుందా? భర్త ఉన్న చోటనే భార్య ఉండాలి. ఏ మతస్థుల కయినా అనువర్తించే ధర్మం అది" అని తల్లి వయిపు చూసింది రేణుక. "అమ్మా! విక్టర్‌తో నా పెళ్ళిని నువ్వింత తేలిగ్గా ఒప్పుకుంటావని నిజంగా నేనెదురు చూడ లేదు"

"ఒప్పుకోక ఇప్పుడిహ చేయగలిగిందే ముంది ? పరిస్థితులెప్పుడూ మన కనుకూలంగా ఉండాలని ఆశించడం అత్యాశే అవుతుంది. అలా కాక పరిస్థితుల కనుగుణంగా నడచుకుంటే కనీసం మనశ్శాంతి లభిస్తుంది. అలా అని నువ్వు మతాంతర వివాహం చేసుకోవడం మనస్ఫూర్తిగా హర్షించలేను. మన కులం, మతం, దేశం గొడ్డుపోయినట్లు నువ్వు ఎవరో నీగ్రోని నీ జీవిత భాగస్వామిగా ఎన్నుకోవడం నా మనస్సు మారుమూలల్లో ముల్లుగుచ్చు కున్నట్టనిపించక తప్పడం లేదు. అయితే నీ సుఖసంతోషాలకన్న నాకు కులం, మతం ఏదీ ముఖ్యంకాదు. నేను కోరుకునే దల్లా నీ జీవితం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోవాలనే!"

చప్పున వంగి తల్లిపాదాలు తాకి కళ్ళ కద్దుకుంది రేణుక.

"అమ్మా! నీ కడుపున పుట్టి నిజంగా నేనదృష్టవంతురాలినయాను"

"పిచ్చితల్లీ!" అని ఆపాయంగా కూతురు తల నిమిరింది విమలమ్మ"

"అబ్బాయి ఎదురుచూస్తుంటాడు. వెళ్ళు!"

రేణుక వెళ్ళేటప్పటికి మంచం మీద పడుకుని సిగరెట్ పొగను పైకప్పుకేసి రింగులుగా వదులుతూ ఏదో ఆలోచిస్తున్నాడు విక్టర్.

అతడి ఛాతీమీద గెడ్డం ఆన్చి కళ్ళలోకి తియ్యగా చూస్తూ, "ఏమిటాలోచిస్తున్నావ్?" అంది రేణుక.

ఆమె మొహం మీదికి సిగరెట్ పొగ వదులుతూ, "నేనో మాట అడగనా?" అన్నాడు విక్టర్.

అతడి వయిపు ఆశ్చర్యంగా చూసింది రేణుక "అడుగు"

"స్త్రీ పురుషులు పెళ్ళెందుకు చేసుకుంటారు?"

ఆశ్చర్యంగా చూస్తూనే, "కలిసి జీవించేందుకు .... సృష్టి కార్యక్రమం అనంతంగా సాగిపోయేందుకు" అని నవ్వింది రేణుక.

"స్త్రీ పురుషులు పెళ్ళిచేసుకోవడం

కలిసి జీవించేందుకని ఒప్పుకుంటావు కదూ?"

"ఎందుకు ఒప్పుకోను?"

"మన పెళ్ళయి ఎనిమిది నెలలయింది. మనం ఎన్నాళ్ళు కలిసి కాపరంచేసాము? ఎన్ని రాత్రిళ్లుకలిసి పడుకున్నాము? కొన్ని నిమిషాల సుఖంతో సరిపెట్టుకోవలసి వస్తున్నది. అలా సరిపెట్టుకోవలసిన ఖర్మ నాకేం పట్టింది చెప్పు? నీకు దూరంగా నేను బతకలేను. అది నీకు తెలుసు. నువ్వు నాకు శాశ్వతంగా కావాలని, నీ జీవితంలో ప్రతిక్షణం నాతోనే గడిచిపోవాలని తాళిగట్టి నిన్ను నాదాన్ని చేసుకున్నాను. ఇంటి ఇల్లాలుగా నీ కర్తవ్యం నిర్వర్తిస్తూ నా కనుసన్నలలో నువ్వు వుండాలని ఆశించడం తప్పా? పెళ్లి చేసుకున్నాక భార్యాభర్తలు ఒకరి కోసం ఒకరు బతకాలి. భర్త ఉన్నచోట భార్య ఉండాలి. నువ్వు...నువ్వేం చేస్తున్నావు? తల్లిదండ్రులు, పరువు ప్రతిష్ట లంటూ నన్ను దూరంగా నెట్టేసి అలమటింప చేస్తున్నావు. తల్లిదండ్రులను, తోబుట్టువులను అందరినీవదిలి నేనిక్కడికి ఎందుకని వచ్చాను? మొదట్లో చదువు కోసమయినా, ఇపుడు కేవలం నీకోసం. ఆ నిజం నీకు తెలుసు. ఈ దేశంలో నాకున్న ఒకే ఒక ఆత్మీయురాలివి నువ్వు. అటువంటప్పుడు నీకుదూరంగా ఉండడం నాకెంత దుర్భరంగా ఉంటుందో నువ్వెందు కాలోచించవు? ముఖ్యంగా రాత్రిళ్ళు నువ్వు నా పక్కలో లేకపోవడం. నా అణువణువు నీ కౌగిలికోసం తపిస్తుంటే ఎన్ని రాత్రిళ్ళు నిద్రలేక గడిపానో నీకేం తెలుసు? భార్య ఉండీ విరహవేదనతో తపించిపోతూ దిండుని కావలించుకు పడుకోవలసిన దుర్గతి నాకొక్కడికే పట్టిందేమో! మీ డాడీకి నచ్చచెప్పి ఆయన దీవెనలుపొంది సగౌరవంగా నా వద్దకు వచ్చేస్తానన్నావు. నీమీద ప్రేమ కొద్దీ నీ మాట కాదనలేక అందుకంగీకరించాను. ఈరోజు వస్తావు, రేపు వస్తావు అని వెయ్యికళ్ళతో ఎదురుచూసాను. నెలలు గడిచిపోయాయి. నువ్వు వచ్చే సూచనలేక నిపించలేదు. అసలు మీడాడీతో మన పెళ్ళి విషయం చెప్పే ప్రయత్నం చేసావా?'' విక్టర్ కంఠం కటువుగా ధ్వనించింది.

రేణుక మాటాడలేదు.

''నువ్వు మీ డాడీకి చెప్పివస్తావో, చెప్పకనే వస్తావో నాకనవసరం. వారం రోజులలోగా నువ్వువచ్చి నన్ను చేరకుంటే కోర్టుకి వెళ్తాను''

"కోర్టుకా?'' భయం, ఆశ్చర్యం సమ్మిళితమయిన కంఠంతో అంది రేణుక.

"అవును. నా భార్యను నావద్దకు పంపక నిర్బంధంలో ఉంచారని మీ డాడీ మీద కేసుపెడతాను. అప్పుడు నీ పుట్టింటి పరువు ప్రతిష్టలు ఏమవుతాయో ఆలోచించు...''

"విక్కీ! నీకిది న్యాయం కాదు" ఆరాటంగా అంది రేణుక.

"నేనూరుకుంటే నువ్విలాగే హాయిగా పుట్టింట్లోనే కూర్చుంటావేమో! అందుకే ఇహ నీ మాట వినను. మన పాపాయి నీ కడుపులో పెరుగుతున్న ఈ తరుణంలో నువ్వు నా పక్కనే ఉండాలి"

అవతల గదిలో ఏదో పని చేస్తున్న విమలమ్మ తన ప్రయత్నం లేకనే వాళ్ళ మాటలు వింది. కూతురిని కాపరానికి పంపకుంటే అల్లుడు గొడవచేయక మానడని గ్రహించింది. ఆమె మనస్సు భయాందోళనలతో నిండిపోయింది. అల్లుడినో

తప్పుపట్టలేకపోయిందామె. ఏరికోరి చేసుకున్న భార్యకు దూరంగా ఉండాలంటే ఏ మగాడికయినా కష్టమే. ఇంకా అతను మంచివాడు కాబట్టి ఇన్నాళ్ళూ ఈమాత్రం సహనంగా ఉన్నాడు.

ఇప్పుడిహ కర్తవ్యం ఏమిటి?

కూతురు, అల్లుడు ఒకరినొకరు ఎంతగా కోరుకుంటున్నారో, ఒకరి సాన్నిధ్యంలో మరొకరు ఎంతగా పరవశించి పోతారో ఈ కాస్త వ్యవధిలోనే ఆమె కనిపెట్టింది. ఒకరివయిపొకరు చూసుకుంటున్నప్పుడు కళ్లలో పొంగి పొరలే అనురాగ సుధను ఆమె గమనించక పోలేదు. ముగ్గురు కొడుకులు, కోడళ్ళను చూసింది. రేణుక అక్కను, ఆమె భర్తను చూసింది. ఇంకా ఎన్నో జంటలను చూసింది. ఆమెకు తెలిసినంత వరకు అందరూ సుఖంగా, సంతోషంగానే కాపరాలు చేసుకుంటున్నారు. అయితే ఈ చిన్నకూతురు, అల్లుడు మధ్య ప్రస్ఫుటంగా కన్పిస్తున్న అనురాగం మరెవ్వరిలోనూ కనిపించదు. ముఖ్యంగా రేణుకకు భర్తంటే వెర్రి ప్రేమ అని అనుభవంతో తలపండిన ఆమె ఇట్టే గ్రహించింది. భర్తను అంత గాఢంగా ప్రేమిస్తున్నప్పటికి తల్లిదండ్రుల మనస్సు నొప్పించకూడదు, పుట్టిన వంశానికి కళంకం తేకూడదని కాపరానికి వెళ్లని కూతురి మంచి మనస్సు అర్థం చేసుకున్న ఆమె హృదయం ఆర్ద్రమయింది. జన్మ జన్మలకు రేణుకే తన కూతురుగా పుట్టాలని ఆమె మాతృ హృదయం ఆకాంక్షించింది. ఉత్తమురాలయిన కూతురిని సగౌరవంగా కాపరానికి పంపాలి. మంచి మనస్సున్న అల్లుడిని సంతృప్తి పరచాలి. వాళ్ళ హృదయాలలో తమపట్ల ఉన్న గౌరవాభిమానాలను నిలుపుకోవాలి. కాని అదంత సులభంకాదని ఆమెకు తెలుసు. రేణుక తండ్రిగారికి అసలే కులమతాల పట్టింపు ఎక్కువ. ఈమధ్య శైవ సమాజంలో సభ్యుడుగా చేరినప్పటినుండి మరీ ఛాందసంగా తయారయారు. అటువంటప్పుడు అన్యమతస్థుడయిన ఒక విదేశీ యువకుడిని కూతురు పెళ్ళి చేసుకుందంటే హర్షించగలరా ఆయన. పైగా కూతురికి నెలతప్పింది. మరోవంక వారంరోజుల్లోగా కాపరానికి రాకుంటే కోర్టుకి వెళ్తానని బెదిరిస్తున్నాడు కూతురిని ఇన్నాళ్లూ సహనంగా ఉన్న అల్లుడు. అతడు నిజంగా కోర్టుకి వెళ్ళడమే జరిగితే...? తర్వాత పరిస్థితులు ఊహిస్తేనే వణుకు పుట్టుకొచ్చింది విమలమ్మకు. ఈ ఇంటి పరువు ప్రతిష్టలు ఏమయినప్పటికీ ఆ తర్వాత రేణు పుట్టింట్లో అడుగుపెట్ట జాలదు.

స్త్రీకి అంతకన్నా కఠిన శిక్ష మరొకటుంటుందా?

అసలు రేణుని చూడకుండా తాముండగలరా ?

ముఖ్యంగా ఆమె తండ్రి...

బిడ్డలందర్లోకి ఆయనకు రేణుకంటేనే ఎక్కువ ఇష్టం. ఇంట్లో ఉన్నంతసేపు రేణు తల్లీ, రేణు తల్లీ అంటూ ఆమెను పక్కనే కూర్చోబెట్టుకుంటారు. ఆమె అడిగితే అష్టకష్టాలు పడి కొండమీది కోతినైనా తెచ్చిపెట్టే వెర్రిమమకారం. ఆమె కంట్లో నీళ్లు చూస్తే ఆయన గుండెల్లో రక్తం వర్షిస్తుంది. ఆమెను చూడకుండా పట్టుమని పదిరోజులుండలేరు. బెజవాడ బయలుదేరినా 'నిన్ను చూడకుండా నేనుండలేను తల్లీ! వెళ్లి సరదాగా వారం దినాలు గడిపివచ్చేద్దాం'

అని కూతుర్ని బలవంతంగా బయలుదేరదీస్తారు. కూతురుపట్ల ఆయన మమతానురాగాలు అటువంటివి. అటువంటప్పుడు కూతుర్ని శాశ్వతంగా దూరం చేసుకుని ఆయన మనశ్శాంతిగా ఉండగలరా? ఆయన దీవెనలు పొందకుండా రేణుక వెళ్లిపోవడమే జరిగితే నిశ్చయంగా ఆయన మనస్సు గాయపడుతుంది. అసలే ఆయన బి.పి. పేషంటు. భగవంతుడా... ఏమి గొడవ జరుగుతుందో!

మనస్సుని తెగ కలతపెట్టేస్తున్న ఆలోచనల మధ్య చిన్నకొడుకు మధు గుర్తొచ్చాడు. విమలమ్మకు కాస్త ధైర్యం వచ్చింది. రేణుకలాగే మధు అంటే తండ్రికి ప్రత్యేకాభిమానం. రేణు పెళ్ళి విషయం తండ్రికి తెలియజేసి ఆయనకు నచ్చజెప్పి ఒప్పించగల నేర్పు, ఓర్పు ఒక్క మధుకే ఉంది.

కొద్దిగా తేలికపడ్డ మనస్సుతో పోస్టాఫీసుకి వెళ్ళి వెంటనే బయలుదేరి రమ్మని కొడుకు పేర టెలిగ్రాం ఇచ్చింది



భర్త కౌగిలిలో ఆదమరచి నిద్రపోతున్న రేణుకకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. పక్కకుతిరిగి చూసింది. విక్టర్ ప్రశాంతంగా నిద్రపోతున్నాడు.

హఠాత్తుగా తనకెందుకు మెలకువ వచ్చిందో ఆమెకర్థంకాలేదు. భర్తకౌగిలిలో సర్దుకుని మళ్ళీ నిద్రకుపక్రమించింది.

తలుపు చప్పుడయింది.

ఆ శబ్దమే తనకు నిద్రాభంగం కలిగించిందని రేణుకకర్థమయింది. భర్తకు నిద్రాభంగం కాకుండా అతడి కౌగిలినుండి తప్పించుకుని లేచి వెళ్ళి తలుపు తెరచింది. గుమ్మం అవతల నిలబడిఉన్న మధుని చూడగానే సంభ్రమాశ్చర్యాలతో—

"అన్నయ్యా! నువ్వెప్పుడొచ్చావు?'' అంది.

మంచంమీద నిద్రిస్తున్న విక్టర్ని చూస్తూ – "నేనువచ్చి చాలా సేపయింది. వచ్చినప్పటినుండీ నిన్ను నిద్రలేపేందుకు ప్రయత్నించడం ఇది మూడోసారి. ఎప్పుడూలేంది పట్టపగలు ఏమిటంత గాఢనిద్ర. రాత్రంతా నిద్రపోలేదా?''

చిలిపిగా అన్నాడు మధు.

రేణుక మొహం ఎర్రబడింది.

"వదినకూడా వచ్చిందా?" అంది కాస్సేపు తర్వాత.

''లేదు. నేనొక్కడినే వచ్చాను''

"ఏమిటి విశేషం?''

"నువ్వు చేసిన ఘనకార్యం తెలిసి అభినందించేందుకు ఆఘమేఘాల మీద పరిగెత్తుకు వచ్చాను" చెల్లెలి వయిపు పరీక్షగా చూస్తూ అన్నాడు మధు.

"అన్నయ్యా?"

''మీ వివాహం సంగతి తెలుపుతూ అమ్మ టెలిగ్రాం ఇస్తే వచ్చాను. ఊఁ... నేను అనుకున్నంత అయింది. ఇప్పుడిహ నీ పెళ్ళి నువ్వే చేసుకుని మాకు శ్రమ తప్పించావని తృప్తిపడాలేమో కదూ!''

పెదిమలు కొరుకుతూ మౌనంగా నిలబడింది రేణుక.

విక్టర్ మీద చూపులునిలిపి, "నిజమే. నువ్వన్నట్లు చాలా హేండ్సమ్‌గా

ఉన్నాడు. నీగ్రోలలోనూ అందగాళ్ళుంటా రని ఇతడిని చూసాకే తెలుస్తున్నది" మెచ్చుకోలుగా అన్నాడు మధు.

మాటలసవ్వడికి విక్టర్ లేచి కూర్చు న్నాడు. మధునిచూసి రేణుకవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మధూ అన్నయ్య. అన్నయ్యా... విక్టర్" అని పరస్పరం పరిచయం చేసింది రేణుక.

విక్టర్ చేతిని ఆప్యాయంగా అందు కున్నాడు మధు.

ఇద్దరూ ఒకరివయిపొకరు కుతూ హలంగా, పరీక్షగా చూసుకుంటున్నారు.

తన కత్యంతాప్తులయిన ఆ ఇద్దరు యువకులకేసి విస్ఫారిత నేత్రాలతో చూడసాగింది రేణుక.

"క్షమించండి. మీ అనుమతి లేకుండా మీ చెల్లెల్ని పెళ్ళి చేసుకున్నాను" నేరం చేసినవాడిలా తలవంచుకుని అన్నాడు విక్టర్.

"మీ పెళ్ళి పెద్దలు చేసేదాకా ఆగలేక పోయారు. కదూ?" నవ్వుతూ అన్నాడు మధు.

విక్టర్ మొహం ఎర్రబడింది.

"అది మీ తప్పు కాదు" మళ్ళీ అన్నాడు మధు. "అల్లరి చేసే వయస్సు తప్పు. అందునా మా చెల్లెలి అపురూప సౌందర్యంచూస్తూ ఊరుకోవడం మానవ మాత్రుడి తరంకాదు" చిలిపిగా అన్నాడు మధు.

"అన్నయ్యా!" చిదిపితే రక్తం కారేటంతగా ఎర్రబడి పోయింది రేణుక మొహం.

మధు నవ్వేశాడు.

రేణుకను, విక్టర్ని పక్కపక్కన చూస్తుంటే అతడికెంతో ముచ్చటవేసింది.

స్త్రీత్వానికి నిర్వచనం చెప్పేలా ఆమె ఉంటే, మూర్తీభవించిన పురుషత్వం లాగ అతను...

మేడ్ ఫర్ ఈచ్ అదర్ అని ఇటు వంటి జంటనుచూసే అంటారేమో అను కున్నాడు.

"రేణూ" వంటింట్లోంచి కేకేసింది విమలమ్మ.

"వస్తున్నానమ్మా" అని వెళ్ళి పోయింది రేణుక.

"ఎక్స్ క్యూజ్ మీ. ఇప్పుడే వస్తాను" అని బాత్‌రూంలోకి దూరి తలుపేసు కున్నాడు విక్టర్.

అక్కడే ఓ చెయిర్‌లో కూర్చుని టేబిల్ మీద ఉన్న పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు మధు.

క్షణాలు, నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోతున్నాయి.

రేణుక ట్రేతో తిరిగివచ్చింది.

కజ్జికాయలు, జీడిపప్పు పకోడీలు, పాలకోవాలు మూడుప్లేట్లలో సర్దుతూ ఉండగా బాత్‌రూం తలుపు తెరచుకొని విక్టర్ బయటికివచ్చాడు. తల తుడుచు కుంటూ వచ్చి మధు పక్కనే మరో కుర్చీలో కూర్చున్నాడు విక్టర్.

భర్తకు, అన్నగారికి చెరొక ప్లేటిచ్చి తనో ప్లేటు తీసుకుంది రేణుక.

మధు విక్టర్ని మాటల్లోకి దించాడు.

కాస్సేపటికి కొత్తదనంపోయి విక్టర్ ఫ్రీగా మాట్లాడసాగాడు.

ఇద్దరి సంభాషణ ఎన్నో విషయాలను చుట్టివస్తున్నది.

వాళ్ళ మాటలు వింటూ మౌనంగా కూర్చుంది రేణుక.

కాఫీ తాగాక మధు, విక్టర్లు బయటికి వెళ్ళిపోయారు.

వాళ్లు తిరిగివచ్చేటప్పటికి రాత్రి పదిగంటలు దాటింది.

భోంచేయకుండా వాళ్ళకోసం ఎదురు చూస్తూ కూర్చుంది రేణుక.

"రేణూ! ఓసారిలా వస్తావా?" భోజనానంతరం ముందుగదిలోకి వెళ్తూ అన్నాడు మధు.

"నీకోసం క్షణాలు యుగాలుగా ఎదురు చూస్తుంటాను. ఆ మాట గుర్తుంచుకో" ఒక్క రేణుకకు మాత్రమే వినిపించేంత తగ్గుస్వరంతో చెప్పి ఆమె గదిలోకి వెళ్ళిపోయాడు విక్టర్.

రేణుక అన్నగారి చెంతకు వెళ్ళింది.

"నేనేమో అనుకున్నానుగానీ విక్టర్ చాలా తెలివయినవాడు. ఎంతో దూరాలోచనతోనే నీ మెళ్ళో తాళి గట్టాడు. అంతే పకడ్బందీగా ఎంతో రహస్యంగా నాలుగుగోడలమధ్య జరిగిపోయిన పెళ్ళి చట్టబద్ధం చేయించుకున్నాడు. ఇహ నిన్ను కాపరానికి పంపివేయడం తప్ప మేము ఏమీచేయలేని పరిస్థితి"

"వారంరోజుల్లోగా కాపరానికి వెళ్ళకుంటే నన్ను కాపరానికి పంపకుండా నిర్బంధంలో ఉంచుతున్నారని డాడీమీద కేసు పెడతాడట. అతడి ధోరణి చూస్తే నిజంగా అన్నంతపని చేస్తాడనిపిస్తోంది. నాకు చాలాభయంగా ఉంది..."

"మీరు పెళ్లి చేసుకున్న రోజే నీభర్తను ఇంటికి పిలుచుకువచ్చి డాడీకి పరిచయం చేయక నువ్వు చాలా తప్పుచేసావు."

"నాకంత ధైర్యం ఉంటే ఇంకేం"

"ఇప్పుడేం చేయాలనుకుంటున్నావ్?"

"నాకేం పాలుపోవడంలేదు" నిస్సహాయంగా అంది రేణుక.

"ఏమీ పాలుపోవడంలేదని చేతులు ముడుచుకు కూర్చుంటే ప్రయోజనం లేదు"

"ఇప్పుడు నన్నేం చేయమంటావ్?"

"రేణూ! నన్నడిగితే నువ్వు నీ భర్త దగ్గరికి వెంటనే వెళ్ళిపోవడమే న్యాయమని చెబ్తాను"

"మన ఇంటి గౌరవం రచ్చకెక్కకూడదన్న తాపత్రయంతోనే కట్టుకున్నవాడి మనసు కష్టపెట్టి నేనిక్కడే ఉంటున్నాను"

"ఇక్కడే ఉండి ఏం సాధించావు? డాడీకి నెమ్మదిగా నచ్చజెప్పి ఆయన దీవెనలుపొంది సగౌరవంగా నీ ఇంటికి వెళ్లాలని అభిలషిస్తున్నావు....మంచిదే. అయితే నీవు పెళ్లి చేసుకున్న సంగతి డాడీకి తెలియజేసే ప్రయత్నమే నువ్వు చేసినట్లు లేదు"

"నా పెళ్ళి సంగతి చెప్పేయ్యాలని ఎన్నిసార్లు డాడీని సమీపించానో లెక్కలేదు. అయితే ఎంత ప్రయత్నించినప్పటికీ చెప్పలేకపోయాను. గుండెల్లో దడ. కాళ్లు, చేతుల్లో వణుకు. ఊహుం. ఈ జన్మలో నా పెళ్ళి సంగతి నాకయి నేను డాడీతో చెప్పలేను" నిస్పృహగా అంది రేణుక.

"చెప్పకుంటే ఎలా? రోజు రోజు పెరిగే గర్భాన్ని ఎలా దాచుకుంటావు? మరో వయిపు వారం రోజుల్లోగా నువ్వు తనను చేరకుంటే డాడీమీద కేసు పెడతానని బెదిరిస్తున్నాడు నీ భర్త. అటువంటప్పుడు అతడి వద్దకు వెళ్ళిపోవడంతప్ప నీకిప్పుడు వేరే మార్గం లేదు. అతడు నిజంగా కోర్టుకి వెళ్ళడమే జరిగితే పరిస్థితి చాలా అసహ్యంగా తయారవుతుంది" సాలోచనగా అన్నాడు.

మర్నాడు పొద్దున్న విక్టర్ వెళ్ళిపోయాడు. స్కూటరుమీద అతడి వెనుక కూర్చుని వెళ్ళింది రేణుక హాస్పిటల్‌కి.



జంటగా వెళ్తున్న వాళ్లను వీధిలో అందరూ ఆశ్చర్యంగా, కుతూహలంగా చూశారు. అది గమనించి నవ్వుకుంది రేణుక.

"ఈరోజు డాడీ వచ్చేస్తారు. నాకేమో భయంగా ఉంది" హాస్పటల్ వద్ద స్కూటరు దిగుతూ అంటె రేణుక.

"జరిగేది జరక్కమ నదు. నువ్వు కంగారుపడక నిశ్చింతగా ఉండు" అని ఆమె చెయ్యి నొక్కి వదిలాడు విక్టర్.

అయినప్పటికీ భయాందోళనలతో ఆరోజంతా హాస్పిటల్లో పరధ్యానంగానే గడిపింది రేణుక. సాయంత్రం ఇంటికి వచ్చేటప్పటికి ముందు గదిలో ఆరోజు దినపత్రిక చూస్తూ కనిపించారు ముకుందరావుగారు.

"హాయ్ డాడీ...ఎప్పుడొచ్చారు?" లోపల భయపడుతూ పైకి మామూలుగా పలకరించింది రేణుక.

ఎప్పట్లాగే ఆమెకేసి ఆప్యాయంగా చూస్తూ, "మధ్యాహ్నం వచ్చానమ్మా" అన్నారు ముకుందరావుగారు.

తేలిగ్గా నిట్టూర్చి లోపలికి వెళ్లిపోయింది రేణుక.

"అమ్మా..." తల్లి చేతినుండి కాఫీ కప్పందుకుంటూ అంది రేణుక.

ఆమె భావం అర్థం చేసుకుని తల అడ్డంగా ఊపింది విమలమ్మ.

"నాకు భయంగా ఉంది!"

కూతురు వయిపు చురుగ్గా చూసింది విమలమ్మ. "చేసుకున్నప్పుడు లేని భయం ఇప్పుడెందుకు?" కించిత్ నిష్ఠూరంగా అంది.

కూతురు పెళ్ళి చేసుకుందన్న విషయం తెలిస్తే భర్త ఏమి గొడవ చేస్తారోనని ఆమె హడలిపోతూ క్షణాలు యుగాలుగా గడుపుతున్నది. ఇటువంటి సమస్య తెచ్చిపెట్టిన కూతురుమీద కోపం

ముంచుకువచ్చింది. భార్యను కాపరానికి పంపకుంటే కోర్టులో కేసు పెడతానని బెదిరిస్తున్న అల్లుడిమీద అంతకన్న కోపం వచ్చింది.

"అరె, పెద్దన్నయ్య వచ్చాడు" అంటూ సంభ్రమంగా వచ్చింది రేణుక.

నిరంజన్‌తోబాటు శ్యామసుందర్ కూడా ఉన్నాడు.

ఇద్దరు అన్నలకేసి విస్ఫారిత నేత్రాలతో చూస్తూ "ఏమిటి విశేషం. ఉరుములు, మెరుపులు లేని వర్షంలాగా ఇద్దరూ ఒక్కసారే వచ్చేసారు?" అంది.



"అమ్మ ఏదీ?" ఆదుర్దాగా అడిగాడు నిరంజన్.

"కిచెన్‌లో ఉంది ఏం?"

"అమ్మయ్య. అందరూ కులాసాగానే ఉన్నారుకదా!" నిట్టూర్చి అన్నాడు నిరంజన్.

ఆశ్చర్యంగా చూసింది రేణుక. "నీ మాటలు అర్థంకావడంలేదు?"

"వెంటనే బయలుదేరి రమ్మని మధు టెలిగ్రాం ఇచ్చాడు. ఎవరికేమయిందో

నని హడలిపోతూ వచ్చాము. థాంక్ గాడ్! అందరూ క్షేమంగా ఉన్నారు. ఇంతకీ వాడు బెల్గ్రాం ఎందుకిచ్చినట్లో మీకు తెలీదా ?" అని తండ్రికేసి చూసాడు నిరంజన్.

"ఊహుఁ. నాకేమీ తెలీదు. నేను మొన్న నెల్లూరు వెళ్ళి ఈరోజే తిరిగి వచ్చాను" అన్నారు ముకుందరావుగారు విస్మయంగా.

రేణుకకు అర్థమయింది. ఉద్వేగాన్ని మనస్సులోపలే అణచిపెట్టుకుని మౌనంగా ఉండిపోయింది. విమలమ్మ కొడుకులకు కాఫీ తెచ్చింది. కోడళ్ళు, మనమల క్షేమ సమాచారాలు విచారించింది.

"స్నానాలుచేసి విశ్రాంతి తీసుకోండి. మధు స్నేహితులను పలకరించి వస్తానని వెళ్లాడు. వాడొస్తే సంగతేమిటో తెలుస్తుంది" గుంభనంగా అంది విమలమ్మ.

గంట తర్వాత వచ్చాడు మధు. అన్నల్ని చూసి చలాకీగా పరామర్శించాడు. వాళ్ళేదో అనేలోగా "తీరిగ్గా మాట్లాడుకుందాం. ముందు భోంచెయ్యాలి. ఆకలి మండిపోతున్నది. అమ్మా.. త్వరగా వడ్డించు" అన్నాడు హడావుడిగా.

భోజనానంతరం అందరూ ముందు గదిలోకి వచ్చి కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పు" అన్నాడు నిరంజన్.

తన పక్కనే కూర్చున్న చెల్లెలి చేతిని మధు తన చేతిలోకి తీసుకుంటూ— "మనకెవ్వరికీ తెలీకుండా మన చిన్నారి చిట్టిచెల్లెలు ఒక నీగ్రో కుర్రాడిని పెళ్ళి చేసుకుంది" అన్నాడు తాపీగా.

పక్కలో బాంబు పడినట్లు తుళ్ళిపడి చూసారు ముకుందరావుగారు, నిరంజన్, శ్యామసుందర్‌లు.

"రేణు పెళ్ళిచేసుకుందా...ఎప్పుడు?" ఆశ్చర్యంగా అడిగాడు శ్యామసుందర్.

"ఎనిమిది నెలలయింది" స్థిమితంగా అన్నాడు మధు.

అంత చల్లని సమయంలో రేణుకకు చెమటతో ఒళ్లు తడిసి ముద్దయింది. ఆమె వయిపు సూటిగా చూసారు ముకుందరావుగారు.

"మధు చెబుతున్నది నిజమేనా?"

"అవును డాడీ" తలవంచుకుని అంది రేణుక.

నిరంజన్, శ్యామసుందర్ విభ్రాంతిగా చూస్తున్నారు.

"నీ పెళ్ళి నువ్వే చేసుకునేంత గొప్పదానివయిపోయావన్న మాట" వ్యంగ్యంగా అన్నారు ముకుందరావుగారు.

రేణుక మాటలాడలేదు.

"కూతురు పెళ్ళి చేయలేని అసమర్థుడనుకున్నావా నీ తండ్రి?" మళ్ళీ అన్నారు ముకుందరావుగారు.

"నా మనస్సు కోరే వ్యక్తితో మీరు నా పెళ్ళి చేయించకపోవచ్చునన్న భయంతో, అతడిని పోగొట్టుకోవడం ఇష్టంలేక అనివార్య పరిస్థితులలో నా పెళ్ళి నేనే చేసుకోవలసి వచ్చింది" మంద్రస్వరాన అంది రేణుక.

"ఊహుఁ..అంత తప్పనిసరి పరిస్థితులలో చేసుకోవలసి వచ్చిందా నీ పెళ్ళి. ఇంతకీ నువ్వు చేసుకున్నది ఏ రకం పెళ్ళి?"

"రేణు విక్టర్ని రిజిష్టర్ మేరేజ్ చేసుకుంది" చెల్లెలి తరఫున మధు జవాబు చెప్పాడు.

"నువ్వు సాక్షి సంతకం చేసావా?" వ్యంగ్యంగా అడిగాడు ముకుందరావు

గారు.

"అంత అదృష్టానికి నేను నోచుకో లేదు"

"వాట్ డూ యూ మీన్?"

"చెల్లాయి పెళ్లిసంగతి నాకు నిన్ననే తెలిసింది"

"నీకెప్పుడు తెలిసింది?" భార్య వైపు కఠినంగా చూస్తూ అన్నారు ముకుందరావుగారు.

"నాకు మొన్న తెలిసింది"

"డాడీ....ఎవరికి తెలిసినా, తెలీక పోయినా రేణు విక్టర్ని చట్టబద్ధంగా పెళ్లి చేసుకుంది. జీవితపథంలో అతడితో కలిసి చాలా ముందుకి వెళ్లిపోయింది. ప్రస్తుతం అతడి బిడ్డ ఆమె గర్భంలో పెరుగుతోంది. ఇప్పుడిహ వాళ్ళను ఆశీర్వదించి ఒకటి చేయడంకన్న మనం చేయ గలిగింది ఏమీలేదు"

ముకుందరావుగారు మాటలాడలేదు. ఉబికి వస్తున్న ఆగ్రహావేశాలను బల వంతంగా అదిమిపెడ్తున్నట్లు ఆయన్ని చూస్తేనే తెలుస్తుంది.

రేణుక శిలావిగ్రహంలా కూర్చుంది.

"తెగించి పెళ్లిచేసుకున్నదానివి అతడితో వెళ్లిపోక ఇక్కడ ఎందు కున్నట్లు ?" చాలా సేపటికి అన్నారు ముకుందరావుగారు.

"మీరు మా పెళ్లినామోదించి నిండు మనస్సుతో ఆశీర్వదిస్తేనే నేను నా ఇంటికి వెళ్తాను"

"లేకుంటే...?"

"వెళ్ళను"

"ఊహూఁ" కూతురు వయిపు పరీక్షగా చూసారు ముకుందరావుగారు "నేనంటే ఇంత గౌరవాభిమానాలున్న దానివి నా ఇష్టానికి విరుద్ధంగా మతాంతర వివాహం చేసుకుని మతభ్రష్టురాలివవయా వెందుకు?"

"నా ప్రయత్నం లేకుండా నా పెళ్ళి జరిగిపోయింది" నెమ్మదిగా అంది రేణుక.

భ్రుకుటి ముడివేసారు ముకుందరావు గారు. "నీ మాటలు అర్థం కావటంలేదు?"

అగ్నిపర్వతంలా మండిపడతారను కున్న తండ్రి శాంతంగా మాట్లాడ్డం చూసి రేణుకకు కొండంత ధైర్యం వచ్చింది. "నేను కాదంటానేమోనన్న భయంతో విక్టర్ తొందరపడి నా మెళ్ళో మూడుముళ్లు వేసేసాడు. రెండు జీవితా లను ఒకటి చేసే పెళ్ళి ఎలా జరిగినప్ప టికీ పెళ్ళే! దాని గౌరవం విలువ తగ్గదు. అందుకే విక్టర్తో నా పెళ్ళి దైవనిర్ణయ మని విశ్వసించి..."

"రిజిష్టర్ ఆఫీసుకు వెళ్ళి పెళ్ళి చట్టబద్ధం చేసుకున్నావు" ఆమె మాటల మధ్య అందుకుని అన్నారు ముకుంద రావుగారు. "ఇప్పుడిహ మీ పెళ్ళిని చచ్చినట్లు మేము ఆమోదించాలి. ఎంత ముందాలోచన ! పైగా అతడు తొందర పడి మూడు ముళ్లు వేసాడంటున్నావు. అతడి ముందు నువ్వు తలవంచితేనే కదా అతడు మూడుముళ్లు వేసాడు. హుఁ... ఈ కాలం పిల్లలు తెలివి మీరిపోయారు. పెద్దలకే పాఠాలు చెప్పగలరు"

రేణుక మౌనంగా కూర్చుంది.

"నా కూతురు పెళ్ళి చేసుకుని ఎనిమిది నెలలయింది. ఆ సంగతి నా కిప్పుడే తెలిసింది. ఈ నిజం నలుగురికీ తెలిసినరోజు నేను బయట తలెత్తుకు ఎలా తిరగను?"

"మనకు తలవంపు తెచ్చే పనేమీ చేయలేదండీ మనమ్మాయి. తనకు నచ్చిన

వ్యక్తిని పెళ్ళి చేసుకుంది. అంతే తప్ప అతడితో లేచిపోయి మన పరువు ప్రతిష్టలు వీధుల పాలు చేయలేదు" కొద్దిగా తీవ్రంగా అన్నాడు మధు.

"గౌరవంగా పెళ్ళి చేసుకుంది.మంచిదే! అయితే సంగతి తెలిసాక అమ్మాయిని ఇహ ఇంట్లో ఎలా ఉంచుకోగలం? పైగా నెల తప్పిందంటున్నారు. కాబట్టి మన కిష్టం ఉన్నా, లేకపోయినా దాన్ని తీసుకు వెళ్ళి మొగుడింట్లో దిగబెట్టిరావాల్సిందే. తప్పదు. అయితే 'అతడెవరు? మీ అమ్మాయిని అతడి వద్ద దిగబెట్టి ఎందుకు వెళ్తున్నారు?' అని అడిగేవాళ్ళకు ఏమి సమాధానం చెప్పాలి?"

"నిజమే. మనం బతుకుతున్నది అడవిలో కాదు సమాజంలో. అడిగిన వాళ్ళకు ఏమని సమాధానం చెప్పడం? రేణూ ఎలాంటిసమస్యను తెచ్చిపెట్టావు?" అంతవరకు మౌనంగా ఉన్న శ్యామ సుందర్ కోపం, విసుగు కలిసిన స్వరంతో అన్నాడు.

రేణుక మౌనంగా నేల చూపులు చూస్తూ కూర్చుంది.

"ఒక పనిచేస్తే ?" నిరంజన్ అన్నాడు.

"ఏమిటి?" అన్నారు ముకుందరావు గారు.

"జరిగిపోయిన పెళ్ళికి బాజాలెందుకం టారు. కాని రహస్యంగా జరిగిపోయిన పెళ్ళి పదిమందికి తెలియాలంటే బాజా భజంత్రీలతో మ రో సా రి పెళ్ళి చేసెయ్యడం ఉత్తమ విధానం"

"ఇదేం బొమ్మల పెళ్ళికాదు" కస్సు మన్నారు ముకుందరావుగారు.

"మన గౌరవం, పెద్దరికం నిలుపు కోవాలంటే అంతకన్నా మంచి మార్గం మరొకటిలేదు"

"నిజమే" సాలోచనగా అన్నాడు మధు.

"నా శ్రాద్ధంలాగుంది. అశుభం శుభం తెలీని పిల్లను లొంగదీసుకుని బలవం తంగా పెళ్ళి చేసుకున్న ఆ ద్రాష్టుడి మీద పోలీసు రిపోర్టివ్వక కాళ్లు కడిగి కూతుర్నిచ్చి పెళ్లి చేసి గౌరవించాలా?" ఆగ్రహంగా అన్నారు ముకుందరావు గారు.

"ఏమని రిపోర్టిస్తారు? మనమ్మాయి మైనారిటీ తీరిన పిల్ల. పైగా మెడిసిన్ చదువుతున్నది. తన జీవితాన్ని తనకు నచ్చిన విధంగా తీర్చిదిద్దుకునేందుకు, తన జీవిత భాగస్వామిని ఎన్నుకునేందుకు ఆమెకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్నాయి. తన జీవితం తన ఇష్టం. ఏ విషయంలోనూ ఆమెను మరొకరు బలవంతం చేసే ప్రశ్నేలేదు" మధు అన్నాడు.

మాటల కోసం వెదుక్కుంటున్నట్లు చూసారు ముకుందరావుగారు.

"డాడీ..మరోమాట"మధు అన్నాడు.

"ఏమిటి?"

"వారంరోజుల్లోగా అమ్మాయిని కాప రానికి పంపకుంటే అతను కోర్టుకి వెళ్తాట్ట"

"ఎందుకు?"

"తన భార్యను తన వద్దకు రానివ్వ కుండా నిర్బంధంలో ఉంచారని మీ మీద కేసు పెడతాట్ట... అతడి తప్పులేదు. ప్రేమించి పెళ్లి చేసుకున్న భార్యను వదిలి ఒంటరిగా ఎన్నాళ్లుండగలడు? అతడు కోర్టుకి వెళ్ళడమే జరిగితే మన పరువు ప్రతిష్టలు ఏమవుతాయో ఆలో చించండి!"

కూతురు వంక నిప్పులుగక్కుతున్న కళ్ళతో చూసారు ముకుందరావుగారు.

"ఎనిమిది నెలల కిందటే పెళ్ళిచేసుకుని ఆ సంగతి దాచిపెట్టి నన్నో వెర్రివెధవను చేసావు. ఇప్పుడింక కోర్టుకీడ్చి నీ పుట్టింటి గౌరవం వీధులపాలవుతుంటే చూసి ఆనందిస్తావా? అందుకే కదూ నిన్ను కని అందర్లోకి ప్రత్యేకంగా పెంచి ఇంత దాన్ని చేసాము. భేష్....కన్నవాళ్ళ ఋణం బాగానే తీర్చుకుంటున్నావు..."

రేణుక తల వంచుకుంది.

"పుట్టింటి గౌరవం బజారుపాలు కాకూడదన్న తాపత్రయంతోనే చెల్లాయి భర్తకు దూరంగా ఇక్కడే ఉంటున్నది. మీరా మాట మరచిపోతున్నారు" మధు అన్నాడు. "విక్టర్ మన మతస్థుడు కాడు. అతడిది మనదేశం కాకపోవచ్చు, అయితేనేం యోగ్యుడు. చదువు, తెలివి తేటలు..అన్నివిధాలా మన అమ్మాయికి తగ్గవాడు. జాతి మత విభేదాల పేరిట వాళ్ళను విడదియ్యా లనుకోవడం మంచిది కాదు...."

"అందుకని కులభ్రష్టత్వం పొంది నలుగుర్లో తల వంచుకోవాలా?"

"కులవ్యవస్థ ఏర్పడిననాడు సమాజంలో పరిస్థితులు ఎలాగుండేవో నాకు తెలీదు. బహుశా అప్పుడు వర్ణాశ్రమ ధర్మాన్ని ఆచరించితీరవలసిన పరిస్థితులు నెలకొని ఉండవచ్చు. కాదనను. కాని నేడు..."

ముకుందరావుగారు మాట్లాడలేదు.

"కులాలు, మతాల పట్టింపులు హృదయంలో ఎటువంటి స్పందనాలేక అతి మామూలుగా బతికేవాళ్ళ కోసం" రెట్టించాడు మధు.

"ఆడపిల్ల. అందరూనడిచే మార్గంలో నడవక దీనికి ప్రేమవివాహం కావలసి వచ్చిందా? పైగా దేశం గొడ్డుపోయినట్లు ఆఫ్రికన్ నీగ్రోని వరించింది. రేపు అడిగినవాళ్ళకు సమాధానం ఇచ్చుకోలేక మనకొస్తుంది చావు" శ్యామసుందర్ కోపంగా అన్నాడు.

"ఆఫ్రికన్ ఏమిటి, అమెరికన్ ఏమిటి? ఇవన్నీ నేడు అతి సహజమయి పోయాయి. మీ పెద్దమామగారి కొడుకు అమెరికా వెళ్ళి అమెరికన్ లేడీని పెళ్ళాడి వెంటబెట్టుకుని వస్తే నీతో సైతం అందరూ ఆతగాడిని అభినందించి అందలాలెక్కించలేదూ? అతి తేలిగ్గా ఆమెను తమలో కలిపేసుకోలేదూ? ఇప్పుడు నీ చెల్లెలు ఆఫ్రికన్ని పెళ్ళి చేసుకుంటే తప్పయిందా? పైగా ఇంజనీరింగు చదివిన నువ్వు ఆడ,మగ అంటూ తేడాలతో మాట్లాడుతున్నావు ఏం? ఈ కాలం స్త్రీ మగాడికన్న ఎందులో తీసి పోయింది? రేణుకి ప్రేమ పెళ్ళి కావలసి వచ్చిందా అని ఎంత తేలిగ్గా అనేసావు?

"మరి ఈ రహస్య వివాహం ఎందుకు చేసుకున్నట్లో?" కించిత్ వ్యంగ్యంగా అన్నాడు శ్యామసుందర్.

అతడివేపు చురుగ్గా చూసాడు మధు.

"మనస్సు కోరినవాడిని చెల్లి పెళ్ళి చేసుకోవడం ముందు నీకే ఇష్టంలేనట్లుంది"

శ్యామసుందర్ ఏదో చెప్పబోయాడు.

అంతలో నిరంజన్, "అబ్బ..ఇప్పుడు మీరిద్దరూ పోట్లాడుకోవద్దు. ముందేమి జరగాలో ఆలోచించండి" అన్నాడు.

"ఆలోచించేందుకేముంది? వారంలోగా భార్యను కాపరానికి పంపకుంటే కోర్టుకి వెళ్తానంటున్నాడు విక్టర్. అతడిని అల్లుడుగా అంగీకరించి అమ్మాయిని కాపరానికి పంపడమో లేక కుటుంబ

పరువు ప్రతిష్టలు కొట్టుపోలు చేయడమో వారంలోగా ఏదో ఒకటి నిర్ణయించుకోవాలి"

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

"డాడీ!" పిలిచాడు మధు.

అతడివేపు ప్రశ్నార్థకంగా చూసారు ముకుందరావుగారు.

"నైరోబీలో ఉన్న నా స్నేహితుని ద్వారా అక్కడ విక్టర్ వాళ్ళ కుటుంబ స్థితిగతులనుగూర్చి వాకబుచేయించాను. అతడి తండ్రిగారు అక్కడ చాలా పేరు ప్రఖ్యాతులున్న సర్జన్. ఆ దేశాధ్యక్షుడితో అత్యంత సన్నిహిత స్నేహ బాంధవ్యాలున్న వ్యక్తిట ఆయన. కోటికి పడగలెత్తిన కుటుంబం. నైరోబీలో వాళ్ళ ఇల్లు రాజసౌధంలాగుందిట. విక్టర్ తల్లిగారు బ్రిటిష్ వనిత. ఆమెకూడా విద్యావంతురాలే. అతడి తోబుట్టువులు ఇద్దరు డాక్టర్లు. ఒకతను చార్టెడ్ అక్కౌంటెంట్. ఐశ్వర్యం, చదువు సంస్కారాలు, పేరు ప్రఖ్యాతులు కలిగిన ఆ ఇంట్లో పిల్లనిచ్చేందుకు ఆ కుటుంబంగురించి తెలిసిన ప్రతి ఆడపిల్ల తండ్రి ఉవ్విళ్ళూరుతారట. విక్టర్ మన రేణుకి అన్నివిధాల తగినవాడే. రెండుసార్లు ప్రపంచాన్ని చుట్టివచ్చాడు. కరాటేలో బ్లాక్ బెల్ట్ పొందాడు. మధుర గాయకుడు. మద్రాసు టి.వి,లో అతడి ప్రోగ్రామ్ రెగ్యులర్‌గా ఉంటుంది. ఇక చదువు. బి. టెక్.లో దేశవ్యాప్తంగా అయిదోరాంక్‌లో పాసయ్యాడట. ప్రస్తుతం ఎమ్. టెక్ చదువుతున్నాడు. తర్వాత స్టేట్స్‌వెళ్లి ఎమ్. బి. ఎ. చేసే ఉద్దేశం ఉంది. అతడితోబాటు రేణు వెళ్లి తన కిష్టమయిన సబ్జక్టులో స్పెషలైజేషన్ చేసే అవకాశాలున్నాయి. అసలతడి అభిప్రాయం కూడా అదే. ఇప్పుడు చెప్పండి. అతడిని చేసుకుని రేణు పొరపాటు చేసిందా? ఏ తల్లిదండ్రులయినా కోరుకునేది కూతురు అలా జీవించాలనే కదా! మనకు శ్రమ ఇవ్వకుండా రేణు తన జీవితాన్ని ఉజ్వలంగా తీర్చిదిద్దుకుంది. సంతోషంగా ఆశీర్వదించక ఇంకా ఆలోచిస్తున్నారేమిటి డాడీ?"

ముకుందరావుగారు మాట్లాడలేదు.

తండ్రివంక కోపంగా చూసాడు మధు. "అంతా మీ ఇష్టప్రకారమే జరగాలంటే అమ్మాయి యుక్తవయసుకి రాకముందే పెళ్ళిచేసి ఉండాల్సింది. అలాగయితే మీ నిర్ణయాన్ని కాదనే ధైర్యం తనకుండేది కాదు. అవసరం అంతకన్న ఉండేదికాదు. పెళ్లి చేయకుండా మెడిసిన్‌లో చేర్చారు. తన వ్యక్తిత్వం వికసితం చేసుకునేందుకు అన్ని అవకాశాలు కల్పించారు. పూర్తి స్వేచ్ఛనిచ్చారు. ఇప్పుడు జీవితప్రధాన సమస్య అయిన వివాహ విషయంలో ఆమె ఇష్టంకాదంటే అది అమానుషం అనిపించుకుంటుంది. తన సుఖసంతోషాలు విక్టర్‌తోనే ముడివడి ఉన్నాయి"

ముకుందరావుగారు అప్పటికీ మౌనం వీడలేదు.

మధుకి చిర్రెత్తుకొచ్చింది. "ఇద్దరూ రిజిష్టర్ మేరేజ్ చేసుకున్నరోజే కాపరానికి వచ్చెయ్యమని విక్టర్ నిర్బంధిస్తే అతడితో రేణు ఓ మాట అందిట..."

"ఏమిటా మాట?" మౌనభంగంచేస్తూ అన్నారు ముకుందరావుగారు.

"నీతో అనుబంధం శాశ్వతం చేసుకునే ప్రయత్నంలో నావాళ్ళతో అనుబంధం శాశ్వతంగా తెంచేసుకోలేను.

నాకు నువ్వెంత ముఖ్యమో వాళ్లూ అంతే ముఖ్యం. నేను సుఖంగా, శాంతిగా బతకాలంటే నాకు నువ్వూ కావాలి...నావాళ్లూ కావాలి. పైగా ఆడపిల్ల ప్రవర్తనమీద కుటుంబ పరువు ప్రతిష్టలు ఆధారపడిన సమాజంమాది. ఇప్పుడు నేను నీతోవచ్చేస్తే సాటివారిలో నా తల్లిదండ్రులు నేరస్థుల్లా తలవంచుకోవలసిన పరిస్థితి ఏర్పడవచ్చు. అది నాకిష్టంలేదు. వాళ్ళ గుండెల్లో చిచ్చుపెట్టి నీతో నేనుసుఖంగా, శాంతిగా కాపరం చేయలేను. నన్నింతో ప్రేమించే తల్లిదండ్రుల మనస్సు నొప్పించే స్వార్థపరురాలిని కాలేను. ముఖ్యంగా డాడీ అంటే నాకెంత మక్కువో నీకు తెలీదు. ఎప్పటికయినా డాడీ నన్ను నిండు మనస్సుతో దీవించి నీవద్ద దిగబెట్టి వెళ్ళాలి. అప్పుడే నాకు మనశ్శాంతి. ఆ శుభదినం కోసం నేను ఓపిగ్గా ఎదురు చూస్తుంటాను. నన్ను నువ్వు నిజంగా ప్రేమిస్తున్న పక్షంలో నాతోబాటు ఆరోజు కోసం ఎదురుచూడు...అందిట. ఒకవేళ మీరు కాదంటే ఆమె భర్తవద్దకు వెళ్ళకుండా ఇక్కడే ఉండిపోవచ్చు. ఆ తర్వాత ఆమె జీవితం ఏమవుతుంది? ఆలోచించండి. భర్తే ప్రాణంగా బతుకుతున్న ఆ రాగమయిని దీవించి కాపరానికంపుతారో లేక భర్తనుండి వేరుచేసి ఆమె జీవితంలో చీకటిని నింపుతారో మీ ఇష్టం!"

ముకుందరావుగారు కూతురు వంక తదేకంగా చూడసాగారు.

కాలం నిశ్శబ్దంగా కదిలి ముందుకి సాగిపోతున్నది.

రేణుక తలెత్తి తండ్రివయిపు చూసింది.

భయంగా, జాలిగా, ఆశగా, అర్థింపుగా ఉన్న ఆమె చూపులు సూటిగా ఆయన గుండెలను తాకాయి.

ఈ కూతురు –

తన బిడ్డలందర్లోకి తను ప్రత్యేకంగా పెంచిన ఈ చిన్నకూతురంటే తనకెంత ఎక్కువో ఆయనకాక్షణం బాగా అర్థమయింది. అంతేకాదు తన ఆరోప్రాణమయిన రేణుకి తనంటే అంతులేని అనురాగమన్న నిజం మరోసారి రుజువయింది.

భర్త...తండ్రి!

ఇద్దరిలో ఎవరినో ఒకరిని ఎన్నుకొమ్మంటే ఏ స్త్రీ అయినా భర్తనే ఎన్నుకుంటుంది. అటువంటి స్త్రీ ధర్మానికి అతీతురాలేంకాదు రేణుక.

అటువంటప్పుడు ఇప్పుడు తన పరిస్థితి ఏమిటి?

కూతురు సంతోషం కోసం ఆ నీగ్రో కుర్రాడిని అల్లుడుగా అంగీకరించాలి. ఓటమిని సంతోషంగా స్వీకరించాలి. రేణు తల్లిని దూరం చేసుకుని తను మనశ్శాంతిగా బతకలేడు. అందుకే ఈ ఓటమికి తలవంచక తప్పదు!

ఆయన మనస్సు తేలికయింది.

"రేణూ...ఇలారా తల్లీ" అనురాగార్ద్ర కంఠంతో పిలిచారు.

రేణుక సంశయంగానే తండ్రిని సమీపించింది. ఆమె తల మీద చెయ్యి ఉంచి "నీ అభీష్టానుసారం జరుగుతుంది తల్లీ" అన్నారు ముకుందరావుగారు.

"డాడీ" అంటూ తండ్రి కాళ్లవద్ద వాలిపోయింది రేణుక.

అంతవరకూ బిగబట్టుకున్న నిశ్వాసాల్ని తేలిగ్గా వదిలేసి 'హమ్మయ్య' అనుకున్నారందరూ. ★

# డెలివరీ

సుబ్బలక్ష్మికి కాన్పు కష్టం అవటంచేత సిజేరియన్ చేయాల్సివచ్చింది. సమయానికి భర్త దగ్గరలేడు. పక్కింటావిడ గార్డియన్‌గా సంతకంచేసి ఆపరేషన్ చేయించి గండం తీర్చింది సుబ్బలక్ష్మికి.

కళ్ళు తెరచిచూసిన సుబ్బలక్ష్మికి పక్కనే బాబు కనిపించడంతో తృప్తిగా నవ్వుకుంది. చంటివెధవని దగ్గరకు తీసుకొంటూ "మీ మేలు ఈ జన్మలో మరచిపోలేను పిన్నిగారూ! వారు దగ్గరలేకున్నా సమయానికి మీరుండబట్టి సరిపోయింది. కన్నతల్లినే మరిపించారు" అంది కృతజ్ఞతతో.

"నాదేముందమ్మా! ఆ సమయంలో ఎవరున్నా అలానే చేస్తారు. అన్నట్లు పిల్లలు స్కూల్‌నుంచి వచ్చే సమయం అయినట్లుంది. ఇంటికెళ్ళి వస్తాను" అని సెలవు తీసుకుంది పక్కింటావిడ.

"సిస్టర్! దయచేసి ఈ నంబరుకు ఫోన్‌చేసి మావారికి, బాబు పుట్టాడన్న సంగతి తెలియపరుస్తారా?" - మందివ్వటానికొచ్చిన సిస్టర్‌కి ఫోన్‌నంబరు ఇస్తూ అంది సుబ్బలక్ష్మి.

నర్సు సుబ్బలక్ష్మి ఇచ్చిన నంబరుకు ఫోన్‌చేసింది. "రామారావుగారున్నారా? నేను శాంతి మెటర్నటీ హాస్పటల్‌లో సిస్టర్ని మాట్లాడుతున్నాను"

"నేనే రామారావుని. మా ఆవిడకెలా వుంది సిస్టర్?" ఆత్రుతగా అడిగాడు రామారావు.

"కంగ్రాట్యులేషన్స్! మీ ఆవిడ ప్రసవించింది. తల్లీ, పిల్లాడు క్షేమం. ఓసారి వచ్చి చూసిపోండి!"




"థాంక్యూ సిస్టర్! చాలా సంతోషమయిన వార్త చెప్పారు. కానీ నేనిప్పుడు రాను. రెండో డెలివరీ అయ్యాక వస్తానని చెప్పండి"

"రెండో డెలివరీయా? అంటే ఇంకో ఏడాదన్నమాట?" అంది నర్సు ఆశ్చర్యంగా!

"అయినాసరే నేనిపుడు రాలేను మేడమ్! మా బాస్ ఎంత అడిగినా ఒప్పుకోవడంలేదు. రెండో డెలివరీ అయ్యాకే వెళ్ళమన్నారు. మా ఆవిడతో అదే చెప్పండి" అనేసి ఫోన్ పెట్టేశాడు రామారావు.

నర్సుకి వళ్ళుమండుకువచ్చింది. రామారావు చెప్పిందేదో సుబ్బలక్ష్మికి చెప్పి "అసలాయన ఇటు రాకుండా రెండో డెలివరీ ఎలా అవుతుంది?" అని అరిచింది.

"మా ఆయన పోస్టుమేన్‌గా పని చేస్తారులెండి. పోస్టుమాస్టరు రెండో దఫా

# కథలు



ఉత్తరాల బట్వాడా అయ్యాక వెళ్ళ మన్నారన్నమాట ఆయుష్షు! అదే రెండో డెలివరీ అంటే" సిస్టర్ సందేహాన్ని తీరుస్తూ నవ్వింది సుబ్బలక్ష్మి.

—కోనే. హరిబాబు

# ప్రపంచజ్ఞానం

సుందరమ్మ అంటే ఆ ఊరివాళ్లందరికీ ఇష్టమే. కారణం - అందమైనది. పాస యింది అయిదో క్లాసే అయినా డబ్బుకి కూడా కొదవలేదు. భర్త ఏదో ప్రమా దంలో కీర్తిశేషుడై రెండేళ్లు దాటింది.

ఎవరి దక్షతా లేని సుందరమ్మ ఒంట రిగా కాలం వెళ్లదీస్తోంది. ఏ గొడవా లేని ఆమె ఆ ఊళ్ళో కొత్తగా డిగ్రీ కాలేజీ పెట్టడంతో మొదటిసారిగా పెద్ద చిక్కులో పడిపోయింది. ఆ కాలేజీ ప్లేగ్రౌండు సరిగ్గా సుందరమ్మ ఇంటివెనకే ఉంది. ఒకరోజు ఓ ఫుట్ బాల్ ఎగిరొచ్చి ఇంటి పెరట్లో పడింది. మరో రోజు పక్కన పడింది. ఇంకోరోజు ముందుకే వచ్చిపడింది. చివరికో రోజు ఏకంగా ఇంట్లోకే వచ్చిపడింది.

బంతికోసం గోడదూకి కొందరొస్తే రాజమార్గంనుండి మరికొందరు రాసాగారు. ఇంటి వైనం తెలిసి 'ది ప్రౌఢ బ్యూటిఫుల్ విడో' అనుకున్నారు ఆ కుర్రకుంకలు.

ఆ మర్నాటినుండి బంతి తరచుగా ఇంట్లో పడటంతో పాటు గోడవతలి నుండి సినిమా పాటలు, సోలోలు, డ్యూయెట్లు మొదలయ్యాయి. ఒళ్లుమండు తున్నా ఏమీ చేయలేని పరిస్థితి సుంద రమ్మది. ఊళ్లో ఎవరికి చెప్పినా దండగే. అందరికీ ఆవిడ అంటే మోజే. తామూ ఓ చెయ్యివేసి కసి తీర్చుకుందామనుకునే వారే తప్ప ఆదుకునేదెవరు? తిన్నగా కాలేజీకి వెళ్ళి ప్రిన్స్‌పాల్‌కి చెబుదామను కొంది సుందరమ్మ మొదట్లో. తీరాకాలేజీ గుమ్మందాకా వెళ్ళే కాలేజీ గోడల నిండా 'ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్, విద్యార్థుల్లో ఐక్యత వర్ధిల్లాలి' అని నినాదాలు రాసి ఉన్నాయి. అందువల్ల లాభంలేదనుకుని వెనక్కి తిరిగి వచ్చేసింది.

ఆ తర్వాత ఓ వారంరోజులు తీవ్రంగా ఆలోచించి ఆలోచించి పనిమనిషిని వెంట బెట్టుకుని దగ్గర్లోనే ఉన్న పోలీస్టేషనుకి వెళ్ళింది. పోలీస్టేషను వరండాలో ఇద్దరు పోలీసులు లాఠీలు ఒళ్ళో పెట్టుకుని కునికి పాట్లు పడుతున్నారు.

"ఏందయ్యో! పట్టపగలే నిద్రోతు న్నారు. పోలీస్టేషన్లో దొంగలు పడి తుపా కులు ఎత్తుకుపొమ్మంటే పోరూ!?" అని దీర్ఘాలు తీస్తూ అరిచింది సుందరమ్మ పని




మనిషి.

'దొంగలు' అన్నమాట వినగానే చటుక్కున లేచి ఎటెన్షన్లో నిలబడి ఎదురుగా ఉన్న స్త్రీలను చూసి అవాక్కయి పోయారా ఇద్దరూ.

"ఏటలా సూస్తన్నారు? అమ్మగారేదో రిపోర్టి ఇవ్వడానికొచ్చిరు" అంది ఉరుము ఉరిమినట్లు.

"అట్టా చెప్పవేం మరి! ఎందుకట్టా అరుస్తావు" అని పనిమనిషిని కసిరి సుందరమ్మని లోపలికివచ్చి కూర్చోమన్నారు.

ససేమిరా లోపలికి రానంది–పోలీస్ స్టేషన్లను గురించి పేపర్లలో చదివిన సుందరమ్మ.

చేసేదిలేక ఓ పోలీసు జవాను లోపల్నించి ఓ కుర్చీ తెచ్చి బైట వేశాడు. కానీ వాళ్ళెంత బతిమాలినా సుందరమ్మ కుర్చీలో కూర్చోలేదు.

ఇంటివెనక కాలేజీ కుర్రాళ్ళ అల్లరిని, ఊరివాళ్ల చూపుల బాణాల గురించి – వచ్చిన పని సూటిగా వివరించింది సుందరమ్మ.

ఆమె చెప్పేంవంతా సాంతం విని –

"ఓస్..అంతేనా! ఇంకేటో పెద్ద కేసనుకున్నాం. నేనోమాట చెబుతా ఇనుకో! నీకా ఎనకా ముందూ ఎవరూ లేరు–ఈ పనిపిల్ల తప్ప. ఊరోళ్లెటూ నీమీద కన్నేశారు గనక నువ్వు మా ఎస్ఐ గారి మీద కన్నెయ్యి. గంతే... కేసు గల్లంతవుద్ది. ఊళ్లో తంతంతా మారిపోద్ది. ఆయన నీ ఇంటికి వస్తూ పోతుంటే, మరెవడూ నీకేసి కన్నెత్తి చూడలేడు" అన్నాడో పోలీసు.

సుందరమ్మ అప్పటికే రుసరుసలాడుతూ వెనక్కి తిరిగింది. "మీరేటనుకోకండి. మా అమ్మగోరికి బొత్తిగా పెపంచగానం తెలీదు" అని పోలీసులకి క్షమాపణ చెప్పుకొని సుందరమ్మ వెనక వడివడిగా అడుగులేసింది పనిమనిషి.

# ఓవర్ స్పీడ్

–లక్ష్మి

బ్రహ్మంగారి మఠందగ్గర బస్ కోసం ఎదురు చూసీ చూసీ విసిగివేసారి ఆటోని కేకేశాం. లక్ష్మిథియేటరుకు వెళ్ళాలని మా ప్రయత్నం. ఆటో వచ్చాక ఎక్కాం నేనూ, నా మిత్రుడు గణపతి.

ఆటో కదిలింది. ఆర్.టి.సి. డిపో




మీదుగా తీసుకెళ్ళమని చెప్పేం. డ్రైవర్ అలాగేనని తలూపి స్టార్టుచేశాడు.

ఆటో కదిలి ఓ వందగజాలు వెళ్ళింది. ఈలోగా వెనకనుండి ఓ ఆటో రివ్వున మమ్మల్ని ఓవర్ టేక్ చేసుకుంటూ దూసుకుపోయింది. అదిజూసి మా ఆటో డ్రైవర్ కి వళ్ళుమండినట్టుంది. దాని వెనుక పడ్డాడు. అదే స్పీడుతో రెండు ఆటోలు ఒకదానివెంట ఇంకొకటి చాలా స్పీడుగా. మెరుపులా ఏక్సిడెంట్లను తప్పించుకొంటూ ఓవర్ స్పీడ్ లో వెళ్లి పోతున్నాయ్.

ఆ స్పీడ్ కి మా ఇద్దరికీ భయమేసింది. మా గణపతి భయపడి—"స్పీడ్ తగ్గించవయ్యా మగడా! కొంపలేం తగలడటంలా" అన్నాడు డ్రైవర్ తో. ఆ డ్రైవర్ వెనక్కు తిరిగి చూడలేదు. ఆ స్పీడు అలాగే కంటిన్యూ చేసేడు. ఆ ఆటోని ఓవర్ టేక్ చేయాలని ప్రయత్నించాడు. కానీ ముందున్న ఆటో డ్రైవరు పడనివ్వలేదు.

అప్పటికే నాల్గు ప్రమాదాలు వెంట్రుకవాసిలో తప్పిపోయాయి. నాంపల్లిరోడ్ ఆ సమయంలో రష్ గా వుంది. అయినా వాళ్ళిదువురూ స్పీడ్ తగ్గించలేదు. పోలీసులెవరూ ఆటోలని పట్టించుకోవడం లేదు.. పట్టించుకోరు.

గణపతి బెదిరిపోయాడు. 'గణపతి స్తోత్రం' మొదలు పెట్టాడు. ఓ లారీ, ఇంకో సిటీ బస్సు మమ్మల్ని క్షణాల వ్యవధిలో చావు నుంచి తప్పించాయి.

ఈలోగా మేం దిగాల్సిన స్టాప్ వచ్చేసింది.

మా ముందు వెళ్ళిన ఆటో అలాగే వెళ్ళిపోయింది అదే స్పీడుతో. మా డ్రైవరు ఏదో ఉర్దూలో బండబూతులు తిడుతూ ఆటో ఆపేడు థియేటరుముందు.

గణపతి ఆటో ఆగీఆగక ముందేదిగి అంత స్పీడుగా వచ్చినందుకు తిడుతూ తగవు పెట్టుకున్నాడు డ్రైవరుతో. నేను మీటరుకి సరిపడా చిల్లరకోసం వెతికే ప్రయత్నంలో పడ్డాను.

ఆటోడ్రైవరు కాస్సేపు మా గణపతిని అరవనిచ్చి నా దగ్గర చిల్లర తీసుకొని చెప్పాడు తాపీగా—"ముందు వెళ్తున్నవాడు నా కొడుకండీ! అంత ఓవర్ స్పీడులో వెళ్ళొద్దని లక్షసార్లు చెప్పేను. వాణ్ణి ఆపి తిడుదామని ఓవర్ టేక్ చేయబొయ్యాను. ప్చ్... పిలవలా! దొంగ నాయాలు... రాడా ఇంటికి!"

—చింతకింద ప్రసాదరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
... Compound, Hyderabad - 500 004

